# హోమోపతి
# ఔషధసహజగుణదీపిక: సముదాయమంజరి.

# Characteristic Materia Medica and Repertory

గ్రంధకర్త:-
డాక్టర్. నరశింహదేవర కామేశ్వరరావు, యమ్. డి. హెచ్.
ప్రధానచికిత్సకులు:
గ్రామపునర్నిర్మాణ హోమియోపతీ వైద్యాలయము,
ఆలమూరు, తూర్పు గోదావరి జిల్లా.

ఆర్గనాన్ అను హోమోపతి సిద్ధాంతశాస్త్రము, దీర్ఘవ్యాధుల చికిత్స,
సర్వరోగ సూక్ష్మవైద్యము మొదలగు హోమోపతీ వైద్య గ్రంథకర్తలు.

ప్రథమ ముద్రణ 500 ప్రతులు.

రామచంద్రపురమున
పళ్ళె సేతునారాయణరావు పంతులుగారి
స్వకీయ
శ్రీ ఆనంద తీర్థ ముద్రాశాలయందు ముద్రితము.

1939

 [వెల రూ 4—0—

# అంకితము.

బ్రహ్మశ్రీ నరసింహదేవరాన్వయ పారావార పూర్ణ విధుండును, వెంకటశాస్త్రిగారి దత్తపుత్రులును, అసమానమైన పితృసేవనుగావించి కీర్తిగడించిన ప్రముఖులును, నిత్య కర్మానుష్ఠాన దీక్షాపరులును, ఆంధ్రగీర్వాణ భాషాకవిపుంగవులును, గానకళా కోవిదులును, సమయాసమయములు, జాతి వివక్షత పాటింపక అన్నదానము జేసిన నిరతాన్నప్రదాతలును, నిరర్గళగళచ్ఛబ్దధారా పరంపరా విశేషముచే బోధింపబడిన అసంఖ్యాక విద్యార్థిగణంబు గలవారును, ఆయుర్వేదవిద్యా పారంగతులును, అనుభవచికిత్సా పరిపూర్ణులును, అడిగినది లేదనక తనసంతానంబునే గాక ఆశ్రితజనకోటిని తృప్తిపరచిన దాతలును, ప్రభవాబ్దంబునబుట్టి బహుధాన్య సం॥ర భాద్రపద బహుళ అష్టమీ 17-9-1938 శని వారం మధ్యాహ్నం గం॥ 1-25 ని॥లకు దివంగతులైన మజ్జనకులు శ్రీ పేరుశాస్త్రులు గారికీయీపుస్తకము కృతజ్ఞతా పూర్వకముగ నంకితమొసంగితిని.



గ్రంధకర్త.

ఇట్లు పుత్రుడు,
నరసింహదేవర కామేశ్వరరావు
గ్రంధకర్త.

ఆలమూరు
6-3-1939

# పీఠిక.

హోమియోపతి వైద్యవిధానము మన ఆంధ్రదేశమున విపులముగ వ్యాప్తిజెందుచున్నది. ఆంగ్లమునభ్యసించని ఆంధ్రులనేకులు ఆంధ్రమున ప్రచురింపబడిన కొలది పుస్తకముల సహాయమున యీవైద్యము నభ్యసించి కృషిసల్పుచున్నారు. శాస్త్రమునకు మూలాధారమగు గ్రంథములు ఆంధ్రమున ప్రచురింపబడి యుండక పోవుటచే అట్టి అభ్యాసకుల కృషియందు లోపములు జరుగుచు వైద్యవిధానము అపమార్గమున వ్యాప్తమగుటకు కారణభూతమగుచుండెను. ఈవైద్యవిధానమునకు మూలాధారమగు శాస్త్రీయమైన గ్రంథములు ఆంధ్రమున ప్రచురింపబడిన సరియగు పద్ధతులపై యీవైద్యవిధానము ఆంధ్రదేశమున వ్యాప్తిజెంది ప్రజలకు మహోపకారియై వర్తించగలదను తలంపుతో ఆంగ్లమునగల "ఆర్గనాన్" అను గ్రంథమును ఆంధ్రీకరించి ప్రచురించియుంటిని. పిమ్మట ఆర్గనాన్ యందలి విషయములు తేటతెల్లముగ చికిత్సాపరిజ్ఞానమున కనువగురీతిని విపులపరుప నుద్దేశించి, ఆంగ్లములో గల ఉత్తమగ్రంథములయందలి సారాంశములనుదీసి "దీర్ఘవ్యాధుల చికిత్స" యను నామముతో వేరొకగ్రంథమును ప్రచురించియుంటిని. ఈరెండుగ్రంథముల సహాయమును ప్రతివ్యక్తియు సంపూర్ణమైన శాస్త్రపరిజ్ఞానము సంపాదింపవచ్చును. శాస్త్రపరిజ్ఞానము సంపాదించిన పిమ్మట చికిత్సకు సహాయభూతమగుటకు యీగ్రంథమును ప్రచురించియుంటిని.

ఇంతకుమున్నే తెలుగున ఒకటిరెండు వస్తుగుణదీపికలు ప్రచురింపబడియున్నవి. కాని యీగ్రంథమునందు ఔషధముయొక్క సహజగుణము ప్రత్యేకించి వ్రాయబడినది. ఔషధముయొక్క సహజ గుణముతో వ్యాధియందలి విచిత్రలక్షణమును సరిపోల్చి ఔషధమును

నిర్ణయించవలసియుండును. గాన ఔషధముయొక్క సహజగుణము చేటతెల్లముగ తెలిసికొనుటకు వివిధగ్రంథములయందలి విషయములను సేకరించి యిందు ప్రథమభాగమున ప్రచురించి యుంటిని. మరియు ప్రతిఔషధమునకు విరుగుళ్ళు, సహచరౌషధములు, విరోధౌషధములు ఔషధగుణ కాలపరిమాణము మొదలగు వివరములుగూడ యిందు వివరింపబడెను.

వ్యాధికనుకూలించు శాస్త్రీయమైన సరియగు ఔషధమును నిర్ణయించుటకు విపులమైన సముదాయమంజరి మిక్కిలి అవుసరము. ఆంధ్రమున నింతవరకు విపులమైన సముదాయమంజరి ప్రచురింపబడి యుండలేదు. గాన విపులమైన సముదాయమంజరి ఆంధ్రమున ప్రచురింపవలయునను ఉద్దేశ్యముతో ఆంగ్లమునగల ముఖ్యమైన గ్రంథముల నుండి ప్రధానవిషయములను సేకరించి యిందు రెండవభాగమున విపులముగ ప్రచురించియుంటిని ఈనాప్రయత్నమును ఆంధ్రలోకము ప్రోత్సహించెదరని విశ్వసించుచున్నాను.

ఇందలి లోపములను పాఠకమహాశయులు మన్నించి నాకెరుక పరచిన ముందుముద్రణయందు సవరించుకొందును.

ఆలమూరు
6–3–1939

ఇట్లు విధేయుడు,
డాక్టర్. నరసింహదేవర కామేశ్వరరావు,
యమ్. డి. హెచ్.

# విషయసూచిక.

| | | |
|---|---|---|
| హేమమలిస్ | 71 | [Hamamelis] |
| హెల్లిబోరస్ | 72 | [Helleborus] |
| హెపార్ సల్ఫ్ | 73 | [Hepar Sulph] |
| హైడ్రాస్టిస్ | 74 | [Hydrastis] |
| హయోసియమస్ | 75 | [Hyoscyamus] |
| హైపెరికమ్ | 76 | [Hypericum] |
| ఇగ్నీషియా | 77 | [Ignitia] |
| అయోడీన్ | 78 | (Iodine) |
| ఇపెకాక్ | 79 | (Ipecac) |
| కాలిబై క్రోమికమ్ | 80 | (Kali Bichromicum) |
| కాలికార్బ్ | 81 | [Kali carb] |
| కాలిఅయోడేటమ్ | 82 | [Kali Iodatum] |
| క్రియసోటమ్ | 83 | [Kreosotum] |
| లేకసిస్ | 84 | [Lachesis] |
| లెడమ్ | 85 | [Ledum] |
| లిలియమ్‌టిగ్ | 86 | [Lilium Tig] |
| లైకోపోడియమ్ | 87 | [Lycopodium] |
| మెగ్నీషియాకార్బ్ | 88 | [Magnesia carb] |
| మెగ్నీషియామూర్ | 89 | [Magnesia Mur] |
| మెడోరినమ్ | 90 | [Medoerhinum] |
| మెర్క్యురీసాల్ | 91 | [Mercurius sol] |
| మెర్క్యురీకార్ | 92 | [Mercurius cor] |
| మెజీరమ్ | 93 | [Mezerum] |
| మిల్లిఫోలియమ్ | 94 | [Mille folium] |
| మూరియాటిక్ యాసిడ్ | 95 | [Muriatic Acid] |



# సముదాయమంజరి

# వ్యాధి పరిశీలన.



హోమోపతి వైద్యవిధానమున వ్యాధిచికిత్సకు వ్యాధిలక్షణములచే ఆధారముగ గైకొనవలయునని నిర్ణయింపబడినది. వ్యాధినామమేదైనప్పటికి రోగినివ్యక్తిగతముగ పరీక్షించి, ఆవ్యక్తియందు గోచరించు వ్యాధిలక్షణములకు సారూప్యమగు ఔషధమును ప్రయోగించి చికిత్స చేయవలసియున్నది ఈ వ్యాధిలక్షణములలో సహజలక్షణములను ప్రత్యేకించి, ఔషధ సహజలక్షణములను పరిశీలించి సారూప్యౌషధమును ప్రయోగింపవలెను. ఇట్లు ఔషధమును ప్రయోగించిన వ్యాధి అతిశీఘ్రముగ నివారణ యగును. చికిత్సాసౌకర్యముకొరకు యిందు ప్రథమభాగమున ఔషధసహజ లక్షణములు ప్రత్యేకించి వ్రాయబడెను. రోగవిచక్షణా శాస్త్రమునందు గూడ వైద్యుడు తగుపరిజ్ఞానము గలిగియున్నపక్షమున చికిత్సమిక్కిలి సులభసాధ్యమగును గాన వ్యాధిని చికిత్స జేయుటకు వ్యాధివిచక్షణా శాస్త్రపరిజ్ఞానము గూడ అత్యవసరము.

వ్యాధిని చికిత్స జేయుటకు రోగినేవిధముగా పరీక్షించి వ్యాధిలక్షణములను గ్రహింపవలసినదియు, రోగియొక్క తత్వము, స్వభావము మొదలగు నేయేవివరములు తెలిసికొనవలసినదియు, ఆర్గనాన్ యను హోమోపతి సిద్ధాంత శాస్త్రమునందును, దీర్ఘవ్యాధుల చికిత్స యను గ్రంథమునందును వివరముగ చర్చింపబడెను గాన యిచ్చట నావిషయములు వ్రాయ విరమింపబడెను.

రోగము యొక్క అనారోగ్యస్థితిని వేర్వేరు దృక్పథములనుండి సంపూర్ణముగ గ్రహించుటకు వివిధావయవములయందు గోచరించు వ్యాధిగత మార్పులయొక్క పరిశీలన అత్యావసరము. ఈక్రిందనుదహరింపబడిన విశేషవిషయములను జాగరూకతతో పరిశీలించిన చికిత్సజేయ దలచిన వ్యాధియొక్క తీవ్రత, స్వభావము, మొదలగు విషయములు సుబోధకములుకాగలవు. ప్రతి వైద్యుడును వ్యాధులను జయప్రదముగ చికిత్స చేయుటకై యీ విషయములను ముఖ్యముగ తెలిసికొనవలసి యున్నది. వ్యాధియొక్క స్వభావము, తీవ్రత, తేటతెల్లముగ తెలిసికొనగలిగిన నావ్యాధిని ఎట్టివిధముగ ఎంతటి బలకరమగు ఔషధముచే నేవిధముగ చికిత్స చేయవలయునో గ్రహించి అందుల కనువగు సూటియైన మార్గమును నేర్పరచుకొని జయప్రదముగ చికిత్సజేయుటకు అవకాశముండగలదు.

---

# నాడీపరీక్ష.

—:0:—

హృదయచలనమే నాడిగమనము. నాడిపరీక్షించునపుడు, రోగి నిశ్చలముగ యుండవలయును. హృదయచలనము నుద్రేకింపజేయు కృత్యములు నాడిపరీక్షకవరోధము కలిగించును. గాన ఎట్టిఉద్రేకములేని శాంతావస్థలో నాడిని పరీక్షింపవలయును. ధమని (artery) శరీరోపరిభాగమున యగుపడి చలనమునుచూపు ప్రదేశమునందెల్లను నాడిని పరీక్షింపవచ్చును. సర్వసాధారణముగా మణికట్టువద్దనేనాడినిపరీక్షించుటకు మిక్కిలి ఉత్కృష్టమైనస్థానము. ఇచ్చట నాడి గమనము మిక్కిలి విస్పష్టముగ తెలియగలదు. నాడిపరీక్షించు అవయవమునం దేభాగమునందును బిగువైన దుస్తులు మొదలగువాని మూలమున ఒత్తిడిలేకుండ

జేయవలెను. వైద్యుడు రోగియొక్క బొటనవ్రేలి మొదలు పైనను మణికట్టుజాయింటుపైనను తనబొటన వ్రేలు విడచి తర్వాతగల మూడు వ్రేళ్ళనుఉంచి నాడిని పరీక్షింపవలయును. నాడిగమనమును, గడియారముతో నిముషమునకు ఎన్నిసార్లుకొట్టుచున్నది లెక్కింపవలయును. మరియునాడి, బలముగా వ్రేలును పైకిగెంటినట్లు ఉరకవేయుచు కొట్టుచున్నదా, లేక, గట్టిగా మోటుగా కొట్టుచున్నదా, లేకతీగెవలె నెమ్మదిగా నిస్సత్తువగా కొట్టుచున్నదా, లేక ఒకటి రెండుదెబ్బలు వదలి విడిచివిడిచి కొట్టుచున్నాదా, లేక కనుగొనుటకు వీలులేనంతటి బలహీనముగ కొట్టుచున్నదా లేక అతివేగముగా కొట్టుచున్నదా, మొదలగు విషయములను పరిశీలన చేయవలసియున్నది.

ఆరోగ్యమైనవ్యక్తియొక్కనాడి సమానముగా మితమైన గమనముతో సింపుగా, నెమ్మదిగా వ్రేళ్ళకు తగులుచుండును. స్త్రీలయందును పిల్లలయందును చిన్నదిగను, కొంచము చురుకుగను యుండును. పురుషులనాడికంటె స్త్రీలనాడి గమనము 6 మొదలు 14 దెబ్బలవరకు అధికముగ కొట్టుచుండును. ఈవ్యత్యాసము 8 సంవత్సరములవయస్సు దాటినపిమ్మటనే యగుపడును. ఉదయమునను, భోజనమైనపిమ్మటను నాడిగమనము అధికముగనుండును. పరున్నపుడు కంటె కూర్చున్నపుడును కూర్చున్నపుడుకంటె నిలచినపుడును నాడి వేగముగకొట్టును. పరున్నస్థితికంటె నిలచినస్థితియందు 10 లేక 12 దెబ్బలు అధికముగ కొట్టును శీతలమువల్లను, బడలికవల్లను, భోజనము లేనప్పుడుసమయములయందును నిద్రసమయములయందును నాడి గమనము మందగించును. నడినవయస్సులో ఆరోగ్యమైనవ్యక్తియొక్క నాడి నిముషమునకు 70 మొదలు 75 దెబ్బలవరకు కొట్టును. కాని కొంతమంది వ్యక్తులయందు నిముషమునకు 50 సార్లు నాడికొట్టుచుండినను, యింకను తక్కువగ కొట్టుచుండినను, మరికొంతమంది వ్యక్తు

లయందు నిముషమునకు 90 సార్లు నాడికొట్టుచుండినను గూడ వారు ఆరోగ్యముతో నుండగలరు. మరియు, వివిధవయస్సునందుగూడ యీనాడిచలనమునందు వ్యత్యాస ముండగలదు.

| | | | |
|---|---|---|---|
| గర్భస్థశిశువునందు నిముషమునకు నాడిచలనము సంఖ్య 150. | | | |
| పుట్టిన వెంటనే | 140 | మొదలు | 130 |
| మొదటి సంవత్సరములో | 130 | ,, | 115 |
| రెండవ సంవత్సరములో | 115 | ,, | 110 |
| మూడవ సంవత్సరములో | 110 | ,, | 90 |
| ఏడవ సంవత్సరములో | 90 | ,, | 85 |
| పద్నాలుగవ సంవత్సరములో | 85 | ,, | 80 |
| నడివయస్సులో | 75 | ,, | 70 |
| వృద్ధాప్యములో | 65 | ,, | 50 |

**వ్యాధిస్థితియందు నాడి:—** వ్యాధిస్థితియందు నాడి అధికముగ గాని మందముగగాని కొట్టుచుండును. మరియు విడిచివిడిచి కొట్టుట, అతిసీరసముగ కొట్టుట మొదలగు లక్షణములతో నుండును. నాడి వేగముగను, బలముగను, గట్టిగను, నిండుగను కొట్టుచుండిన శరీరము నందేదో యొకభాగమున ఉద్రేకవాపు గలదని లేక జ్వరముతగిలెనని గ్రహింపవలెను. చిన్నదిగను మిక్కిలివేగముగను కొట్టుచుండిన రోగిపరిస్థితి మిక్కిలి నిస్సత్తువగనుండెనని, గ్రహించవలెను. ఈపరిస్థితి సాధారణముగా సన్నిపాతజ్వరముయొక్క ఆఖరిఅవస్థయందు గాంచ నగును. ఇట్టిస్థితియందు నాడివేగము నిముషమునకు 120 మొదలు 180 వరకును, కొన్నిసందర్భములయందు 200 వరకును గూడ యుండును. 170కు మించిన నాడి వేగము మిక్కిలి ప్రమాదమును సూచించును. నాడి గట్టిగను, చిన్నదిగను యుండిన కంపములువచ్చుస్థితి (convulsive state) కలుగగలదని తెలిసికొనవలెను.

ఈడ్పుగమననాడి (Jerking pulse):—ఇట్టినాడి వేగముగాను, బలముగాను కొట్టుచు, ఆకస్మికముగ ఆగిపోవుచుండిన, హృదయనిర్మాణమునందును హృదయమునందలి గదులలోని రక్తప్రసరణ కారక మూతలలోను దోషముజనించెనని తలంచవలెను.

విడిచిడిచికొట్టునాడి:— ఇట్టినాడియందు, మూడు, నాలుగు, లేక అయిదు, ఆరు, లేక ఏడు ఎనిమిది దెబ్బలకొకసారి నాడి గమనము ఆగి తిరిగికొట్టుచుండును. ఇట్టిస్థితి, హృదయముయందుగాని, ఊపిరి తిత్తులయందుగాని, మెదడునందుగాని, కలుగుదోషమువలన జనించును. మరియు హృదయమునందలి రక్తప్రసరణకారక మూతల యందలి దోషమువలనగూడ జనించును.

దీర్ఘకాలము అధికవ్యాయామము జేయుట, రాత్రిభాగమున మేలుకొనుట, విశ్రాంతిలేకుండుట, మనస్తాపము, మొదలగు కారణములవల్ల నాడికీస్థితి కలుగగలదు. స్వల్పముగ గాలితోకూడిన అజీర్ణ దోషముల మూలమునగూడ కలుగగలదు. తరుచుగా కీళ్ళజబ్బుగల రోగులలోగూడ నీవిధమగు నాడి గాంచనగును. మరియు మలకోసము క్రిందకు జారిన రోగులయందును, యిట్టి వ్యాధి కలుగు సూచనగల రోగులయందునుగూడ యిట్టినాడి యగుపించును.

నిండునాడి:— ఇట్టినాడి రక్తాధిక్యతగల రోగులయందును, తరుణ వ్యాధులలో ప్రథమావస్థయందును గాంచనగును.

నీరసనాడి:— ఇట్టినాడి రక్తహీనమైన రోగులయందును, శరీర నిర్మాణము మిక్కిలి బలహీనముజెందిన వ్యక్తులయందును గాంచనగును

మందనాడి:— శరీరమునందు రక్తముప్రాపించిన యిట్టి నాడిగమనము యగుపించును. మెదడు దోషముగల వ్యక్తులయందు, తలలో నీరుపట్టిన రోగులయందు మెగడుకు దెబ్బతగులుటవలన కలిగిన వ్యాధి పరిస్థితులయందు యిట్టి నాడిగమనము గాంచనగును.

మార్పుజెందునాడి:— నాడి సమముగ ఒక్కవిధముగా కొట్టక మార్పుజెందుచు అనేక విధములుగా కొట్టుచుండిన శరీరమునందలి నర నిర్మాణమునందు (Nervous system) దోషము జనించెనని తలంప వలయును. ఇట్టిస్థితి నరములకు సంబంధించిన జ్వరములలో తరచు కలుగుచుండును. ఇట్టిస్థితిలో జీవశక్తి చాలవరకు నశించియుండును. హృదయదోషమువలనను, ఊపిరితిత్తుల ఉద్రేకస్థితియందును, గూడ ఇట్టినాడి కలుగుచుండును ఇట్టిపరిస్థితి నాడిగమనము మిక్కిలి ప్రమా దకరమని గ్రహింపవలెను.

ఆయుర్వేదవైద్యవిధానములో నాడినిదానమున యింకను నెక్కుడు విశేషములుగలవు చికిత్సావిధానము వాతపిత్తశ్లేష్మనాడి చలనములపై చాలవరకు నాధారపడియుండుటచే, నాడినిదానమున నెక్కుడు విశేషములోనంగబడెను. ఈవిషయములనుగూడ తెలిసి కొనుట మిక్కిలి లాభదాయకము.

---

## శీతోష్ణస్థితి ; ధర్మామీటరు.



శరీరముయొక్క శీతోష్ణస్థితి రోగనిదానమునకు మిక్కిలి స హాయభూతమగును. గాన వ్యాధిచికిత్సయందు రోగియొక్క శరీర శీతోష్ణస్థితి తెలిసికొనుట ముఖ్యావసరము. శరీర శీతోష్ణస్థితిని తెలిసి కొనుటకు థర్మామీటరు నుపయోగించవలసి యున్నది. ఆరోగ్యమైన వ్యక్తియొక్క శీతోష్ణస్థితి ధర్మామీటరులో 98.4 డిగ్రీలు చూపిం చును. దీనిని "నార్మల్" అందురు. థర్మామీటరులో విడువక 99.3 డిగ్రీలకుపైగాని 97.3 డిగ్రీలకు లోపుగాగాని శీతోష్ణస్థితి యగు

పించుచున్న ఆవ్యక్తియందు ఏదో ఒకవ్యాధి గలదని తెలిసికొనవలెను, ఈపైన తెలిపిన డిగ్రీలకు అనగా 97.3, 99.5 డిగ్రీలమధ్య శీతోష్ణస్థితి యున్న పక్షమున స్థానికమైన ఉద్రేకములవల్ల కలిగిన స్వల్పదోషము మాత్రమే గలదుగాని యింతకంటె వేరొండులేదని గ్రహింపవలెను.

భోజనము చేసినపిమ్మటను, వ్యాయామముచేసిన పిమ్మటను, ఎండవేడి మొదలగు బాహ్యోష్ణములు కలుగుట మూలమునను నార్మల్ శీతోష్ణమగు 98.4 డిగ్రీలకుమించి కొలదిగ అధికమైన ఉష్ణమును థర్మామీటరులో యగుపడగలదు నిద్రావస్థలో శీతోష్ణము 1½ డిగ్రీలకు నార్మల్ కంటె తక్కువగాయుండగలదు.

థర్మామీటరుతో శీతోష్ణము కొలచుటకు పాదరసముగల భాగమును చంకయందుగాని, నోటిలో నాలుక క్రిందభాగమునగాని యుంచవలెను. నోటిలోనుంచిచూచిన శీతోష్ణముకంటె చంకక్రింద నుంచి చూచిన శీతోష్ణము 1 డిగ్రీ తక్కువగాయుండును. ఆరోగ్యమైన వ్యక్తులకు నోటిలోనుంచి కొలచిన శీతోష్ణము 98.4 డిగ్రీలుండును

థర్మామీటరు సహాయమున వ్యాధి ఉద్రేకవాపులమూలమున కలిగినదో, లేక ఇతరకారణములమూలమున కలిగినదో తెలిసికొనవచ్చును. ఉద్రేకవాపులలో ఉద్రేకముయొక్క హెచ్చుస్థితి థర్మామీటరుజూపు అధికోష్ణమును బట్టి తెలిసికొనవచ్చును. హిస్టీరియా వ్యాధి నరముల సంబంధమైన ఉద్రేకమని అందరెరింగినదే, గాని హిస్టీరియా రోగియొక్క శీతోష్ణము 98.4 (నార్మల్) డిగ్రీలకు మించి యుండదు. కాని ఉద్రేకవాపులయందు ఉష్ణము అధికముగానుండగలదు. ఒక హిస్టీరియారోగికి మెదడువాచి ఉద్రేకించెను. థర్మామీటరుతో శీతోష్ణమును పరీక్షింప 104 డిగ్రీలుండెను. దీనినిబట్టి యీ అధికోష్ణమునకు కారణము హిస్టీరియా కాదనియు మెదడు

ఉద్రేకించి వాచుటయో యనియు సులభముగ తెలిసికొనుట కవకాశ మిచ్చును.

జ్వరములలో థర్మామీటరు మిక్కిలి సహకారి కాగలదు. సన్నిపాతజ్వరము మొదలగు వ్యాధులలో, శీతోష్ణము, విశేషముగ హెచ్చుటయు, అధికముగ తగ్గిపోవుటయు, ముందురానున్న విపరీత పరిస్థితిని సూచించగలదు. మరియు, ముందుకలుగబోవు ప్రమాద లక్షణములను సూచనచేయగలదు క్షయవ్యాధిలో థర్మామీటరు గొప్పనిదానమును కలుగజేయగలదు ఈవ్యాధి ప్రారంభదినములలో వ్యాధిలక్షణములు మరుగుపడి పైకి యగుపడకుండ నుండును ఇట్టిస్థితి లో వ్యాధిని సక్రమముగ గుర్తించగలిగిన వ్యాధి నివారణ సులభ సాధ్యమగును. ఇట్టిస్థితిలో అనగా ఊపిరితిత్తులయందు వ్యాధిదోష మారంభమైన పరిస్థితియందు రోగియొక్క శీతోష్ణము, 102.3 డిగ్రీలు లేక ఇంకను హెచ్చుగను యుండును. ఉష్ణము హెచ్చినకొలదియు, ఊపిరితిత్తులయందు దోషము అధికమగుచుండును.

వ్యాధిలక్షణములు బహిర్గతముగాని పరిస్థితులలో విడువక రోగికి జ్వరము తగులుచుండిన పక్షమున క్షయవ్యాధి అంకురించి వృద్ధి బొందుచున్నదని నిశ్చయముగ తెలిసికొనుట కవకాశము కలుగగలదు. జ్వరము ఎంతహెచ్చుగానుండునో అంతపరిమాణములో ఊపిరితిత్తులు చెడుచున్నవని తెలిసికొనవచ్చును. జ్వరము క్రమముగా హెచ్చుచున్న కొలది వ్యాధి హెచ్చుచున్నదని తెలిసికొనుట కవకాశము కలదు.

పిల్లలలో న్యుమోనియావ్యాధి కలుగుచున్న విషయమును తెలిసికొనుటకు థర్మామీటరు మిక్కిలి సహకారి కాగలదు.

చలిజ్వరములో, చలి కుదుపువచ్చుటకు కొన్నిగంటలకుముందే శరీరోష్ణము మిక్కిలి హెచ్చుస్థితిలో నుండును.

మహావాతసంబంధమైనకీళ్ళజబ్బులో 104 డిగ్రీల జ్వరముయుగు పడిన మిక్కిలి ప్రమాదము, విషమపరిస్థితులు కలుగగలవని సూచించును. ఈజ్వరమును థర్మామీటరు వలననే తెలిసికొనగలము. ఏవ్యాధియందైనను జ్వరము 104, 105, డిగ్రీలవరకు హెచ్చిన విషమ పరిస్థితులు కలుగగలవని తెలియగలదు.

సమస్త వ్యాధులయందు జ్వరము క్రమముగా తగ్గుచు తిరిగి హెచ్చక తగ్గుదల క్రమగతిని నడచుచున్న వ్యాధి తగ్గి ఆరోగ్యము చేకూరగలదని తెలిసికొనుటకు థర్మామీటరే ఆధారభూతము. న్యుమోనియా వ్యాధిలో జ్వరము కొలది దినములలో తగ్గక, విడువక దీర్ఘకాలము నిలచియున్న విషమపరిస్థితి కలుగగలదనియు, టైఫస్ (విషజ్వరము) సన్నిపాతజ్వరము మొదలగు విషజ్వరములలోను, మశూచికము, విసర్పి, మొదలగు పొక్కుసంబంధమైన జ్వరములలోను హెచ్చుజ్వరము తగ్గకయు, సరియైన నార్మల్ స్థితికి రాకయు యున్నపక్షమున విషమ పరిస్థితి సంభవింపగలదని తెలిసికొనుటకు థర్మామీటరే ఆధారభూతము. జ్వరము తగ్గి వ్యాధితగ్గినసిమ్మట తిరిగి ఉష్ణము హెచ్చినవ్యాధి తిరుగబెట్టినదని తెలిసికొనుటకు థర్మామీటరే ఆధారభూతము

శీతోష్ణము (Temparature) హెచ్చిన స్థితికంటె తగ్గినస్థితి మిగుల ప్రమాదకరము. ఈవిషయము ముఖ్యముగా పిల్లలలో గుర్తించవలసి యున్నది. పెద్దలలోనైనను నార్మల్‌కంటె 2½ డిగ్రీలు హెచ్చినస్థితికంటె 1 డిగ్రీ తగ్గినస్థితి మిగుల ప్రమాదకరము. ఇట్లే 4 డిగ్రీలు హెచ్చినస్థితికంటె 2 డిగ్రీలు తగ్గినస్థితి మిగుల ప్రమాదకరము.

మంత్రము, విసర్పి, న్యుమోనియా, మెనింగైటిస్, మశూచికము, టైఫస్ (విషజ్వరము) విడుపు జ్వరము మొదలగు వ్యాధులలో

శీతోష్ణము 106, 107 డిగ్రీలవరకుకూడ హెచ్చును ఇతరజ్వర సంబంధమైన వ్యాధులలో 104 డిగ్రీలకు అరుదుగా మాత్రమే వచ్చును.

105 మొదలు 106 డిగ్రీలవరకు తగ్గక కొన్ని వారములవరకు టెంపరేచరు నిలచియున్న తప్పక మరణము సంభవించును. టెంపరేచరు (శీతోష్ణము) హెచ్చినకొలది వ్యాధి ప్రమాదస్థితిలోనికి జేరుచుండును

కలరావ్యాధిలో శీతోష్ణము మిక్కిలి తక్కువస్థితిలో అనగా 90, 91 డిగ్రీలలోగూడ నుండును. సూతికాజ్వరము, న్యుమోనియా, ఉదరసంబంధమైన విషజ్వరము మొదలగు వ్యాధులలో హెచ్చుడిగ్రీలలో శీతోష్ణముండి ఆకస్మికముగ మిక్కిలి తక్కువ డిగ్రీలలోనికి దిగిపోవుట కలదు.

సర్వసామాన్యముగా ఒకడిగ్రీహెచ్చిన నిముషమునకు 10 దెబ్బలు నాడి చలనమునందు హెచ్చును. గాని సన్నిపాతజ్వరములో నాడి చలనసంఖ్యకు, శీతోష్ణడిగ్రీల సంఖ్యకు వ్యత్యాసముండును.

అధికోష్ణము ఉదయమునకు తగ్గుదలచూపుట శుభచిహ్నము. రాత్రినుండి ఉదయమునకు హెచ్చుట యిందులకు వ్యతిరేకచిహ్నము.

వ్యాధిలక్షణములయందు సుగుణము యగుపించి తగ్గుచు టెంపరేచరు నార్మలుస్థితిలోనుండక హెచ్చుస్థితిలో నున్న పక్షమున వ్యాధి తిరుగబెట్టగలదనియు, లేక వేరొకవ్యాధిలక్షణములు జనించగలవనియు తెలసికొనవలయును.

టెంపరేచరు (శీతోష్ణము) క్రమముగా హెచ్చుచున్నపక్షమున సన్నిపాతజ్వరమని గుర్తించవలెను.

సన్నిపాతజ్వరములో ఆకస్మికముగ టెంపరేచరు దిగిపోయిన మలాశయరక్తస్రావము సంభవింపగలదని సూచించును.

శీతోష్ణస్థితి వివిధఅంశములలో (డిగ్రీలు) నెట్టిపరిస్థితిని సూచించునో యీక్రింది వివరములనుబట్టి తెలియగలదు.

| | |
|---|---|
| 108.6 | డిగ్రీల కెంపరేచరు (శీతోష్ణము) మరణము నిశ్చయమని సూచింపగలదు. |
| 107 ... ... ... | విడుపు జ్వరములలోతప్ప యితర వ్యాధులయందు మరణసూచకము. |
| 106 ... ... ... | విస్తారమైన జ్వరము |
| 105 ... ... ... | హెచ్చుజ్వరము ప్రమాదకరము |
| 104 ... ... ... | తీవ్రమైన జ్వరము |
| 102 ... ... ... | మితమైనజ్వరము |
| 101 ... ... ... | కొలది జ్వరము |
| 98.4 ... ... ... | నార్మల్ (ఆరోగ్యస్థితి) |
| 98 ... ... .. | సబ్ నార్మల్ |
| 96.6 ... ... ... | ప్రమాదస్థితి (వాతము) |
| 94 ... ... ... | మిక్కిలి ప్రమాదస్థితి (మహావాతము) |
| 93 ... ... ... | కలరాలోతప్ప యితరవ్యాధులలో నిశ్చయ మరణ సూచకము. |

## శ్వాస.

---

ఆరోగ్యమైనవ్యక్తి నిముషమునకు 80 నాడిదెబ్బలకు 20 ఉచ్ఛ్వాసలు, 20 నిశ్వాసలు, విడువవలయును. నాడిచలనమునకట్టి తారతమ్యముతో ఉశ్వాసనిశ్వాసములుండవలెను. ఆరోగ్యమైన స్థితియందు శ్వాస సులభముగను, సౌమ్యముగను, శబ్దములేకుండ క్రమముగను యుండును. వ్యక్తినిబట్టియు, వయస్సునుబట్టియు, స్త్రీపురుష భేదములను బట్టియు యిందు వ్యత్యాసముండును.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | సం॥రము వయస్సునందు నిముషమునకు విడుచు శ్వాసలు | | | 35 |
| 2 | ... | | ... | 25 |
| 15 | ... | | ... | 23 |
| 25 | ... | | ... | 20 |

వ్యాయామము, మానసోద్రేకము, జీర్ణక్రియ మొదలగు వాని వల్ల శ్వాస అధికమగును. వ్యాధివలన శ్వాససంఖ్య 60 మొదలు 80 వరకు హెచ్చును. లేదా పదిమొదలు ఎనిమిదివరకు దిగిపోవును, జ్వరములోను, ఉద్రేకస్థితిలోను శ్వాస అధికమగును. గుండెలు సంబంధమైన జబ్బు ప్రవేశించగనే సర్వసాధారణముగా శ్వాస అధికమగును. మానసికోద్రేకముల మూలమున గూడ శ్వాస అధికమగును. ఇట్లే కొన్ని నరముల సంబంధమైన వ్యాధులలో గూడ శ్వాస అధికమగును. హిస్టీరియా రోగుల శ్వాస నిముషమునకు 60, 70 వరకు నుండును.

జ్వరము హెచ్చినకొలదియు శ్వాస హెచ్చును. హెచ్చుజ్వరములలో ఆయాసముపుట్టి విషమపరిస్థితులలోనికి మార్పుజెందును.

అధికశ్వాస (frequent respiration) ఈ శ్వాసయందు రోగి ఉచ్ఛ్వాస నిశ్వాసములు తరుచుగా విడచుచుండును. ఈస్థితి జ్వరమునందును, ఉద్రేకస్థితులయందును కలుగును. మరియు ఊపిరితిత్తుల యందు బలము తగ్గుటచేతను ఊపిరితిత్తులకు నీరుపట్టుటచేతను, ఊపిరితిత్తులు ద్రేకించుటచేతను కలుగగలదు.

మందమైన శ్వాస (slow breathing):— నరములయందలి దోషమువలన యిట్టి శ్వాసదోషము కలుగును. మెదడుదోషముల వలనను, మగతతో కూడిన వ్యాధిదోషములవలనను గూడ నిట్టి శ్వాసకలుగును.

వేగమైనశ్వాస (quick respiration):— ఈశ్వాసలో ఉచ్ఛ్వాస నిశ్వాసములు అతివేగముగ నడుచును. శ్వాస లోపలకు పీల్చగనే తిరిగి వెంటనే తొందరగా బైటకు విడిచివేయబడును.

కష్టతరమైనశ్వాస (difficult respiration):— ఈ శ్వాసతో, కాళ్ళుచేతులు చల్లగా నుండుట, తలలో అధికమైన ఉష్ణము, మిణుకు మిణుకు మనుచు విడిచివిడిచి కొట్టునాడి, మొదలగు లక్షణములుండు ను ఊపిరితిత్తులనుండి సరియైన రక్తప్రసరణ లేకుండుటచే సిట్టిస్థితి సంభవించును.

ఇట్టి శ్వాసతోనే మూర్ఛ, లేక నిట్టూర్పువిడచుట మొదలగు లక్షణములు ఒక్కొక్కప్పుడుగూడ యుండును.

వేడిశ్వాస (warm breath):— జ్వరములో ఇట్టి శ్వాసవచ్చు ను. కాళ్ళుచేతులు చల్లగానుండి శ్వాసవేడిగా వచ్చుచున్న ఊపిరి తిత్తులువాచి ఉద్రేకించి యుండెనని తెలిసికొనవలెను.

చల్లనిశ్వాస (cold breath):— రక్తప్రసరము మందగించి, రోగి ప్రమాదస్థితిలో నున్నపుడిట్టి శ్వాసకల్గును.

గురకశ్వాస (Noisy respiration).— కంఠములోనికి శ్లేష్మము జేరి క్రిందకు పైకి వెడలని పరిస్థితులలో నిట్టిశ్వాస కలుగును. మరియు ఊపిరితిత్తులకు పక్షవాతము సంభవించిన స్థితినిది సూచనజేయును.

దుర్వాసనగల శ్వాస (offensive breath)·— ఇట్టిశ్వాస దీర్ఘకాలము భోజనము లేకుండుట వలనను, ఋతుదోషములవలనను, విస్తారముగ రసము నుపయోగించుటవలనను, అజీర్ణ లక్షణముల మూలమునను సంభవించును. మరియు నోరును పరిశుభ్రముగా శుభ్రపరుపకపోవుట మూలమునను, క్రిమిదోషముల మూలమునను, అధికభోజనము మూలమునను, మలబద్ధదోషము వలనను కలుగును.

శ్వాసయొక్క వాసననుబట్టి వ్యాధిని గుర్తింపవచ్చును. అతిమూత్రము, మధుమేహముగల రోగులశ్వాస, కొలదిగ ఏపుల్ పండ్ల వాసనగలిగియుండును. అజీర్ణసంబంధమైన వ్యాధులలో ముఖ్యముగా పిల్లలలో శ్వాస పుల్లటివాసనగలిగియుండును. కొన్నిసందర్భముల యందు, గంధకమువాసనయుండును. మూత్రపిండముల సంబంధమైన వ్యాధిగల రోగులశ్వాస మూత్రమువాసన గలిగియుండును. సారాయములను అధికముగ నుపయోగించువారి శ్వాస, పుల్లటివాసన లేక సారాయివాసన గలిగియుండును. పుప్పిపండ్లవలనగూడ శ్వాస దుర్వాసనగ నుండగలదు.

## నాలుకపరీక్ష.

——:O:——

రోగనిదానమునందు నాలుకపరీక్ష మిక్కిలి సహకారికాగలదు. నాలుకలక్షణములు వ్యాధినిర్ణయమునకు మిక్కిలి సహాయభూతమగును.

తెల్లగాను, వెడల్పుగాను, అతిమెత్తగాను, వణుకుచు, పండ్లగుర్తు గలిగి నాలిక, నీరసము, నిస్సత్తువ, రక్తహీనత, పాండువు మొదలగు వ్యాధులను సూచించును. ఇట్టి స్థితిలో రక్తము నీరువలె మారియుండును.

వణుకుచుండెడి నాలుక, లేక నాలుకచాచిన వణుకుచుండుట లక్షణము, సర్వసాధారణముగా త్రాగుబోతులలో గాంచనగును. మరియు నరముల సంబంధమైన అజీర్ణస్థితియందు యిట్టినాలుక లక్షణముండును.

నాలుక మొద్దుబారుట, తినగకుండుట, వణుకుట, మొదలగు స్థితి, మెదడునకు తిమురువ్యాధి (Torpor of Brain) సంభవించినపుడు కలుగగలదు.

నాలుక నెమ్మదిగ మాత్రమే చాచగలుగుట లేక చాచిన పిమ్మట వెంటనే లోపలకు లాగుకొనలేకపోవుట, మొదలగు లక్షణము అధిక బలహీనత లేక మెదడుయొక్క ఉద్రేకము లేక యితరవ్యాధిని సూచించును.

నాలుక ఒకప్రక్కకు పడిపోయియుండుట పక్షవాతమును సూచించును.

నాలుక దళసరెక్కి, మెత్తగానుండి, పండ్లు గంట్లుగలిగియున్న పక్షమున అజీర్ణసంబంధమైన ఉద్రేకమును సూచనజేయును.

నాలుక రెండువైపులను పండ్లు గంట్లుగలిగి యుండుటయు, మధ్యభాగము వాచుటయు, జీర్ణకోశమునందలి నరముల దోషమును సూచించును. మరియు నీవ్యాధి దీర్ఘకాలమునుండి విడువక వృద్ధిజెందు చుండెనని సూచించును. ఇట్టినాలుకగలరోగి నరముల ఉద్రేకము, కోపము, చిరాకు, నిరాశ మొదలగు వ్యాధిలక్షణములను గలిగియుండును.

పసిరి, లేక పేటలుదీసి, వాచియున్ననాలుక జీర్ణకోశమునందలి నరములు మిక్కిలి విపరీతముగ వ్యాధిగ్రస్తమయ్యెనని సూచనజేయును. మిక్కిలి ఎఱ్ఱగానున్ననాలుక జీర్ణకోశమునందలి ఆమత్వచలులు, మల కోశమునందలి ఆమత్వచలులువాచి ఉద్రేకించెనని తెలియజేయును.

నాలుకపైవాచిఃపూత:— నాలుక మొదలునగల పూత అంతగ వ్యాధిస్థితిని సూచింపదు. ఆరోగ్యమైన వ్యక్తులుగూడ యిట్టిపూతగలిగి యుండుట కలదు.

నాలుకపైగల దట్టమైన వాచి, పూత (Conting) జీర్ణకోశము యొక్క ఉద్రేకస్థితిని సూచించును. నాలుకపై దట్టమైన పసుపురంగు పూత యున్నపక్షమున ప్లీహాసంబంధమైన వ్యాధిని సూచనజేయును. చిక్కని గోధుమరంగు, లేక బూడిదరంగుపూత, దుష్టజ్వర లక్షణము లను సూచనజేయును.

పొడియారి నల్లగా పీచు పేరుగునాలుక విషజ్వరమును సూచించును నాలుకవంచలను, చిగురుభాగమునను, ఎర్రగానుండి, మధ్య పొడియారిన ఎర్రచారయున్న పక్షమున విలక్షణమైన సన్నిపాత జ్వరమును లేక అజీర్ణ జాతి జ్వరమును సూచించును.

సీసపురంగువంటి నాలుక కలరావ్యాధిలో గాంచనగును. జీర్ణ కోశమునందలి, ఊపిరితిత్తులయందలి రణములను (Gangerene) గూడ నిట్టిరంగు నాలుక సూచనజేయును.

సీసపురంగు నాలుకయుండి అందుపై పొక్కులు, పుండ్లు గున్న ఎట్టిపరిస్థితులయందైనను మరణము తప్పదని సూచించును.

నీలివర్ణపునాలుక సిరోధము కల్గింపబడిన రక్తప్రసరణను సూచనజేయును.

నాలుకపై నల్లనిపూత గ్రహణివ్యాధియందు అతి నిస్త్రాణను లోపలి అవయవభాగములు పుండుపడి కుళ్ళినస్థితిని సూచించి మరణము సంభవింపగలదని తెలియజేయును. కామెర్ల జబ్బులో యిట్టి నాలుక ప్లీహదోషమును సూచించును. మశూచికములో నిట్టిపూత మిక్కిలి అననుకూలమైన చిహ్నం.

నల్లటి పొడియారి పీచువలెనుండి పణకెడినాలుక రక్తదోషముతో కూడిన ఉదర సంబంధమైన లేక విషతుల్యమైన విషజ్వరమును సూచించును.

పీచు పేరుగునట్లుండు నాలుక (Furred tongue) :— ఇట్టినాలుక కొంతనుంది ఆరోగ్యమైన వ్యక్తులయందుగూడ ఉదయమున గాంచవచ్చును. ఇట్టినాలుక అనారోగ్యమైన పుండ్లవలనను, నోటివాపు, కంఠమువాపు, ఇగుళ్ళువాపు మొదలగు ఉద్రేకములమూలమున గూడ గలుగవచ్చును. ఇట్టి కారణములవల్లగాక, యిట్టిస్థితిలో నాలుక పొడి

యారి యున్నపక్షమున యిట్టినాలుక యేదియోయొక జ్వరమునుసూచన జేయును. తీవ్రమైన ఉద్రేకవాపు జ్వరములలోను, కీళ్ళవ్యాధులలోను వెన్నవంటి పీచురేగిన పూతతో నాలుకయుండును. ఈవ్యాధులు ముదిరినకొలది యీపూత దట్టమై నలుపు లేక బూడిదరంగు వర్ణములోనికి మారి, నాలుక పొడియారి పగుళ్ళతోనుండును.

తరుణవ్యాధులలోను తాత్కాలిక జ్వరములలోను పీచువలె లేచు యిట్టిపూత క్రమముగా నాలుక చిగురుభాగమునుండియు వంచలనుండియు, తగ్గిపోవుచు మధ్యభాగమున కల్పబడుచుండిన వ్యాధి మళ్ళుచుండెనని సూచించును. ఇట్టిపూత విభాగమై పెరకులవలె కల్పించు, తడితోకూడిన ఎర్రిటి నిగనిగలాడెడి మెత్తటి ప్రదేశమును మచ్చలుగా వదలుచుండిన అంతరంగిక దోషము విడుపడుచుండెననియు, ఆరోగ్యము చేకూరుటకు అవరోధముగలదనియు సూచించును.

## మలపరీక్ష.

వ్యాధులలో విరేచనములు వెడలుట లేక మలబద్ధము కలుగుట సంభవించును. గాన మలపరీక్షగూడ రోగనిదానమునకు ముఖ్యావసరము. ఆరోగ్యమైన వ్యక్తులయందుగూడ విరేచనముల సంఖ్య, మలముయొక్కరీతి తరుచుమార్పుజెందుచుండును. ఈమార్పు భుజించు ఆహారమునుబట్టియు, శీతోష్ణస్థితులనుబట్టియు, కలుగుచుండును. చంటి పిల్లలకు దినమునకు 3 మొదలు 6 విరేచనములవరకు అగుచుండును. వయస్సులోనున్న వ్యక్తులకు దినమునకొక విరేచనమగును. వృద్ధులలో నింకను తక్కువయగును.

విరేచనములువెడలు వ్యాధిలో దినమునకు 2, 3 విరేచనములు మొదలు 40 లేక 50 విరేచనముల వరకు వెడలును.

వ్యాధిస్థానము ఉదరమునగాక యితరస్థానమున జనించిన తరుణ వ్యాధులలో ప్రారంభమున విరేచనములు వెడలుచుండుట అననుకూల చిహ్నము. తరుణవ్యాధి మధ్యనుగాని, కొంతవ్యాధి గమనము నడచిన పిమ్మటగాని, వ్యాధిలక్షణము లదృశ్యమై విరేచనములు ప్రారంభించుట ప్రమాదకరము.

రోగికి స్మృతిలేకుండ అప్రియత్నముగా విరేచనములు వెడలుచున్న పక్షమున ప్రమాదమును సూచించును. ఇట్టిస్థితి తీవ్రమైన జ్వరములలో ఆఖరిదశయందు కలుగును. ముఖ్యముగా సన్నిపాతజ్వరములో కలుగును మలకోశములకు పక్షవాతమువచ్చి యిట్టి స్థితికలుగును.

మలబద్ధము కండరముల బలహీనత వలనను, మలకోశముల కార్యక్రమ ధర్మలోపము వలనను కలుగగలదు. మరియు మలకోశములకు సరిగా పైత్యరసము జేరకుండుటచేగూడ గలుగును రక్తహీనత వలనగూడ మలబద్ధము కలుగును.

గట్టిగా పిష్టముకట్టి వెడలు విరేచనము మలకోశములయందు వెలువరించుశక్తి లోపించుటచేతను, అంతరంగమునగల అధికమైన వేడి వలన లేక తను ఉష్ణలోపమువలన కలుగగలదు కోశములలో అవసరమైన తేమలోపించుటచేగూడ నిట్టివిరేచనము వెడలును.

పిల్లల విరేచనములు పల్చగానుండును. వయస్సు వచ్చినకొలదియు గట్టిపడును.

వ్యాధులలో వెడలు విరేచనము గట్టిగా మట్టివలె పొడియారి వెడలును లేదా పల్చగా మట్టిరంగులోగాని, తెలుపుగా చీమువలెగాని వెడలును.

మతిభ్రమ సంబంధమైన వ్యాధులలోను, శూల మొదలగు వ్యాధులలోను మలబద్ధముకలిగి విరేచనముగుట కష్టతరముగానుండును.

దీర్ఘకాలము విరేచనముగాకయుండి పిమ్మట వెడలిన విరేచనము గొఱ్ఱె పెంటికలవలె నుండును.

పాలుత్రాగు పిల్లలవిరేచనములు లేతపసుపురంగులో వెడలును.

ప్లీహదోషముగల వ్యక్తుల విరేచనములు తెలుపు లేక బూడిద రంగుగాను, మట్టిరంగుగాను వెడలును. రాసాధిక్యతవలన వెడలు విరేచనము గౌరవర్ణముగాను, చిక్కనిరంగులోను వెడలును. విరేచనము ఎఱ్ఱగానున్న అందురక్తము గలదని గ్రహించవలెను. గ్రహణి విరేచనము ఇట్టివిధముగా నుండును. ప్లీహము కాలేయమువాచుట ఉద్రేకించుట వలనను యిట్టివిరేచనములు వెడలును. టైఫస్, సన్నిపాతము, మొదలగు జ్వరములలోను మూలశంఖవ్యాధులలోను ఇట్టివిరేచనములు వెడలును.

నల్లటి దుర్వాసనగల విరేచనములు, ప్రమాదస్థితిని సూచన జేయును.

## మూత్ర పరీక్ష.



మూత్రపిండములు (Kidneys) రక్తమునుండి అపరిశుద్ధపదార్థమును వేరుపరచి మూత్రమురూపమున వెలువరించును. రక్తమునుండి అపరిశుద్ధపదార్థమును మూత్రపిండములు వేరుపరచి వెలువరింపని పక్షమున శరీరనిర్మాణము తీవ్రమైనవ్యాధికి లోనగును. గాన మూత్రపిండములు ఆరోగ్యస్థితియందుండుట మిగుల క్షేమకరము. మూత్రపిండములలో తయారైన మూత్రము మూత్రవాహికల ద్వారా (ureters) మూత్రకోశములోనికి (Bladder) జేరును. మూత్రకోశమునుండి మూత్రద్వారముద్వారా మూత్రము బైటకుబోవును.

ఆరోగ్యమైన వ్యక్తియొక్క మూత్రము వట్టిగడ్డిరంగులో నుం డును. లేక ఎట్టిరంగునులేక స్వచ్ఛముగానుండును. మధ్యాహ్నకాల మునందుకంటె ఉదయమున రంగు కొంచెము దరరంగులో నుండును. మరియు కొలదపాటి నవాసారద్రావకము వాసనగలిగి ఎట్టిమడ్డియులేక స్వచ్ఛముగ నుండును. వయస్సు ముదిరినకొలదియు మూత్రము కొం చెము ముదరరంగుగలిగి కొలదివాసన గలిగియుండును. వివిధరకముల ఆహారపానీయములు మూత్రముయొక్క రంగును, వాసనను మార్పు జెందించును

ఆరోగ్యమైన వ్యక్తియందు ఎట్టిబాధయులేకుండ దినమునకు అనగా 24 గంటలలో 40 మొదలు 45. ఔన్సుల మూత్రము దినము నకు నాలుగు మొదలు ఆరుసార్లువరకు వెడలును. ఇంతకు అధిక సం ఖ్యలోగాని, తక్కువ సంఖ్యలోగాని, అధికపరిమాణములోగాని, త క్కువ పరిమాణములోగాని వెడలిన పక్షమున (కొలది వ్యత్యాసము పాటింపనవసరములేదు) వ్యాధిదోషముగలదని గుర్తించవలెను. విశే షముగ నీరునుగాని, పానీయములనుగాని త్రాగిన మూత్రమధికమగును ఈవిషయమును గమనించవలెను.

మూత్రమందు 100 పాళ్ళలో 93 పాళ్లు నీరును, తక్కిన 7 పాళ్ళలోను యూరియాసెలెక్ యితరపదార్థములును యుండును.

ఆరోగ్యమైన వ్యక్తియొక్క మూత్రముయొక్క సాంద్రత (Specific gravity) 1010 మొదలు 1025 మధ్యయుండును. ఈసాం ద్రిత యూరినోమీటరు అను సాధనమువలన కొలవవచ్చును. ఈసాధ నము ఔషధవర్తకాలయములలో విక్రయింపబడును.

బొట్టువ్యాధియందు మూత్రముయొక్కసాంద్రిత 1015 నుండి 1004 వరకు తగ్గియుండును. 1000 వరకుగూడ కొన్ని సందర్భములలో

తగ్గిపోవును. మధుమేహవ్యాధిలో మూత్రముయొక్క సాంద్రత 1025 మొదలు 1040 వరకు యుండును హిస్టీరియా వ్యాధిలో సాంద్రత 1007 వరకు తగ్గియుండును. అతిమూత్రవ్యాధిలోగూడ మూత్రముయొక్క సాంద్రత 1003 మొదలు 1007 వరకు తగ్గియుండును. 1000కు గూడ తగ్గును. మూత్రములో ఫాస్ఫేట్లు పోవుచున్న సాంద్రత 1037 వరకు హెచ్చగలదు. సాంద్రత 1015కు తక్కువగాయున్న శ్వేత ధాతువునుగూర్చి పరీక్షింపవలసి యుండును.

మూత్రముయొక్క సాంద్రత 1030కి దాటియున్న పక్షమున మూత్రములో తప్పక పంచదార (Sugar) కలదని గ్రహింపవలెను. హెచ్చుసాంద్రతగల మూత్రములో పంచదార లేనిపక్షమున యూరిక్ యాసిడ్ కలదనియు, హెచ్చుసాంద్రత కదియే కారణమనియు గ్రహించవలెను.

ఆరోగ్యమైన మూత్రమునందు కొలదిగ ఆమ్లము (Acid) యుండును. ఈవిషయము నీలి లిట్మస్ కాకితము (Blue litmus) మూలమున తెలిసికొనవచ్చును. ఈకాకితమును మూత్రమునవేసిన మూత్రమునందు ఆమ్లమున్నచో ఎర్రగ రంగుగ మారిపోవును. ఈకాకితములు ఔషధ విక్రయాలయములలో విక్రయించబడును. మూత్రములో ఆమ్లమధికమైనచో యిటుకపొడివంటి మట్టిజేరుటయేగాక రాళ్లు కూడ బయలుదేరును. కీళ్ళవ్యాధి జనించును. కీళ్ళజ్వరములో మూత్రమునందు ఆమ్లమధికముగనుండును.

మూత్రములో క్షారము (Alkalive) అరుదుగా కలుగుచుండును. మూత్రములో ఎర్ర లిట్మస్ కాకితము (Red litmus paper) వేసిన అందుక్షారమున్న యీకాకితము నీలివర్ణముగ మారిపోవును. ఇట్టిదోషము దీర్ఘకాలమున్న యీదోషమువలన నరములబలహీనత మనస్తాపము, శుక్లనష్టము మొదలగువ్యాధులు జనించును.

మూత్రముద్వారా శ్వేతధాతువు పోవుచుండును. మరికొన్ని సందర్భములయందు రక్తము, చీము వెడలును. ఈస్థితి వ్యాధిస్థితిగ పరిగణించి తగు చికిత్సచేయవలెను. దీనిని పరీక్షించువిధము ముందు తెలుపబడెను.

మబ్బురంగుగల మూత్రము రక్తముపోవుచున్న విషయమును సూచించును.

ఎరుపురంగు మూత్రమునందు సర్వసాధారణముగా అధికముగా ఆమ్లముండును.

ముదరరంగు పసుపుపచ్చని మూత్రములో పైత్యరసముగలదని గ్రహింపవలెను. ఇయ్యది కామెర్ల రోగమును సూచించును. మరియు రక్తములో పైత్యరసము అధికముగ గలదని సూచించును.

ముదరరంగు బూడిదవర్ణమూత్రము, లేక నల్లటిమూత్రము మిక్కిలి దుష్టమైన వ్యాధులయందు కలుగును.

ఇట్టిమూత్రము రక్తము విషతుల్యమగుచున్న విషయమును సూచించును. మరియు ధాతుమజ్జామల పదార్థము (Tissues) అతి వేగముగ వ్యాధిగత మార్పుజెందుచుండెనని గ్రహించవలెను.

మరికీగానున్న మూత్రమునందు, ఆమము, చీము. గలదని గ్రహింపవలెను.

పాలినరంగురోగల మూత్రమునందు యూరియా సీసు అధికముగ గలదనియు లేక పంచదార గలదనియు గ్రహింపవలెను.

స్వచ్ఛమైన మూత్రము హిస్టీరియా రోగులయందు గాంచ నగును.

మూత్రము విడుచునప్పుడు నురిగకట్టి తేలును. ఆరోగ్యమైన మూత్రమునందు యీనురగ వెంటనే కరగిపోవును. అట్లు కరుగక

చాలసేపు నిలచియున్న పక్షమున, మూత్రమునందు శ్వేతధాతువుగాని, పైత్యరసముగాని యున్నదని గ్రహించవలెను

మూత్రము ఎర్రగానుండి నాడిచలనము వేగముగనున్న పక్షమున తత్వదోషముతో గూడిన జ్వరమును సూచించును.

మూత్రము పాలిపోయిన రంగులో చిక్కగా వెడలుచున్న నరముల సంబంధమైన వ్యాధిదోషము గలదని గ్రహించవలెను.

పిల్లలయొక్క మూత్రము పాలరంగులో వెడలుచున్న మలకోశములలో నులిపురుగులు, పాములుగలవని ఊహింపవచ్చును.

మూత్రము నల్లగా చిక్కగాయున్న, శరీరభాగములు కృళ్ళిరణములు జనింపగలవని గ్రహింపవలెను. రణములు కృళ్లినస్థితిలోగూడ నిట్టిమూత్రము వెడలును.

మూత్రముపై నూనెజిడ్డువంటి పదార్థము తేలుచున్నపక్షమున తీవ్రమైన తత్వదోషము వృద్ధిజెందుచున్నవని గ్రహించవలెను.

మూత్రము రక్తవర్ణముగను, చిక్కగను, మురికిగను యుండి క్రిందకు విస్తారముగ మడ్డి జేరుచున్నపక్షమున రక్తముచెడిపోవుచున్నదని గ్రహించవలెను.

మూత్రమప్రయత్నముగా వెడలుచున్న పక్షమున మూత్రకోశమునకు పక్షవాతము గల్గుచున్నదని గ్రహించవలెను. జ్వరములలో మూత్రమప్రయత్నముగా వెడలుట ప్రమాదకరచిహ్నము.

శరీరమునుండి వెడలు చెమట ఆకస్మికముగ నిరోధమైనపక్షమున విస్తారముగ మూత్రము వెడలును.

విరేచనము లధికముగా వెడలుచున్నను, చమట విస్తారముగ పోయుచున్నను మూత్రముతగ్గి కొంచెము ముదరరంగులోవెడలును.

## మూత్రరసాయనపరీక్ష.

భోజనమైనపిమ్మట విడుచుమూత్రమునకును, వివిధసమయములయందు విడుచు మూత్రమునకును వ్యత్యాసముండునుగాన మూత్రము పరీక్షించుటకు 24 గంటలలో విడుచు మూత్రము ఒకచో నిలువచేసి అందుండి కొంతమూత్రమును తీసికొని పరీక్షచేయవలయును.

మూత్రమును పరీక్షించుటకు యీక్రింది పరికరములను సేకరించవలెను.

1. నాలుగు లేక ఆరు ఔన్సుల మూత్రముపట్టునట్టి కినువగు రెండు గాజుగ్లాసులు.
2 1000 మొదలు 1060 వరకు లెక్కచూపు యూరినోమీటరు (మూత్రముయొక్క సాంద్రత (Specific gravity) చూపుసాధనము)
3. ఒక గాజుగొట్టము (Test tube)
4. ఒక స్పిరిటులాంపు.
5. నైట్రిక్ యాసిడ్, ఎసిటిక్ యాసిడ్.
6. లిక్కర్ పొటాష్, లిక్కర్ సోడా.
7. పొటాసియమ్ ఫెర్రోసైనేడ్.
8 గాజుగళ్ళా, వడపోతకాగితము.

## సాంద్రత పరీక్షించు విధము.

ఇరువదినాలుగు గంటలలో విడిచినమూత్రమునుండి 4 ఔన్సుల మూత్రమును ఒక గుండ్రని గాజుగ్లాసులోనికి తీసుకొని మూత్రముపై నురగలేకుండునట్లు తొలగించి యూరినోమీటరు అంచు తేలునట్లు ఉంచవలెను. వంచలకు తగులకుండ మధ్యభాగమున యూరినోమీటరు

శ్వేచ్ఛగ తేలునట్లుంచవలెను. మూత్రముపై భాగమున మట్టమునుండి దృష్టినారించి ఎంతసంఖ్యలో యూరినోమీటరు నిలచియుండెనో గుర్తించవలెను. ఈసంఖ్యయే మూత్రముయొక్క సాంద్రతను తెలియజేయును. ఈసాంద్రతయందలి హెచ్చుతగ్గులవలన నెట్టిదోషముగలదో ముందు విస్తరింపబడెను గాన నావివరములిచ్చట విడువబడెను.

# శ్వేతధాతువు పరీక్షించువిధము



మూత్రమునందు తగినంత ఆమ్లము లేక లోపించియున్నపక్షమున శ్వేతధాతువును పరీక్షించుటకు ముందు కొలదిబొట్లు ఎసటిక్ యాసిడ్ కలుపవలయును. దీనిని కలపినపిమ్మట నీమూత్రము మురికి (Turbid) యగును. ఈమురికి వెంటనే తగ్గిపోక అట్లేనిలచియున్న పక్షమున వడపోత కాకితములో దీనిని వడబోసి అటుపిమ్మట శుభ్రమైన టెస్టుట్యూబు (గాజుగొట్టము)లో అరఔన్సు వడబోసిన నీమూత్రమును బోసి నెమ్మదిగా ఆవిరివచ్చునంతవరకు స్పిరిటులాంపుపై కాచవలెను ఇందు మేఘమువలె ఏర్పడినకొలది బొట్లు నైట్రిక్ యాసిడ్ కలుపవలెను. నైట్రిక్ యాసిడ్ బొట్లు వేసినప్పటికి యీమేఘముపోక అట్లేనిలచియున్న నది శ్వేతధాతువని గ్రహింపవలెను. ఈమేఘాకారము ఫాస్ఫేట్లు సంబంధమైనదైన నైట్రిక్ యాసిడ్ బొట్లు వేసిన వెంటనే కరగిపోవును. మూత్రముయొక్క సాంద్రత 1015కు విడువక తగ్గియున్న శ్వేతధాతువును పరీక్షించుట అవుసరము.

డాక్టర్ స్మిత్సుపరీక్ష:— ఒక టెస్టుట్యూబులో కొంచము మూత్రముపోసి అందుపోసిన మూత్రముయొక్క పరిమాణమునకు మూడవవంతు ఎసెటిక్ యాసిడ్ జేర్చవలెను. అటుపిమ్మట అందు

కొలదిబొట్లు పొటాషియమ్ఫెర్రొసైనేడ్ వేయవలెను. ఈమూత్రము నందు శ్వేతధాతువున్నపక్షమున, ప్రత్యక్షముగ యగుపడురీతిని క్రింద కు తెల్లనిమడ్డి జేరును. ఈతెల్లనిమడ్డియే శ్వేతధాతువనిగ్రహింపవలెను.

మూత్రముసందు శ్వేతధాతువు యగుపించినపక్షమున, మూత్రపిండ గుల్లనుగూర్చి (Renalcasts) పరిశోధన చేయవలసియున్నది. ఈగుల్లనుగూడ పరీక్షించి కనుగొనినగాని, మూత్రపిండములయొక్క వ్యాధిని నిర్ణయించుటకు వలనుపడదు. ఒక పొడుగుపాటి గాజుగ్లాసులో మూత్రమును నిలువయుంచి అందలిమూత్రము పారబోయుచు, ఆఖరిబొట్లను సూక్ష్మదర్శిని (microscope) యంత్రముపైనుంచి పరీక్షింపవలయును. ఈగుల్లు పలువిధములుగ నుండును. మూత్రము నందు యీగుల్లు యగుపడిన పక్షమున మూత్రపిండములు అనారోగ్య పరిస్థితిలో నుండెనని గ్రహించవలెను.

మైనపుగుల్లు (Waxy costs) దీర్ఘవ్యాధిదోషముగల మూత్ర పిండముల వ్యాధిని సూచించును. నల్లగ కుదపలవలెనుండు గుల్లు జీర్ణావయవదోషమును సూచించుటయేగాక మూత్రపిండముల ఉద్రేక స్థితిని సూచించును.

మూత్రము నొకగ్లాసులో నిలువయుంచిన పక్షమున అందు దిగువభాగమునకు మడ్డిజేరిన యీక్రిందివిధముగా వ్యాధిదోషమును గుర్తించవలెను.

మూత్రమున తేలికయైన కెరటములవంటి మేఘాకారములో మడ్డి జేరిన శుక్రాణువులతో (spermatozes) కలసియున్న ఆమమని (mucus) లేక epithelial cells తో కలసియున్న ఆమమనియు గ్రహించవలెను.

మూత్రము దిగువను పసుపురంగు లేక నారింజపండురంగు లేక గౌరవర్ణముగల మడ్డిజేరి ఆమడ్డికాచినపక్షమున కరగిపోవునెడల అందు యూరేట్సు అధికముగ గలవని గ్రహింపవలెను.

మూత్రము దిగువను దట్టమైన విస్తారమగు తెల్లనిమడ్డి [illegible] ఎసటిక్ యాసిడ్ వేయుటవలన కరగిపోయిన పక్షమున మూత్రమునందు ఫాస్ఫేట్సు గలవని గ్రహింపవలెను.

మూత్రమునందు కుదపవలెగాని లేక పలుగులవలెగాని ఎఱ్ఱని రంగులో కొలదిగ మడ్డిజేరెని యూరిక్ యాసిడ్ అధికముగ గలదని గ్రహించవలెను.

పెంకిఎరుపురంగు లేక నలుపుతో జేరుచున్న ఎరుపురంగుగల మడ్డిమూత్రము దిగువనుజేరెను మూత్రములో రక్తము పోవుచున్నదని గ్రహింపవలెను.

## మధుపరీక్ష. (Sugar test)

—:O:—

మూత్రమునందు మధువు లేక పంచదారయున్న సాంద్రత అధికముగ నుండును. సాంద్రత 1030కు మించియున్న పక్షమున అందు పంచదారగలదని అనుమానించ వచ్చును మధువుగల మూత్రము పాలిపోయిన పట్టిగడ్డిరంగులో కొలదిగ ఏపుల్ పండు వాసనలో గాని, పాల వాసనలో గానియుండి అధికపరిమాణములో వెడలును. ఈమధువు పరీక్షకు 24 గంటలలో వదలిన మూత్రమును ఒకచోట నిలువచేసి అందుండి అవసరమైన భాగమును తీసికొని పరీక్షించవలెను.

మూార్పుపరీక్ష:— ఒకటెస్టుట్యూబు (గాజుగొట్టము) లోనికి కొల్లదిగ మూత్రమును దీసికొని యిందుకు సమభాగము లిక్కర్ పొటాష్ గాని లిక్కర్ సోడా గాని జేర్చవలెను. ఇట్లుజేర్చి దీనిని స్పిరిటు లాంపుపై ఆవిరిచ్చువరకు వేడిచేయవలెను. ఇట్లు కాచుటవలన వేడిచేసిన భాగము బూడిద, ఎరుపువర్ణముగను, పెంకిబూడిదరంగుగను, నల్లగను అందుగల మధువులేక పంచదారనుబట్టి మారును. వేడిచేసిన పిమ్మట నిది ముదరరంగులోనికి మార్పుజెందని పక్షమున యిందు హానికరమైన మధువు లేక పంచదార లేదని గ్రహించవలెను.

మరా:— పరీక్షజేయు మూత్రము ముదరరంగులో. నున్నను,

మూత్రమునందు అధికముగ ఫాస్ఫేట్సుయున్ననుగూడ వేడిచేసినప్పుడు మధువు లేక పంచదార లేకపోయినను మూత్రము ముదరరంగులోనికి మారును. మూత్రమునందు (Albumen) యున్నపక్షమున కాచుట వలన పంచదార లేక మధువు లేకపోయినను యింకను అధికమైన ముదర రంగులోనికి మారును. గాన మధువు లేక పంచదార పరీక్ష జేయుటకుముందు మూత్రములో కొలదిచుక్కలు ఎసటిక్ యాసిడ్ కలిపి కాచి శ్వేతధాతువును వడపోత కాకితముమూలమున వడపోసి తీసివైచి అట్లువడపోసితీసిన మూత్రమును పరీక్షించవలెను.

ట్రోమర్సుపరీక్ష:— ఒక టెస్టుట్యూబులోనికి ఒక డ్రాము మూత్రము తీసికొని దానికి సగము భాగము అనగా ½ డ్రాము లిక్కర్ పొటాష్‌గాని లిక్కర్ సోడాగాని కలుపవలయును. ఒక గాజుసీసాలో ఒక ఔన్సునీళ్ళలో 4 గింజలఎత్తు కాపర్‌సల్ఫేట్ కలపి ద్రావకముచేసి ఉంచుకొనవలెను. మొదట మూత్రములో లిక్కర్ పొటాష్‌గాని లిక్కర్‌సోడాగాని కలుపుటవలన కొంతమడ్డిజేరును. ఈ మూత్రముగల టెస్టుట్యూబులోనికి, కాంఫర్‌సల్ఫేట్ ద్రావకమును ఒక్కొక్కబొట్టును వేయుచు, ప్రతిబొట్టుకు టెస్టుట్యూబును కదుపుచుండవలెను. టెస్టుట్యూబులోనికి జేరిన మడ్డి సులభముగ తిరిగి కరగిపోవువరకు యిట్లు కాపర్‌సల్ఫేటు బొట్లు వేయుచు కదుపుచుండవలెను. ఇపుడు యీమూత్రము నీలివర్ణముగ మారును అటుపై దానిని స్పిరిటులాంపుపై ఆవిరివచ్చువరకు కాచవలెను. అట్లు కాచినపిమ్మట అడుగుభాగమున నారింజపండు రంగుతో మిశ్రమమైన ఎరుపురంగు (Orange-red) మడ్డిదిగిన మూత్రమునందు మధువు లేక పంచదార కలదని తెలిసికొనవలయును. ఈమడ్డి మధువును లేక పంచదారను సూచించును. ఈమడ్డిని నిలువయుంచిన ఎఱ్ఱటి జేగురువర్ణములోనికి (Reddish brown) మార్పుజెందును.

హైనీస్ టెస్టు:— పరిశుభ్రమైన ½ ఔన్సు నీళ్ళలో 30 గింజల ఎత్తు కాపర్ సల్ ఫేటును కరగించవలయును. ఈద్రావకములో ½ ఔన్సు పరిశుభ్రమైన గ్లిసరైన్ జేర్చి బాగా కలుపవలయును. ఈద్రావకము నుండి 1 డ్రాము ఒక టెస్టుట్యూబులోనికి తీసికొని స్పిరిటులాంపుపై మరగిబెట్టవలెను. ఇట్లు మరగబెట్టినపిమ్మట దానిలో పరీక్షించదలచిన మూత్రమును నెమ్మదిగా 6 లేక 8 బొట్లు వేసి తిరిగి మరగబెట్టవలెను మూత్రమునందు మధువు లేక పంచదారయున్న పక్షమున, పసుపుపచ్చని లేక పసుపుపచ్చ ఎరుపు కలసిన మడ్డిజేరును. ఈమడ్డియే మధువును సూచించును.

జాన్సన్సుటెస్టు:— ఒక టెస్టుట్యూబులోనికి పరీక్షింపదలచిన మూత్రమును కొలదిగ తీసికొని దానిలో సగమువంతు పిక్రిక్ యాసిడ్ తేలికద్రావకమును మరియొక సగమువంతు లిక్కర్ పొటాష్‌ను కలిపి స్పిరిటులాంపుపై మరగబెట్టవలెను. మూత్రమునందు మధువు లేక పంచదారయున్నచో ముదర ఎర్రరంగులోనికి మార్పుజెందును. మూత్రమునందు మధువు లేక పంచదార ఎంత అధికముగనుండునో అంత అధికమైన ముదరఎర్రరంగులోనికి మూత్రము మార్పుజెందును.

పైనదెల్పబడిన నాలుగుపద్ధతులలోను నేదియో యొక పద్ధతి మూలమున మూత్రమునందలి మధువును లేక పంచదారను పరీక్షింపవచ్చును. ట్రోమర్సుపరీక్ష ఉత్తమమైనదని కొందరిచే పేర్కొనబడుచున్నది.

మధువుయొక్క లేక పంచదారయొక్క పరిమాణమును పరీక్షించు విధము:— 12 ఔన్సులసీసాలో 4 ఔన్సుల మూత్రమునుంచి అందు బాదంకాయ పరిమాణమంత జర్మన్ యీస్టు (కల్లుమురగ) వేసి వదులుగా మూతవేసి వెచ్చనిప్రదేశములో నుంచవలెను. మరియొక

సీసాలో అంతపరిమాణములోనే ఆమూత్రమునే యీస్టువేయకుండ పోసి గట్టిగా బిరడాబిగించియుంచవలెను. ఇట్లు 24 గంటలుంచినపిమ్మట యీస్టువేసిన సీసాలోగల మూత్రముయొక్క సాంద్రత (Specific gravity) పరీక్షింపవలెను. రెండవసీసాలోగల మూత్రముయొక్క సాంద్రతగూడ చూడవలెను. ఈరెండింటియొక్క సాంద్రతకు ఎంత వ్యత్యాసముండునో ఒక ఔన్సునకు అన్ని గ్రెయినుల మధువు లేక పంచదార ఆమూత్రమునందు గలదని గ్రహించవలెను

వరా:— ప్రతివ్యక్తియు ప్రతిదినము విడుచు ఆరోగ్యమైన మూత్రములో 15 గ్రెయినులమొత్తము మధువు లేక పంచదార ఎట్టి అనారోగ్యమును సూచింపకుండ నుండునని నవీనపరిశోధనలు తెలుపుడుజేసి యుండెను. గాన మూత్రపరీక్షయందు యీపరిమాణముకంటె నెక్కుడు పరిమాణముగల మధువు లేక పంచదార యున్నపుడే వ్యాధిని సూచించును. మధుమూత్రపరీక్షలో పగటిపూట విడుచు మూత్రమునందు మధువు లేక పంచదార విశేషముగనుండునని తెలసికొనవలయును.

## మూత్రములో చీము.

మూత్రములో చీమువెడలుచున్న మూత్రముంచిన గ్లాసుయొక్క అడుగుభాగమున చిక్కటి మడ్డిజేరును. దానిని మరగబెట్టిన మార్పుజెందదు.

మూత్రములో అడుగుభాగమున జేరిన చిక్కటిమడ్డి చీమా లేక ఆమమా (Mucus) యని గుర్తించుటకు యిట్టిమడ్డి జేరిన మూత్రమునకు సమభాగము లిక్కర్ పొటాష్ జేర్చవలెను. అందు జేరినమడ్డి చీమైనపక్షమున మిక్కిలి జిగురుకట్టి తీగసాగును. ఆమమైన పక్షమున పల్చబడి కరగును.

# ఔషధసహజగుణదీపిక.

ఎకోనైట్ :—(Aconite Nap)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| మనస్సు : బుద్ధి. | తీవ్రమైన ఉద్రేకములు { భయము, అదురు విసువుదల. |
| నరములు (స్పర్శజ్ఞానము). | చలివల్ల { చల్లని, పొడిగాలులు. చెమటపట్టునపుడు. |
| హృదయము { ఆర్టీరియల్, ప్రసరణము. | ధ్వని, వెలుతురు, దంతములు వచ్చునపుడు |
| శరీర అంతరింద్రియములు { రొమ్ము, పొత్తికడుపు. | రాత్రి; (P. M.) 12 గం॥ లోపులో ప్రక్కగా ఒరిగి పరున్నపుడు. |
| కీళ్లు | |

ఉపశమనము.

బహిరంగగాలిలో, నిద్ర.
వేడి చెమటవల్ల.

1 శరీరమునందలి సమస్తభాగములయందు తిమ్మిరి, జిల.

2 చర్మము ఆరుకుపోయి మంటతోకూడిన వేడి. చన్నీళ్లకొరకు అమితమైన దాహము. ఎర్రగాకందిన ముఖము : ఒక్కొక్కప్పుడు మారి పాలిపోయియుండును.

3 పశ్చిమశీతవాయువులు వీచినపిమ్మట గల్గుదగ్గులు : ముఖ్యముగా పిల్లలను మొదటియామపు నిద్రయందు బాధించి మేల్కొల్పును.

4 శీతవాయువులు తగులుటవలనకలుగు కండ్లపోటు, వాపు, కలక మొదలగుబాధలు : శస్త్రచికిత్సవలన గలుగుబాధలు, కండ్లయందు

నలకలు మొదలగు యితరవస్తువులు పడుటవలన కలుగు బాధలు.

5 బాధలు భరింపలేకయుండుట : మూట్లుకొనిన సహింపజాలక యుం డుట : కప్పుకొనకుండ యుండలేకపోవుట.

6 ఉద్రేకజ్వరములలో స్థానికమైనబాధ. పోకుడుకురుపు మొదలగు నవి చీముపట్టక పూర్వముగల ప్రథమావస్థ: యిట్టిస్థితియందు తరచుగా జ్వరలక్షణములు వృద్ధిజెందకపూర్వము చలియవస్థ యందు రోగి మిక్కిలి ఆతురత అస్థిమితముతో సహజముగా నుం డును (ఇవి సహజలక్షణములు.)

7 మానసోద్రేకముజెందిన పిమ్మటగాని, సారాయిత్రాగిన పిమ్మట గాని, శీతగాలి తగిలినపిమ్మటగాని కలుగురక్తవమనము. నెమ్మదిగా కాండ్రించినను, కొలదిసేపు దగ్గినను రక్తవమనము గలుగును.

8 ఎడమచెయ్యి భుజమునుండి హస్తమువరకు తిమ్మెరతో తలకదప లేక యుండుట.

9 రోగి తాను ఫలానిదినమున ఇన్నిగంటలకు చనిపోవుదునని చెప్పును. ముఖ్యముగా బాలింతరాలు తన వ్యాధియందిట్టి జ్యోతిషము చెప్పును.

10 ప్రక్కనుండి లేచినపక్షమున ఎర్రటిముఖము పాలిపోయిన చావు ముఖమువలె మారిపోవును.

11 నాడి వేగముగా, పుష్టిగా, దళముగా కొట్టుకొనుచు మిక్కిలి వేడి దాహముతోగూడి రోగి ఆతురత, అస్థిమితము, ఓర్మి లేకపోవుట, శాంతి వహింపలేకపోవుట, ఇట్టిస్థితియందు యిటునటు దొర్లుచుం డును.

12 భయోత్పాతమువలన ఋతువు ఆగిపోవుట.

13 విపరీతమైన చలి. అనంతరము శరీరమున అధికమైనవేడి. గుండెల యందు పొడుచుచున్నట్లు బాధ.

14 వేసవిబాధలయందు తుక్కువంటి విరోచనము.

15 చలిగాలి తగులుటవలన గలుగు శ్వాసావయవసంబంధమైన జబ్బులు.

16 కంపములు (convulsions) ఉష్ణము. కండరములు ముడుచుకొనుట. శిశువు గుప్పిడి నోటియందిడికొని మూల్గుట, ఏడ్చుట: భయముతో కంపించుట. ముఖము ఎర్రబడుట. చర్మము వేడిగానుండి ఆరిపోవుట. హెచ్చుజ్వరము.

17 పురిటిపిల్లలయందు గలుగు మూత్రావరోధము. మూత్రము అణచిపెట్టబడుట.

18 జ్వరము. చర్మము ఆరుకుపోయి వేడిగానుండుట. ముఖము ఎర్రగానుండుట లేక ఒకసారి ఎరుపు ఒకసారి పాలిపోయియుండుట. విపరీతమైన దాహాముగలిగి విస్తారముగా చన్నీళ్లు త్రాగుట.

19 సాయింత్రమునందు పడకనుండి లేచినను, బాధగల భాగమున పరుండినను, చుట్టకాల్చినను ఉద్రేకించును.

N. B:—సన్నిపాతజ్వరములయందు ప్రథమావస్థలో ప్రయోగించిన హానికరము. పొక్కులు తీసికొనివచ్చు జ్వరములలో సర్వసాధారణముగా ఉపయోగించదు.

---

## ఏస్కులస్:—(Aesculus Hip) (సూడోసోరిక్)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| సిరలు { (పైత్యకోశము) కాలేయము, ఉదరము. (కుడివైపు), మలాశయము. | ఉదయమున లేచునపుడు, |
| ఆమత్వచలములు. | విరోచనానంతరను, |
| ముచ్చిలిగుంట. | మూత్రము విడచునప్పుడు |
| నడుము. | నడచుచున్నపుడు. |

ఉపశమనములు.

చల్లగా నుండుట వల్ల { బహిరంగగాలిలో స్నానమువలన

రక్తస్రావములవల్ల (మూలశంఖ) మోకారించుచున్న.

విడువకుండ వ్యాయామము చేయుటవల్ల.

1 ఆసనము ఆరుకుపోయి వేడిగానుండి చిన్నకర్రముక్కలతో నిండి యున్నట్లుండి మిక్కిలి బాధకరముగానుండుట.

2 వేరుశనగ గింజలవలెనుండు మూలశంఖ: సర్వసాధారణముగా, మంటతోకూడిన గౌరవర్ణముగానుండు రక్తము స్రవింపని మూలశంఖ; పోటు బాధతోనుండును. నడుముపోటు; నడుము సిలువబెట్టుటకు కష్టముగా యుండును.

3 నడుమునందును, చట్టలయందును పోటుతోకూడిన చిక్కటి నల్లని కుసుమ.

4 చట్టలయందును, నడుమునందును నిరంతరము నొప్పి అందుచే నడుము నిలుపలేకపోవుట. ముందుకు వంగినను నడచినను యీ బాధలు విపరీతిముగా ఉద్రేకించుట.

5 మలబద్ధము విరేచనము పిష్టముకట్టి వెడలుటకష్టతరముగానుం డును. ఆసనము పచ్చిగాను దురదగాను నుండును.

ముఖ్యవిషయములు :—కోలిన్సోనియా, మూలశంఖబాధకు కొంత సుగుణము చేసినపిమ్మట ఏస్కులస్ తరచు నివారణజేయును. నక్సువామికా, సల్ఫరు మూలశంఖబాధకు సుగుణముజేసి నివా రణ జేయలేనిపక్షమున నిది ఉపయోగించును.

---

ఎథూసా :—(Aethusa)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| బుద్ధి, నరములు, జీర్ణకోశము. | పాలు, వేడిగాలి, పండ్లు వచ్చునపుడు. |
| మెడ, మాంసపుగ్రంధులు, పైత్య కోశము. | తరచు తినుటవలన. |

1 ముక్కునుండి నోటి చెలివివరకు లాగుచున్నట్లుండి ఆతురతతోను బాధతోను యున్నట్లు ముఖవికాసము దెల్పుచుండుట.

2 పాలు త్రాగుపిల్లలు త్రాగినపాలు యిముడ్చుకొనలేకపోవుట. పాలు త్రాగినతక్షణమే జోరుగాకక్కివేయుట. పిమ్మట నీరసము మత్తు: త్రాగినపాలు పెరుగుబిళ్లలవలెగాని లేక జిగురుగా తెవడవలెగాని కక్కుట.

3 పళ్లువచ్చు పిల్లలలో గుప్పెడబిగబట్టి ఎర్రటిముఖముతో కండ్లు తేరిబారి చూచుచు నోటినుండి నురగతోకూడిన అపస్మారకంప ములు.

4 పిల్లలు నిలువలేనంతటి అతినీరము. మెడ నిలుపలేకపోవుట.

5 దాహము ఎంతమాత్రము లేకపోవుట.

---

ఎగరికస్ :—(Agaricus) (సోరాదోషహరణకరము)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| వెన్నెముకసంబంధమైన పూస { ముచ్చిలిగుంట, నరములు, నడుము. | గాలి { గడ్డకట్టుకొనిపోవు నంతటి చలి. బహిరంగమైన తుపాను. |
| ప్రేగులలో పురుగుపాకినట్లుండుట | అలసట { మానసికమైన సంభోగముచేకలుగు జారత్వమువల్ల |
| హృదయము: రక్తప్రసారణ మండలము. | సారావల్ల, ఒత్తడినల్ల, తాకుటవల్ల |
| శ్వాసావయవములు, రొమ్ము. | ఉదయము, బహిష్టు అగునపుడు. |
| | **ఉపశమనములు.** |
| | నెమ్మదిగా కదలుటవల్ల. |

1 వెన్నెముకయందు తీవ్రమైనమంట, నొప్పి, చురుకుచురుకుమని పోటు.

2 వెన్నెముక ముట్టుకొన్న నొప్పిగాయుండును.

3 వెన్నెముక పొడుగునను చీమలు ప్రాకుచున్నట్లుండుట.

4 విద్యుచ్ఛక్తివలన గలుగు బాధవలె కండరములు నులిపెట్టి తీవ్రమైన బాధ.

5 శరీరమునందలి చాలభాగములు ఎరుపుగానుండి, మంట, దురదతో కూడుకొని యుండుట.

6 శరీరమునం దనేకభాగములయందు మంచుగడ్డ తగిలినట్లు జువ్వు మనుచుండుట.

7 చర్మములోనికి చల్లనిసూదులు గ్రుచ్చుచున్నట్లుండుట.

8 శరీరమునబాధలు పైభాగమునందలి యవయవములయందు ఎడమ వైపునను క్రిందభాగములయందలి అవయవములయందు కుడిభాగమునందును యగుపడుట. అనగా ఎడమచేయియందు కుడికాలియందు (ఇట్లే పైన కుడిభాగమున దిగువను ఎడమభాగమున బాధలు గల్గి యున్నప్పుడు ఉపయోగించు మందులు ; యాంబ్రగ్రిషియా, బ్రోమియమ్, మెడోరినమ్, ఫాస్ఫరస్, సల్ఫ్యూరిక్ యాసిడ్.)

---

ఎగ్నస్ కాస్టస్ :—(Agnus cast)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| మర్మావయవములు. | సంభోగము. |
| మనస్సు, నరములు, కండ్లు. | బెణుకులు. |

1 సంయోగవాంఛ తగ్గుట. పూర్తిగా నశించుట. పురుషాంగమునకు పూర్తిగా లేపనశక్తి తగ్గుట. ఎట్టిశృంగారసంబంధమైన తలంపుల వలననుకూడ కామోద్రేకము కలుగకుండుట అండములు చల్లగా యుండి వాచి గట్టిగాను నొప్పిగాను ఉండుట.

2 యౌవ్వనులకు కాలమురాకమున్నే అధిక మానసికపరిశ్రమ విచారము విసుపుదలతోకూడిన అధికసంభోగమువలన జనించిన దుర్బలత్వము మూలముననూ, కృత్రిమసంయోగము ముష్టిమైథునము మొదలగు దురభ్యాసములకు లోనగుటమూలమున జనించిన దుర్బలత్వముచే తరచు కలుగు యింద్రియస్ఖలనముతోకూడిన శుక్ల

నష్టమువలన గలిగిన దుర్బలత్వము మూలముననుు, సర్వసాధారణ మైన నీరసమువలన గలిగిన దుర్బలత్వము మూలమునను వచ్చు వృద్ధాప్యమునకు ముఖ్యముగా నుపయోగించును.

3 తరచు శగవ్యాధి తగులుటవలన కలుగు నపుంసకత్వమున కుపయో గించును.

4 శగ అణచిపెట్టుటవలన కలుగు దుర్గుణముల కుపయోగించును.

---

ఎలియమ్ కేపా :—(Allium cepa)

1 ముక్కునుండికారు నీళ్లవంటి విస్తారమైన స్రావముతో కూడిన రొంప. కండ్లనుండి విస్తారముగా నీళ్లు కారుచుండుట.

2 విపరీతమైనరొంపతో నిరంతరము తుమ్ములువచ్చుట. వెచ్చని గది లోనికివచ్చిన అధికమగుట. బహిరంగమైన గాలిలో సుగుణముగ నుండుట.

---

ఎలోయి :—(Aloe) (శోరాదోషహారణకరము.)

స్థానములు.

ఉదరసంబంధమైన సిరలు { మలాశయము. కాలేయము. మలకోశములు. వస్తికము.

నడుము, తల.

స్త్రీ అవయవములు.

ఉద్రేకములు.

వేడి, తేమ, వేసవి, తెల్లవారు ఝామున : గ్రహిణివిరోచనములు వెడలినతర్వాత.

గట్టిగానడచుటచే: సాయంత్రము. ఉపశమనములు.

చలివలన, బహిరంగగాలిలోను.

1 విరేచనములు వెళ్లునట్లుగా కడుపులో ఒకవిధమైన నీరసము.

2 విరోచనములు : భోజనము చేసిన తక్షణము, పానీయములు త్రాగిన తక్షణము తొందరగా విరేచనమునకు వెళ్లవలసియుండుట. ఉదయముననే తొందరగా విరేచనమునకు వెళ్లవలసి నిద్దురనుండి లేచుట. (సల్ఫరు.)

3 అపానవాయువు పోవునప్పుడు విరేచనమగునని అనుమానముగా యుండుట (నేట్రమూర్.)

4 మూత్రము విసర్జించునప్పుడు అప్రయత్నముగా విరేచనమగుట.

5 విరేచనమునకుముందు, విరేచనమైనపిమ్మట కడుపు దిగువభాగమున నులిబెట్టుచున్నట్లు, బిగబట్టుచున్నట్లు, నొప్పి: మూలశంఖ : ద్రాక్షగుత్తివంటి పిలకలు : నిరంతరము ఆసనము దిగలాగుచున్నట్లుబాధ. ఆసనమునుండి రక్తము స్రవించుట. ఆసనము పచ్చిగానుండుట. వేడిగాను మంటగాను యుండుట. చన్నీళ్లతో కడిగిన తగ్గును. ఆసనము విపరీతమైనదురద. ఆసనమునగల దురద మంట నిద్ర లేకుండ జేయును.

6 విరేచనము నీళ్లవలెను, జిగురుముద్దవలెను వెడలుట.

N. B :—సల్ఫరువలెనే కడుపుయందలి రక్తాధిక్యము, రక్తకూటమితో కూడిన అనేకదీర్ఘవ్యాధులకు దివ్యౌషధము. అణచిపెట్టబడిన చర్మసంబంధమైన పొక్కులను పైకిదీసికొనివచ్చి వృద్ధిజేయును.

## ఎల్యూమినా :—(Alumina) (శోరాదోషహరణకరము.)

**స్థానములు.**

వెన్నెముక, నడుము, మలాశయము.

దిగువ అవయవములు.

ఆమత్వచలము.

చర్మము.

**ఉద్రేకములు.**

ఉష్ణము ; గది ; పడక.

ఆహారములు { కృత్రిమపు. బంగాళాదుంపలు.

మాట్లాడుట, పొడిగాలి

తెల్లవారుఝామున లేచునపుడు.

కూర్చుండుట, బహిష్టుతర్వాత.

**ఉపశమనములు.**

సాయంత్రము. బహిరంగగాలిలో

మితమైన { వ్యాయామము. వాతావరణము

1 మలకోశమునకు శక్తితగ్గుట. మెత్తటిమలముకూడ అతికష్టముపై వెడలుట.

2 మలకోశమున విస్తారమైనమలము చేరువరకు విరేచనమునకు వెళ్లవలెనని అనుమానముగాని శక్తిగాని లేకుండుట.

3 విరేచనము మిక్కిలి కష్టతరముగా వెడలుటచే దగ్గరనున్న దేదియో యొక ఆధారముపట్టుకొని బలవంతముగా విరేచనము గావించుట.

4 కుసుమ : మంటతోకూడిన విస్తారమైన కుసుమస్రావము విస్తారముగా కాలివెంబడి పాదమువరకు కారుచుండుట : పగటియందధికముగా నుండుట. చన్నీటిస్నానముచే ఉపశమించుట.

5 పోతపాలుపోయు పిల్లలకు కలుగు మలబద్ధము. వృద్ధులకు మలకోశమునందు శక్తితగ్గుటచేకలుగు మలబద్ధము.

ఎమ్మోనియాకార్బ :— (శోరావోషహరణకరము.)
**(Ammonia carb)**

**స్థానములు.**

హృదయము { ప్రసారణము. రక్తము.

శ్వాసము.

ఊపిరితిత్తులు. సప్తపధ కుడిప్రక్క

**ఉద్రేకములు.**

చలి { మబ్బుగానుండెడిరోజులు. తేమ.

నిద్రపోవుచున్నపుడు.

తెల్లవారగట్ల 3, 4 గంటలకు.

బహిష్టులో కదలికవలన.

**ఉపశమనములు.**

ఒత్తిడివలన.

ఉదరముపైపు పరుండిన

1 విషపడిశెము (Influenza) మంటతోకూడిన పరుపుకలుగ జేసెదురొంప. రాత్రులయందు ముక్కు బిగపట్టుట. నోటినుండి మాత్రమే గాలిపీల్చవలసియుండుట. కంఠము బొంగురుపోవుట. పొడిదగ్గు. శ్వాసబిగపట్టుట.

2 దగ్గు తెల్లవారగట్ల మూడుమొదలు నాల్గుగంటలవరకు (కాలీకార్బ)

3 బహిష్టుకు ప్రారంభమున కలరావంటి లక్షణము లగపడుట.

---

ఎమ్మోనియామూర్ :—**(Ammonia Mur)** (సూడాసోరిక్.)

**స్థానములు.**

ఆమత్వచలములు { రొమ్ము. పైత్యనాళములు.

**ఉద్రేకములు.**

ఉదయము (తల, రొమ్ము)

అపరాహ్ణము (ఉదరము)

సాయంత్రము(చర్మము, జ్వరము:

కాలేయము.

రక్తము.

స్త్రీ అవయవములు.

చేతివ్రేళ్లయొక్కయు, కాలివ్రేళ్ల యొక్కయు, కొనలు.

అవయవములు).

బెణుకులు (దీర్ఘకాలమునుంచి).

నిర్ణితకాలములో.

ఉపశమనములు.

బహిరంగమైనగాలిలో వేగముగా కదలుటవలన.

1 విషపడిశెము (Influenza) నీళ్లవంటిరొంప. ఈరొంపయొక్క స్రావముచే పెదవులువరసి పుండ్లుపడుట. గొంతుకనొప్పి ; కంఠము బొంగురుపోవుట , మంట, గరుకు, పొడిదగ్గు.

2 మలబద్ధము, విస్తారమైన అపానవాయువులు; విరేచనముపిష్టముకట్టి వెడలుట. ఎక్కువప్రయాసతో బిగబట్టి విరేచనము చేయవలసి యుండుట.

3 బహిష్టునందు ఆసనమునుండి రక్తస్రావము కలుగుట: విరేచనములు, వాంతులు.

4 మూలశంఖ: విరేచనమైనపిమ్మట కొన్నిగంటలవరకు, మంట పోటు యుండును. (ఎస్కులస్, సల్ఫర్) ఈబాధ కుసుమ అణచిపెట్టుటచే ముఖ్యముగా కలుగును.

5 శరీరము పై భాగము లావుగానుండుట కాళ్లు సన్నముగాను యుండుట.

6 నడుమునందు బెణుకునొప్పివలె బాధగానుండుటచే సరిగా నిలువబడి నడువలేకుండుట.

---

ఎనకార్డియమ్ :—(Anacardinm) (శోరాదోషహరణకరము)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| మనస్సు. | మానసికవ్యాయామము |
| నరములు { కడుపు, చర్మము, అరచేతులు. | మనోవికారము { కోపము, భయము, వ్యాకులత, మొదలగునవి. |
| కండరములు. | గట్టిగానడచిన, కదలిన. |
| కీళ్లు. | గాలికెరటములు, బహిరంగమైన గాలి, చలి. |
| | తినిన చాలసేపటితర్వాత. |
| | **ఉపశమనములు.** |
| | తినుట, వేడినీటిస్నానము. |

1 బుద్ధిమాంద్యము ; జ్ఞాపకశక్తి మిక్కిలి తగ్గిపోవుట. ఆకస్మికముగా మరపువచ్చుట. మరపుచే రోగి విశేషముగా బాధనొందుట. వ్యాపారముల కసమర్థుడగుట.

2 తిట్టుటకు, వట్టుపెట్టుకొనుటకు, శపథముచేయుటకు ఆపుకొనలేనంతటి కోరిక.

3 తనయందు ఇతరులయందు నమ్మకము లేకపోవుట. మనోధైర్యము లేకపోవుట.

4 విద్యార్థులందుగలుగు పరీక్షాభయము. (Examination fear.)

5 మూలశంఖతోను మలబద్ధముతోను కూడిన మనోవ్యాధి.

6 తలపోటు భోజనముచేయునపుడు పూర్తిగాతగ్గుట.

7 శరీరమునం దనేకభాగములయందు గసిగతో నొక్కుచున్నట్లు, పొడుచుచున్నట్లు మొద్దుబాధ.

8 అరిచేతులయందు సురుపుడుకాయలు. (నేట్రమూర్)

9 శరీరమునందలి అసౌఖ్యతయంతయు భోజనముజేసిన తాత్కాలికముగా తగ్గుట. ఇది అనేకపర్యాయములు ఋజువుచేయబడిన నిశ్చయమైన లక్షణము.

---

## యాంటిమోనియమ్‌క్రూడమ్:—(శోరాదోషహరణకరము)

**(Antimonium crudum)**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| కడుపు | చల్లని { స్నానము, తేమ, నీరు (తలమీాద) |
| జీర్ణకోశము. | అమితమైనతిండి. పుల్లనిరసములు |
| మనస్సు. | తీపిపదార్థములు. |
| చర్మము. | వేడి { వేసవికాలపుఎండ ఎక్కువ |
| ఇరువైపుల మారుట. | వేడి ప్రకాశించుకిరణముల. |

1 పిల్లలు పెంకితనము ముంకుతనముగాను యుండుట. వారివైపు జూచినను ముట్టుకొనినను సహింపరు.

2 సంధితోను, మగతతోను, వికారముతోను యుండుట: ముఖము ఎర్రగాను, వేడిగాను యుండి శరీరము జ్వరవేడిమితోయుండును. నాడి అక్రమగతి నుండును. శరీరము కడిగినను, నీళ్లు పోసినను పిల్లలు ఏడ్చుట.

3 ముక్కులు వరసి, పగిలి పక్కులుకట్టి యుండుట. నోటిచెలివిలు కూడ యిట్లేయుండుట.

4 పుప్పిపళ్లు సాధారణముగా రాత్రి విశేషముగా బాధించుట నాలిక పండ్లకుతగిలిన తెగిపోయినంత బాధగాయుండుట.

5 అమితముగా భుజించుటచే జీర్ణకోశము చెడుట. ఆహారము రుచిలో త్రేనుపులు : వికారము : గట్టివిరేచనము ; నాలుకపై తెల్లటి దట్టమైన పూత. (ఇది మిక్కిలి ప్రధాన లక్షణము)

6 నదిలో స్నానముచేయుటవలన, జలుబు చేయుటవలన, సారాయములు త్రాగుటవలన, పండ్లు, బలమైన పదార్థములు తినుటవలన, అజీర్ణమువలన, పొక్కులు అణచిపెట్టుటవలన, కలుగు తలనొప్పి.

7 నీళ్లవిరేచనములు : ఈ విరేచనములలో తినిన గట్టిపదార్థములు ఆ రూపముననే వెడలిపోవుట.

8 వృద్ధులయందు కొన్నిదినములు విరేచనబద్ధము, కొన్నిదినములు విరేచనములు వెడలుట : యిట్లు మారుచుండు స్థితి.

9 నలిగిన వ్రేలిగోళ్లు బ్రద్దలై బయలుదేరి పెరుగుట : సురుపుడు కాయవలె ముక్కుదేరియుండుట.

10 చన్నీటిలో స్నానము చేయుటవలన కలుగు బాధలు.

---

## యాంటిమోనియమ్‌టార్‌టారికమ్ :— (సైకోసోరిక్)

**(Antimonium Tartaricum)**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| ఆమత్వచలములు. | వెచ్చని } గది. దుప్పట్లు. / గాలి. |
| ఊపిరి తిత్తులు, కడుపుసంబంధమైన నరము { సప్తపథ ఊపిరితిత్తులు. హృదయమురక్త ప్రసారణము. శ్వాస. | కోపము. పడక. ఉదయమునఅమితమైనతిండి, చలి. తేమ. |

| | ఉపశమనములు. |
|---|---|
| కడుపు, ప్రేగులు, నిద్ర. | కాంక్షించి ఉమిసిన. |
| నడుము. | లేచి కూర్చుండిన. |
| చర్మము. | చలనము. |

1 దగ్గునపుడు తల వణకును.

2 గొంతుకలోను గుండెలలోను గురగుర. దగ్గునపుడు విస్తారమైన శ్లేష్మము గుండెలలో నున్నట్లగపడును. ఎంతదగ్గినను శ్లేష్మము బయటపడదు (ఇది ముఖ్యలక్షణము.) చిన్న పిల్లలొక్కొక్కప్పుడీ శ్లేష్మమును కక్కుదురు. శ్లేష్మము జిగురుగానుండి తీగవలె వచ్చును.

3 పిల్లలు ముఖమునందలి కండరములు ముడుచుకొని, యేడ్చుచు లేక కునికిపాట్లు పడుచు ఒకటి విడిచి ఒకటివచ్చు దగ్గు ఆవలింతలతోను బాధపడుట; పిల్లలు ఎత్తుకొని తిప్పమని ఏడ్చుట; దగ్గర నున్నవారిని పట్టుకుని ఏడ్చుట; ముట్టుకొన్న మూల్గి ఏడ్చుట; నాడికూడ చూడనీయకపోవుట.

4 చాలసేపుండు విపరీతమైన వికారముతోకూడిన వాంతులు; దీనితో విశేషమైన ఆతురత; కుడివైపు పరున్నతప్ప ఏవైపు పరున్నను వమనమగుట; సొమ్మసిల్లువరకు వమనమగుట; అందుపై మగత; లేవలేని నీరసము.

5 ఆకస్మిక ఉపద్రవమగు నీటిలో మునుగుట మొదలగు ఉపద్రవములయందు గలుగు మరణావస్థయందు, ఊపిరితిత్తుల పక్షవాతమునందు, ఊపిరితిత్తులు శ్లేష్మముచే నిండియున్నపుడు, కంఠములోనికి గొంతుకలోనికి యితరవస్తువులను (foreign substances)

మ్రింగి అది అచ్చటనే చేరియున్న పుపుసగత మాంద్యముతో కూడియున్న పరిస్థితులయందు పనిచేయును.

6 సమస్తమైన బాధలయందు విశేషమైన నిద్రమత్తు : నిద్రపోవుట కధికమైనతలంపు (ఇది ముఖ్యలక్షణము)

7 శిశువు జనించగనే శ్వాసలేక శ్వాసకొరకు ప్రాకులాడునపుడుపయోగించును. మరణగురకను తగ్గించును.

8 కుడివైపు ఊపిరితిత్తిలో జనించు న్యుమోనియాను తగ్గించును.

9 చలిజ్వరము : తినినపదార్థము కక్కివేయుట : కండ్లు తెరచుట కష్టముగా యుండుట : మత్తుతో కూడిన నిద్ర. మేల్కాంచినప్పుడు నిరాశగా నుండుట.

10 ముఖము చల్లగాను, పాలిపోయి నీలివర్ణముగను, చల్లని చెమటతోను నుండుట.

11 చర్మముపై మసూచికపు పొక్కులవలె చీముతో కూడిన పెద్ద పొక్కులు.

12 మూత్రము ఎర్రగా బాధతో స్వల్పముగా వెడలుట. మూత్రము రక్తవర్ణముగానుండి మూత్రకోశమునందు చురుకు ; మూత్రావయవమున మంట.

13 కూర్చొనియుండినను, కంఠమునందలి శ్లేష్మము పడిపోయినను, బహిరంగమైన గాలిలోను, ఉపశమనముగాయుండుట. చలిగాలిలోను రాత్రి పరుండినను వ్యాధి ఉద్రేకించుట.

14 న్యుమోనియాలో యాంటిమోనియమ్ టార్‌టారికమ్‌కు, ఫాస్ఫరస్‌కు తారతమ్యము :—

| ఏంటిటార్టు | ఫాస్ఫరస్. |
|---|---|
| 1 రోగి నిద్రమత్తుతో అతినీరసముగ నుండును. | 1 రోగి అస్థిమితముగా నుండును. |
| 2 విస్తారముగా శ్లేష్మము గుండెలలోజేరి రోగి శ్లేష్మమును పైకి దగ్గలేకుండును. శ్లేష్మము తెగి పడదు. | 2 మిక్కిలి బాధకరమైన పొడి దగ్గు. పసుపుపచ్చని తుప్పువంటి శ్లేష్మము. |
| 3 రెండు ఊపిరితిత్తులయందు పైకి వినపడునట్లు శ్లేష్మము గురగురలాడుచుండుట. | 3 గురగురయుండదు. |
| 4 సాధారణముగా రెండు వూపిరితిత్తులు వ్యాధికి లోనగును. | 4 సాధారణముగా ఒక్క ఊపిరితిత్తి మాత్రమే వ్యాధికి లోనగును. ముఖ్యముగా కుడివైపు ఊపిరితిత్తి అడుగుభాగము వ్యాధికి లోనగును. |
| 5 సాధారణముగా పిల్లలకు వృద్ధులకు ఉపయోగించును. | 5 సాధారణముగా యువకుల కుపయోగించును. |

N. B :— ఊపిరితిత్తులు చెడి పనిచేయక నిలిచిపోవుచున్నపుడు (Seemfailing) రోగికి నిద్రమత్తుగానుండి దగ్గు తగ్గిపోవును. అట్టి పరిస్థితియందు ఇపెకాక్ నకు ప్రత్యామ్నాయముగా పనిజేయును.

టీకాలు వేసినపిమ్మట కలుగు దుర్గుణములకు తూజా ఉపయోగించక, సిలికా అనుకూలించియుండని పరిస్థితులయందు పనిచేయును. గొంతుకలోను కంఠములోను యితరపదార్థములు చేరుటచేగలుగు వగర్పునకు సిలికాకంటె ముందుగా ఉపయోగించును. పిల్లలకు యాంటిమోనియమ్ టార్టారికమ్‌ను లక్షణసారూప్యమునుబట్టి ఉపయోగించినను అనుకూలించని పరిస్థితియందు హెపార్ సల్ఫు ఉపయోగించ

వలెను. శీతకాలములో పిల్లల దగ్గులు ముదిరినపు డుపయోగించును.

---

ఏపిస్ :—(Apis)

(శోరా దోషహరణకరము)

**స్థానములు.**

ధాతుమజ్జాదులు { కండ్లు, ముఖము, నోటియొక్క లోపలి భాగము, అండాశయము.

మాంసకృతులు.

చర్మము.

మూత్రపిండములు. మూత్రకోశము.

నరములు. శ్వాసము.

హృదయము. రక్తము.

కుడిప్రక్క, కుడినుండి ఎడమకు.

**ఉద్రేకములు.**

వేడి { గది, గాలి, పానీయములు. నిప్పు, పరుపు.

ముట్టుకొనిన. నిద్రతర్వాత. రాత్రి 4 గంటలకు.

ఒత్తిడి.

పొక్కులను అణిపెట్టుటచే.

**ఉపశమనములు.**

చల్లని { గాలి, స్నానము, కప్పుకొనకుండుట.

కొలదిగా కాండ్రించిన.

కదలిన.

1 శిశువు మాంద్యముగా పడియుండును: సంధి: ఆకస్మికముగా కీచుకంఠముతో ఏడ్చుట. ఓరచూపులతో చూచుట: పండ్లు కొరకుట: తలగడలోనికి తలదూర్చిపరుండుట. ఒకభాగమునకుపక్షవాతము వేరొకభాగము నులిబెట్టుచున్నట్లుండుట. చెమటచే శరీరము చల్లగానుండుట. మూత్రము కొంచముగా పాలవలెవెడలుట.

2 కండ్లు; రెప్పలు; చెవులు; ముఖము; పెదవులు; నాలుక; కంఠము; ఆసనము; అండములు; ఎఱ్ఱబడి వాచి అందు మంటతోకూడి చురుకుచురుకుమని పోటు.

3 స్త్రీలయందు కుడి అండాశయము వృద్ధిజెంది గుండెలలో నొప్పి; దగ్గు.

4 శరీరమునం దపుడపుడు తేనెటీగ కుట్టినట్లు చురుకు చురుకుమని పోటుతోకూడిన మంట.

5 కడుపుమీద; చీరెముకల క్రింద; జీర్ణకోశమువద్ద; ముట్టుకున్న నొప్పిగానుండి; మిక్కిలి పచ్చిగానుండుట.

6 దాహములేకుండుట; మూత్రము అతిస్వల్పముగా వెడలుట.

7 ఉబ్బు: ఈ ఉబ్బులో దాహముండదు. కనురెప్పలు సంచులవలె వాచియుండును. కాళ్లు, చేతులు, ముఖమునందు నీరుపట్టి తెల్లగా నిగనిగలాడుచుండుట (విపరీతమైన దాహముతోగల ఉబ్బుకు ఎసిటిక్ యాసిడ్ పనిజేయును.)

8 అండాశయములకు సంబంధించిన ఉబ్బుతో శరీరము తెల్లగా నిగనిగలాడుచుండుట. పురుషుని అండములు వాచుట నీరుపట్టుట.

9 కురుపులు; రాచకురుపులు; వాపులు; కంతులు; మూలశంఖ; అండాశయములు; మూత్రావయవము; కంఠము; ముఖము; మొదలగువానియందు, మంటతోకూడిన పొడుచు చున్నట్లు బాధ.

10 మూత్రము జారీగా వెడలకుండుట: ఎరుపు లేక రక్తవర్ణముతో వెడలు మూత్రమును ఒక క్షణమైనను నిలుపుకొనలేకపోవుట. మూత్రము వెడలినవెంటనే మంట.

11 మలబద్ధము: బిగబట్టి మలవిసర్జనముగావించిన కడుపులో నేదియో గట్టిగానున్నది బ్రద్దలగునని భావన.

12 ఏభాగమునైనను ముట్టుకొనిన మిక్కిలి బాధకరముగా నుండుట. (బెల్ ; లేక సిన్)

13 విడుపుజ్వరము : మధ్యాహ్నము 3 గంటలకు దాహముతో చలి ప్రారంభించును. గదిలోను, వేడివలనను ఉద్రేకించును.

N. B:— ఉబ్బులలో 1, 3 మొదలగు తక్కువ పొటన్సీలు వాడవలెను. ఔషధగుణము ఒక్కొక్కప్పుడు కొన్ని దినముల వరకు యగుపడదు. గుణము చేయలేదని తొందరపడి ఔషధమును మార్చరాదు. ఒక్కొక్కప్పుడు గర్భస్రావము కలుగజేయును గాన గర్భిణీస్త్రీలకు వాడరాదు. రూస్టాక్సును దీనికి ముందుగాని వెనుకగాని వాడరాదు.

---

ఎపోసినమ్ :—(Apocynum)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| మూత్రావయవములు. | చల్లని—గాలి పానీయములు, |
| హృదయము. | కప్పుకొనకుండిన, పరుండిన. |
| జీర్ణకోశము. | **ఉపశమనములు.** |
| గర్భాశయము. | వెచ్చదనము. |

1 కాలేయమునకు (liver) సంబంధించిన సమస్తమైన ఉబ్బులలోను పనిచేయును.

N. B:— ఎపిస్ ; ఎపోసినమ్ ; డిజిటలిస్ ; ఉబ్బుయందు పనిజేయనప్పుడు అనేకవ్యాధులను బ్లేటాఓరియన్ టాలిస్ నివారణ జేసియుండెను.

---

## అర్జంటమ్ మెటాలికమ్ :— (శోరాదోషహరణకరము) (సైకోసిస్ దోషహరణకరము)

**(Argentum Metallicum.)**

| స్థానములు. | ఉద్రేకములు. |
| --- | --- |
| నరములు. | మాట్లాడునపుడు: మానసికశ్రమ మధ్యాహ్నము. చల్లనితేమ. |
| ఉపాస్థులు, ఆమత్వచలములు { కంఠములోనిస్వర పేటిక, ఎముకలు, కీళ్ళు. మర్మావయవమూత్రావయవములు. | **ఉపశమనములు.** |
| ఎడమవైపు, అండాశయము వృషణము (కుడి) | కదలుట. కాఫీ. పైన కప్పుకొనిన. |

1 రసప్రయోగదోషముల కుపయోగించును.

2 ముష్టిమైథునమువలన కలిగిన తత్సంబంధమైన వ్యాధులు.

3 ముష్టిమైథున దురభ్యాసమువలన ప్రతిరాత్రి లేపనములేకుండగ స్వప్నస్ఖలనమగుట. పురుషాంగము, సన్నగిలిపోవుట.

4 ఉపన్యాసకులయందు, గాత్రపాఠకులయందు కలుగు కంఠవ బొంగురు.

5 గుండెలయందు అమితమైన నీరసము. ఎడమవైపున ఎక్కువ యుండుట.

6 ఉదయమున కంఠమునుండి, గౌరవర్ణమైన తేనెవంటి జిగురుగ శ్లేష్మమును సులభముగ కాండ్రించుట.

7 ఊపిరి పైకి వదలునప్పుడు ; దగ్గునప్పుడు ; కంఠము నొప్పిగా నుండుట. మ్రింగునపుడుండదు.

---

## అర్జంటమ్ నైట్రికమ్ :— { (శోరాదోష హరణకరము) (సైకోసిస్ దోష హరణకరము)

**(Argentum Nitricum.)**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| మనస్సు. | మనోవికారములు { ఆతృత అనుమానము. |
| నరములు, ఉదరము. | గదిలో : పంచదార. |
| ఆమత్వాచలములు { కడుపు ప్రేగులు కండ్లు, గొంతుక మూత్రావయవము. | కుడిప్రక్క పరున్న : పానీయములు, పానీయములు త్రాగిన. సమూహము |
| ఎముక పైభాగము, చర్మము. | ఉపశమనములు. |
| ఎడమప్రక్క. | చల్లని { బహిరంగమైనగాలి స్నానము. |
| | గట్టి ఒత్తిడి : కదలిక. |

1 దీర్ఘకాలము గావించు అసాధారణమైన మానసికపరిశ్రమవలన కలుగు దీర్ఘవ్యాధులు ; తరుణవ్యాధులు.

2 శరీరము వడిలి, ఆరుకుపోయి ముసలివాటము యగుపడినపుడెల్లను అర్జంటమ్‌నైట్రికమునే తలంపవలెను. ఏటేట క్రమక్రమముగ చిక్కిపోవుట.

3 చంటిపిల్లల కండ్లకలక ; పుసులతోకూడి విపరీతమైనబాధతో కండ్లజబ్బు ; బహిరంగమైనగాలిలో ఉపశమనముగ నుండును..

4 తెల్లగుడ్లపై కుదపలు ; మాంసకండలవలె తెల్లగుడ్లు యర్రగా నుండుట ; విస్తారముగా పుసులుకారుట. తెల్లగుడ్లపైగల ఎర్రటి కుదపలు నల్లగుడ్లమీదికి విస్తరించుట.

5 నల్లగుడ్లుదట్టమై పుండ్లుపడి తూట్లుపడుట ; రెప్పలుఒరసి వాచి, దళసరెక్కుట : ఉదయమునకండ్లుఅంటుకొనుట (ఏపిస్, మెర్క్యుసాల్ ; రూస్టాక్సు)

6 పంచదారను తీపివస్తువులను కోరుచుండుట. ఈ వస్తువులను తినుట వలన విరేచనములు కలుగుట.

7 అజీర్ణసంబంధమైన బాధలతో త్రేనుపులు. జీర్ణకోశమున గాలితో కూడిన అజీర్ణము. భోజనమైనపిమ్మట త్రేనుపులు. జీర్ణకోశమున జేరిన గాలివలన జీర్ణకోశము బద్దలగునట్లుండును. కడకుత్రేనుపులువచ్చి విస్తారమయిన వేగముతో గాలివెడలుట.

8 విరేచనములు : పానీయములు త్రాగినపిమ్మట : బెల్లము, పంచదార తినినపిమ్మట విరేచనములు : ఆకుపచ్చని కళ్లెలతో కెరడుల క్రింద విరేచనములు : అపానవాయువు పెద్దధ్వనితో వెడలుట (ఎలోయిన్).

9 చీము రక్తముతో కూడిన విరేచనములు : కడుపులో దిగలాగు చున్నట్లు బాధ. ముదిరిన రక్తగ్రహణి : కోశములు పుండ్లుపడి నట్లు అనుమానించిన పరిస్థితులయందు పనిజేయును.

10 గర్భకోశము దిగజారుట. గర్భాశయ ముఖద్వారమున పుండుపడుట.

11 అప్రయత్నముగ తెలియకుండగనే రాత్రింబవళ్ళు మూత్రవిసర్జన మగుట (కాస్టికమ్).

12 నపుంసకత్వము : సంయోగసమయమున లేపనము తగ్గిపోవుట (ఎగ్నస్, కెలాడియమ్, సెలీనియమ్).

13 సంయోగము స్త్రీకి పురుషునకు గూడ బాధకరముగ నుండుట. సంయోగానంతరము స్త్రీ మర్మావయవమునుండి రక్తము స్రవించుట (నైట్రిక్ యాసిడ్).

14 కాళ్లయందు విపరీతమైన నీరసము వణకుట.

---

ఆర్నికా :—(Arnica)

**స్థానములు.**

రక్తము.
రక్తనాళములు.
నరములు.
కండరములు.
జీర్ణకోశము.

**ఉద్రేకములు.**

గాయము { కముకుదెబ్బలు. దెబ్బలు. వణుకు. ప్రసవము. ఎక్కువ వ్యాయామము. బెణుకులు. }
తాకిన. నిద్రతర్వాత.
కదలిన ముసలివయస్సు. సారాసంబంధమైన.

**ఉపశమనములు.**

పరుండుట { తల క్రిందకుబెట్టి సాచినపుడు. }

1 తల యొకటిమాత్రము లేక ముఖమొకటిమాత్రము వేడిగానుండి తక్కిన శరీరము చల్లగానుండుట.

2 కముకుదెబ్బలు ; కర్రదెబ్బలు ; మొద్దు ఆయుధములచే కలిగిన దెబ్బలు ; పైనుండి పడుటవలన కలుగుబాధలు ; దెబ్బదిమ్ముచే కలుగుమగత : అప్రయత్నముగా మలమూత్ర విసర్జనము.

3 గుండెలలో ఎడమభాగమున పోటు. పొడిదగ్గువలనను కదలిక వలనను యీ పోటు హెచ్చును. పైన నొక్కిపట్టిన ఉపశాంతిగానుండును.

4 శరీరమంతయు చితుకకొట్టినట్లు నొప్పిగాను పచ్చిగాను నుండుట.

5 ఎటుపరుండిన పరుండినభాగమంతయు నొప్పిగాను పచ్చిగాను నుండుట ; అందుచే రోగి ప్రక్కపై యిటునటు తరుచు మారి పరుండుచుండును. పరున్న ప్రక్క మెత్తదనములేక గట్టిగానుండుట. దేనిమీాద పరుండినను మిక్కిలి గట్టిగానుండుట. అందుచే రోగి తరుచు పరుండు ప్రక్క మార్చుచుండును.

6 సన్నిపాతజ్వరములో ; నిర్లక్ష్యము ; మగత : ప్రశ్నించిన సరియైన సమాధానము చెప్పుట : వెంటనే మగతసంధి (సమాధానముచెప్పు వాక్యము పూర్తిగాకమున్నే మగతలోపడుట బాప్టీషియాకు కలదు) చర్మముపై చిన్నపొక్కులు.

7 ప్రసవమైన పిమ్మట కలుగునొప్పులు (after pains) ప్రసవమైన పిమ్మట శరీరమునందలి నొప్పులు పోగొట్టును. సూతికాదోషములు జనింపకుండ కాపాడును.

8 ప్రసవమైనపిమ్మట కలిగిన మూత్రనిరోధమును బోగొట్టి మూత్రమును జారీజేయును.

9 దుర్వాసనతోకూడిన త్రేనుపులు.

10 శరీరమున ఒకదానిపిమ్మట ఒకటి మిక్కిలి నొప్పితో బయలుదేరు చిన్నకురుపులు.

11 ఎడమవైపు పక్షవాతము.

---

## ఆర్సెనికమ్ అల్బమ్ :—

- కలరా దోషహరణకరము.
- సైకోసిస్ దోషహరణకరము.
- సిఫిలిస్ దోషహరణకరము.

**(Arsenicum Album)**

### స్థానములు.

ఆమత్వచలములు.
మనస్సు.
శ్వాసము.
ఊపిరితిత్తులు ; కుడి ; కొన.
రక్తము. హృదయము. నరములు.
వృక్కకము.
రసవహస్రోతస్సులు.
కండరములు.
చర్మము.
మాంసకృతులు.
అవయవములు.

### ఉద్రేకములు.

చల్లని { మంచు, పానీయములు. భోజనములు, గాలి.

నిర్ణితకాలములో { అర్థరాత్రి తర్వాత 2 గం. A.M. 14 రోజులకు. ప్రతి సంవత్సరము.

కూరలు. పానీయము. మద్యపానము.
అంటురోగములు. చెడినమాంసము
పొక్కులు. { వృద్ధిగాని. అణిచిపెట్టుట.
క్వైనైన్. బాధవైపుపరున్న,
పొగాకు. వ్యాయామము.

### ఉపశమనములు.

వేడి { పట్లు (పొడి) ఆహారము పానీయములు.

కదలిన. నడచిన. తల పైకి ఎత్తిన, నిట్ట నిలువుగా కూర్చున్న, సమూహములో.

1 వంటరిగా నున్నప్పుడు ; పరున్నప్పుడు మృత్యుభయము : విపరీతమయిన అస్థిమితము ; మిక్కిలి నిస్త్రాణ ; అశక్తి ; జీవశక్తి త్వరితముగ నశించి మిక్కిలినిస్త్రాణ ; సొమ్మసిల్లుట ; బాధ హెచ్చుగా నున్నకొలది అస్థిమితము, మృత్యుభయము హెచ్చుగానుండుట.

2 మానసిక అస్థిమితము ; కదలుటకు శక్తిలేకపోవుట ; ఒకచో స్థిమితముగ పరుండలేకపోవుట ; తరుచు స్థానము మార్చుచుండుట ; ఒక ప్రక్కనుం డొక ప్రక్కకు తిరుగుచుండుట.

3 అస్థిమితముతో కూడిన మృత్యుభయము ; తనవ్యాధి నివారణ కాదనియు, ఔషధము తీసికొనుట అనవసరమనియు, తానుతప్పక చనిపోవుదుననియు రోగి తలంచుట.

4 చన్నీళ్లకొరకు విపరీతమయిన తీరనిదాహము ; నీటియం దపేక్ష ; కొంచ కొంచము త్రాగుచుండుట (చాలసేపున కొకమారు చాలనీరు త్రాగు గుణము బ్రయోనియాకు కలదు.) నీరు యిముడ్చుకొను శక్తి జీర్ణకోశమునకు లేకపోవుటచే సహింపలేకుండుట : కాని నీరు త్రాగవలసియుండును. గాని త్రాగలేకపోవును : త్రాగుటకుభయముగానుండును.

5 వండిన పదార్థమును చూచుటగాని, వంటవాసనగాని భరింపలేకుండుట : (కొల్చికమ్ : సిపియా).

6 జీర్ణకోశమునందు, కడుపులోను తీవ్రమయిన మంటతో కూడిన బాధతో భరింపలేని అస్థిమితము.

7 పండ్లు, ఐస్ క్రీమ్, ముదిగినపదార్థములు, సారాయములు, వెన్న తినుటవలన జీర్ణకోశము చెడుట.

8 మంటతో కూడిన బాధలు ; యీ బాధగల భాగము కొరకంచుచే కాల్చినట్లు మండుచుండుట (యాంత్రాసినమ్) ఈ బాధ వేడికాప

టముల వల్లను, వేడిపానీయములవల్లను, వేడిపల్లవల్లను, ఉపశాంతిగా నుండుట.

9 ముఖ్యముగా లోపలి అవయవములయందు, చర్మమునందు; రణముల యందు; కురుపులయందు; యిట్టి విపరీతమయిన మంటతో కూడిన బాధ: ఉష్ణోపచారములవలన శాంతించుట

10 మిక్కిలి నిస్త్రాణతో, దుర్వాసనతో వెడలు నల్లటి పల్చని చిన్న విరేచనములుతో మిక్కిలి నిస్త్రాణ; ఆహారము భుజించిన పిమ్మట పానీయములు త్రాగిన పిమ్మట విరేచనములు వెడలుట.

11 మూలశంఖ: విరేచనమయినపుడు గాక కూర్చున్నప్పుడు; నడచునపుడు, గుచ్చుచున్నట్లు బాధ; ఇందుమూలమున కూర్చుండలేకుండుట; నిద్ర పట్టకుండుట; మంట బాధవేడివలన వుద్రేకించుట; ఆసనము చిట్లుటచే మలవిసర్జనము కష్టముగానుండుట :-

12 ఉబ్బసము; ఆయాసము; వగర్పు. ఈ బాధచే కూర్చుండవలెను. లేదా ముందుకు వంగవలెను. ఉబ్బసపుబాధచే గాత్రి పండ్రెండు గంటలు దాటినపిమ్మట ప్రక్కనుండి లేచుట. పరున్న శ్వాస బంధించి ఊపిరి తిరుగదను భయముచే పరుండలేకపోవుట.

13 బాధలు అర్ధరాత్రమునకు పిమ్మట ఉద్రేకించుట.

14 ఉబ్బు: శరీరమంతయు నీరుపట్టుట. చర్మము పాలిపోయి మైనమువలెను మట్టిరంగుతోను నుండుట.

15 స్వల్పపరిశ్రమవలనకూడ విపరీతమయిన నిస్త్రాణ. పరున్నపుడీ నిస్త్రాణ యగుపడదు. కదలుట ప్రారంభించినంతనే మిక్కిలి నీరసముగా యున్నట్లు గుర్తించును.

16 లక్షణములు సర్వసాధారణముగా మధ్యాహ్నము ఒంటిగంట లగాయతు రెండుగంటలమధ్యను రాత్రి పన్నెండుగంటలు లగాయతు రెండుగంటల వరకు దుస్థితిలోనుండును.

17 చర్మము ఆరుకుపోయి పొలుసులువలెను; ముడతలుపడి నీలివర్ణముగ జిగురుగలిగిన చల్లటి చమటతోను దళసరిగ తోలువలెను యుండును. మంటతోకూడిన నల్లనిపొక్కులు. తామర, మంటతో కూడిన ఇతరచర్మవ్యాధులు.

18 కుళ్లినపదార్థములు, మాంసములు భుజించుటవలన దుర్గంధయుత వాయువులు పీల్చుటవలనకలుగు దుర్గుణములు.

19 సన్నిపాతలక్షణములలో ప్రారంభదశయం దుపయోగించనవసరము లేదు. తరుచు రూస్టాక్సు పిమ్మట అవుసరముండును.

N. B:—ఈ ఔషధము సర్వరోగనివారణీయని తలంపబడినప్పటికి లక్షణసారూప్యమునుబట్టి అవసరమైన పరిస్థితులయందే వాడనగును. ప్రాణావసానకాలమున హెచ్చుపొటెన్సీలలో వాడిన, వ్యాధిని మరలించి ఆరోగ్యము చేకూర్చును లేదా మరణవేదను బాపి ప్రశాంతముగ రోగిని మృత్యుముఖమున జేర్చును. గ్రహణివిరేచనములయందు అతి జాగరూకతతో లక్షణసారూప్యములనుబట్టి ప్రయోగించవలెను. లేనిపక్షమున వ్యాధిని క్లిష్టపరిస్థితులలోబెట్టును. జీర్ణకోశము; మలకోశము; మూత్రకోశము సంబంధమైన వ్యాధులకు తక్కువ పొటన్సీలు వాడనగును. చర్మముల సంబంధమైన; నరములసంబంధమైన; తిమ్మిరి, ఃజిల, సంబంధమైన వ్యాధులలో హెచ్చు పొటన్సీలు వాడనగును.

## ఆరమ్ ట్రిఫ్లిలమ్ —(Arum Triphylilum)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| ఆమత్వ చల ములు { నోరు, గొంతుక. కంఠములోని స్వరపేటిక యను నాళము. | అతివిస్తారముగా మాట్లాడుట { మాట్లాడుట. పాడుట. |
| మూత్రపిండములు. బుద్ధి. | చలి, తేమగాలులు. |
| రక్తము. చర్మము. | వేడి. |

1 దురద మంటతోకూడిన స్రావముతో రొంప. ఈ స్రావముచే ముక్కురంధ్రములు, పై పెదవి వరయుట, (అరుసు, కేపా) పగులుట : రక్తము స్రవించుట.

2 రక్తము వచ్చువరకు నిరంతరము ముక్కుగోకుట : వ్రేళ్లను ముక్కురంధ్రములలోనికి జొనిపి త్రిప్పుచుండుట.

3 రక్తము స్రవించువరకు పెదవులను గిల్లుట : పక్కులుతీయుట ; నోటి చెలివిలు పగులుట : రక్తము స్రవించుట : రక్తము స్రవించువరకు చేతిగోళ్లను కొరుకుట.

4 కంఠము, నోరు, పచ్చిగాను నొప్పిగానుయుండుటచే పిల్లలుఅన్నము తినుటకు పానీయములు త్రాగుటకు తిరస్కరించుట.

N. B :—చిన్న పొటన్సీలలో ప్రయోగింపరాదు. తరుచు ప్రయోగించరాదు. ఇందువలన దుర్గుణములు కలుగును. హెచ్చు పొటన్సీలు తక్షణము మంచిగుణములు కలుగజేయును.

ఆరమ్ మెటాలికమ్ :— { (శోరాదోష హారణకరము) (సిఫిలిస్ దోష హారణకరము) }

**(Aurum Metallicum)**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| మనస్సు. నరములు. | మనోవికారము. { అధైర్యపడు : వ్యాధి కలిగించు : బాధించు. } |
| నాళములకోశము. | మానసికవ్యాయామము. |
| హృదయము. | చలి రాత్రి { సూర్యాస్తమయము మొదలు సూర్యోదయముకు. } |
| ఎముకలు { ముక్కు-సంబంధమయిన : పుర్రె. కీళ్ళు. } | **ఉపశమనములు.** |
| మాంసగ్రంధులు. కాలేయము | చల్లని. బహిరంగమైనగాలి. |
| మూత్రపిండములు. | చన్నీటిస్నానము. |
| | వేడిఅయిన, నడచిన. |

1 జీవితమునందసహ్యముకలిగి మిక్కిలి విచారముగ నుండుట ఆత్మహత్య గావించుకొనవలెనని తలంపు. (నర్సువామికా రోగికిగూడ యిట్టితలంపుండునుగాని మృతినొందుటకు భయము.)

2 సవాయివ్యాధి జీర్ణించుటవలన చెడినతత్వమునకు, రసప్రయోగము మూలమున చెడినతత్వమునకు ఉపయోగించు. సవాయివ్యాధియందు, రసప్రయోగ దుర్గుణములయందు వెంట్రుకలు రాలిపోవుట. వ్యాధిచే జీవితము దుర్భరమయి ఆత్మహత్యగావించు కొనదలచుట.

3 రసదోషములవలన సవాయివలన ఎముకలనుగూడ విస్తరించు లోతగువ్రణములు. ఎముకకు సంబంధించిన వ్యాధులు ; ఎముకలు

పుచ్చుట. ముక్కు, అంగుడి, ఎముకలు తినివేయబడుట. విపరీత మయిన దుర్వాసనతో కూడిన స్రావములు. బాధలు రాత్రి విప రీతముగనుండుట: నిరాశజెందుట : (ఎసఫటీడా) ఆత్మహత్యా ప్రయ త్నములు. చెవియందు, ముక్కునందు, గలపుండునుండి విపరీత మయిన దుర్వాసనతో కూడిన స్రావము.

4 వస్తువులు నిలువుగా విభజింపబడియున్నట్లు అగుపడుట. అడుగు భాగముమాత్రమే గాంచగలుగుట. పై భాగము నల్లనివస్తువుచే కప్పబడియున్నట్లగుపడుట.

5 గర్భాశయము, వాచి గట్టిపడుట : దిగజారుట (పోడో : రూస్)

6 మిక్కిలి విచారముతో కూడిన, ఋతుసంబంధమయిన, గర్భకోశ సంబంధమయిన వ్యాధులు.

N. B:—ఈమందు గర్భకోశమునకు, ఎముకలకు సంబంధించిన వ్యాధు లలో, అసఫటీడా, కల్కేరియా, ప్లాటినా, సిపియా గుణ ములకు పోలియుండును.

---

ఎసఫటీడా :—(Asafoetida)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| నరములు, మనస్సు. | రాత్రి, గదిలో, విశ్రాంతి. |
| కంఠనాళము, జీర్ణావయవమార్గము | తినుచుండిన, అణిపెట్టుటచే. |
| వెన్నెముకపై భాగము. { చెవులు. ముక్కు. ఏగర్ర ఎముక. | పాదరసమువలన, ధ్వనిచే, |
| ఎడమప్రక్క | కూర్చుండిన, వెచ్చనిదుప్పట్లవలన. |
| | **ఉపశమనములు.** |
| | బహిరంగగాలిలో తిరిగిన : ఒత్తుడి వలన |

1 కంఠములో ఉండయున్నట్లు, పైకివచ్చుచున్నట్లు భావన ; అందుచే ఆ వుండను క్రిందికిదింపివేయుటకు తరుచు మ్రింగుచు గుటకవేయ వలసియుండుట ; ఒక్కొక్కప్పుడు కష్టతరమగు శ్వాస కలుగ జేయుట.

2 ముఖ్యముగా నరములు సంబంధమయిన అపస్మారము. (హిస్టీరియా) మూలశంఖసంబంధమయిన తత్వముల కుపయోగించును. ఈ తత్వముల కనుగుణ్యముగ నీమందును నిర్ణయించవలయును.

3 సవాయి జీర్ణించిన తత్వములలో ఎముకలపుండ్లు ; రణములు ; ముక్కుఎముకపుచ్చి దుర్వాసనతోకూడిన స్రావము స్రవించుట.

4 మిక్కిలి సున్నితమయిన తత్వము : రాత్రిభాగమున విపరీతమైన బాధలు.

---

బాప్టీషియా :—(Baptisia)

| స్థానములు. | ఉద్రేకములు. |
| --- | --- |
| రక్తము. మనస్సు. నరములు. | తడితోగూడు వేడి. పొగమంచు. |
| ఆమత్వచల ములు { జీర్ణావయవ మార్గము | గదిలో. |
| | ఒత్తిడివలన |
| ఎడమ ప్రక్క | నిద్రనుండి మేల్కొనిన |

1 సన్నిపాతజ్వరముయొక్క అన్నియవస్థలయందును పనిచేయును : శరీరము చితుకకొట్టినట్లుండుట ; సంధిసంబంధమయిన మగత : ప్రశ్నకుసమాధానమిచ్చుచు వాక్యముపూర్తికాకమున్నే నిద్రలో బడుట : పలుకరించిన నిద్రలోపడుట (పలుకరించిన సరియైన

సమాధానము చెప్పి తిరిగి వెంటనే సంధిలోపడులక్షణము ఆర్ని కాకు కలదు) మిక్కిలి నిస్త్రాణ.

2 శరీరమునుండివచ్చు సమస్తస్రావములు, ముఖ్యముగా సన్నిపాత జ్వరములోను, యితరతరుణవ్యాధులలోను, శ్వాస విరేచనములు, మూత్రము, చమట, కురుపులు, మిక్కిలి దుర్వాసనతోనుండుట. (సోరినం, పైరోజినమ్).

3 నాలిక ప్రథమమున తెల్లటిపూతతోను ; ఎర్రటిపొక్కులతోను యుండును : ఆరుకుపోయి మధ్యభాగము గౌరవర్ణముగా నుండును. పిమ్మట పొడిగా పగుళ్లతోను పుండుతోను యుండును.

4 ముఖముకంది ఎర్రబడి ఉబికి త్రాగినవాని ముఖవర్ఛస్సుతో నుండును. (జెల్సి).

5 ద్రవపదార్థములుమాత్రమే మ్రింగగలుగుట : గట్టిపదార్థములు మ్రింగలేక కంఠమునకడ్డుబడుట.

6 శరీరావయవములు దేనికవి విడిగాపడియున్నట్లుభావన. అవిదగ్గరకు జేర్చవలయునని యిటునటుదొర్లుచుండుట. నిద్రబోయిన యీ భాగములు దగ్గరకుజేరవని నిద్రబోలేకుండుట.

7. కల్లుత్రాగినట్లుగా మనస్సునందు అగమ్యము.

8 రోగి ఏప్రక్కపరుండినను ప్రక్కపై ఆనినభాగములు పచ్చిగా చితుకకొట్టినట్లుండుట. శరీరమునందంతటను, ఏవిధమయిన తేడా లేకుండ వ్యాధిభావన (Sick feeling) నీరసము : నిస్త్రాణ : బడలిక : చితుకకొట్టినట్లుండుట.

9 సన్నిపాతస్థితికిమారు దుర్వాసనతోకూడిన నల్లటి బూడిదరంగువంటి విరేచనములు లేక రక్తవిరేచనములు.

N. B :—సన్నిపాతజ్వరములలో ఆర్సనికమ్ అయుక్తముగ నుపయో గించినపుడుగాని, లేక చాలా తరచుగా నుపయోగించు నపుడుగాని, దీనినుపయోగించిన నుగుణము గాంచవచ్చును సన్నిపాతజ్వరములయందు గలుగు రక్తస్రావములలో నీ ఔషధమునకు పిమ్మట క్రోటలస్ హెమమిలిస్, నైట్రికాసిడ్, టెరిబిన్థైనా చక్కగ పనిజేయును.

---

## బెరైటా కార్బానికా :— (Baryta carb) (శోరాదోషహరణకరము)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| జీర్ణము. | సమూహము. ఒకదానినిగూర్చి ఆలోచించుటచే. |
| మనస్సు. | చలి { తేమ ; పాదములకు, తలకు, మారుట. |
| మాంసగ్రంథులు { గొంతుక. ప్రోస్టేటి. | పరుండిన { బాధగానున్నవైపు. ఎడమప్రక్క. |
| హృదయము. నరములు | వాసనలు. |
| రక్తనాళములు. | **ఉపశమనములు.** |
| ఊపిరితిత్తులు. | వెచ్చనిదుప్పట్లు |

1 విపరీతమయిన బుద్ధిమాంద్యము : శరీరదుర్బలత్వము ; పిల్లలలో విశేషమగు మరపు : చదువురాకుండుట.

2 ముఖ్యముగా కండరములవాపుతో గండమాలతత్వము (scrofulous) గల పిల్లలకు, సరిగా ఎదుగని మరగుజ్జుపిల్లలకు ముసలివారికి

ఉపయోగించును చలిగాలివలన కలుగు గదవలవాపు. హో:;
గదవకాయలజబ్బు (టాన్సిల్సు).

3 మూత్రవిసర్జనము చేయునపుడెల్ల మూలశంఖ బైలుపడవచ్చును. (మూరియాటిక్ యాసిడ్).

4 ద్రవపదార్థముతప్ప తక్కినపదార్థము మ్రింగలేకపోవుట (బాప్టీషి: సిలికా).

5 వృద్ధుల వ్యాధులు: అండములువాచుట.

---

బెల్లడోనా :—(Belladona) (శోధదోషహరణకరము)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| నరకేంద్రములు | వేడి; సూర్యకాంతి, వేడెక్కినట్లు. |
| రక్తనాళములు కేశనాళికలు | అపరాహ్ణము (3 P. M.) |
| ఆమత్వచలులు { కంఠము నోరు / గొంతుక | గాలికెరటములు. తలమీద; తల |
| చర్మము | వెంట్రుకలు కత్తిరించుట (గ్లొనై) |
| అవయవములు | చల్లనిది తీసుకొనినతర్వాత: అణచి పెట్టుట. చమట ఆగిపోయిన |
| కుడివైపు | వెలుతురు. శబ్దము. వణుకు. |
| | ముట్టుకొనిన. సంఘములో. |
| | కదలిన. క్రిందకి వ్రేలాడిన. |
| | **ఉపశమనములు.** |
| | తేలికవి కప్పుకొనిన. |
| | వెనుకకు వంగిన. |
| | ప్రక్కపై పరుండిన. |

1 ఎదుట దయ్యములు, భూతములు; రాక్షసులు కనుబడుచున్న వను కొని భయముతో వానినుండి రోగి తప్పించుకొనుటకు పారిపోవ యత్నించును.

2 స్వస్థతగనున్నపుడు ఉల్లాసముగను ; చురుకుగనుఉండి వ్యాధివచ్చి నప్పుడు తరుమ తీవ్రమయిన సంధిలోయుండు వ్యక్తుల కుపయోగించును.

3 తీవ్రమయిన జ్వరము. సంధి : కాళ్లుచేతులు చల్లగానుండుట : శరీరము ఆర్చుకొనిపోయి శరీరము వేడిగానుండుట. ఉష్ణము ఎక్కువగను, ముఖము ఎర్రగాను యుండును (జెల్సి).

4 ముఖము ఎర్రగా నిగనిగలాడుచు యుబ్బియుండుట.

5 తీవ్రమయినసంధి : సంధిలోకరచుట ; ఉమ్మివేయుట ; కొట్టుట ; బట్టలుచింపివేయుట ; కోపముతో పండ్లుకొరుకుట ; నవ్వుట ; దగ్గిర ఉపచారముచేయువారిని కరచుట కొట్టుట : (స్ట్రెమోనియం) పారిపోవజూచుట (హెల్లిబోరస్) తల వేడిగాను నొప్పిగాను యుండుట : వెర్రిచూపు : తేరిబారిచూచుట ; గ్రుడ్లు పెద్దవగుట : విరేచనమందము ; మూత్ర మణచిపెట్టబడుట : నోరు ఆరుకుపోవుట ; నిద్రగాయున్నను నిద్రపోజాలకపోవుట ; నాడి నిండుగా గోళాకారముగా గంతువేయుచున్నట్లుండుట.

6 బాధలు ముఖ్యముగ కడుపులోను, పొత్తికడుపులోను ఆకస్మికముగవచ్చి కాలనియమములేకయుండి ఆకస్మికముగ వచ్చినట్లే తగ్గుట (మేగ్ ఫాస్).

7 బాధలు సాధారణముగ విడిచి విడిచి వచ్చుచు కొలదిసేపుమాత్రమేయుండుట.

8 పిల్లలకు పళ్లువచ్చుకాలములో జ్వరముతోవచ్చు కంపములు (convulsions) (జ్వరములేకుండవచ్చు కంపములకు మేగ్ఫాస్) ఈ కంపములు ఆకస్మికముగవచ్చును. తల వేసిగానుండును. కాళ్లు చల్లగానుండును.

9 తలపోటు ; తలకు అధికరక్తప్రసరణము (గ్లొనైన్) ముఖము కండ్లు ఎర్రగానుండుట ; మెదడు బద్దలగుచున్నట్లుండుట ; కదలికవల్లను ధ్వనివల్లను, వెలుతురువల్లను, ముందుకువంగినను, ఉద్రేకించుట : నొక్కిపట్టుటవల్లను, గట్టిగ గుడ్డబిగించి కట్టుటవల్లను, వెనుకకు వంగుటవలనను ఉపశమనముగ నుండుట.

10 వంగునపుడు, వంగిలేచినపుడు, తలత్రిప్పు ; కండ్లుతిరిగి, చీకట్లు కమ్మి (బ్రయో), వెనుకకుగాని, ఎడమవైపునకుగాని పడుట.

11 కడుపు పచ్చిగాను, నొప్పిగాను యుండుట ; కదలిననొప్పి హెచ్చుటచే నెమ్మదిగ అడుగులువేయుచు నడచుట.

12 ఆంత్రవేష్టనము (peritoneum) వాచి ఉద్రేకించుట. కడుపులోని యితరభాగములు వాచి ఉద్రేకించుట. అందు పైకడుపు విపరీతముగ ఉబ్బరించి ముట్టుకొనిన నొప్పిగానుండుట ; కదలిన బాధలధికమగుట ; కడుపు వేడిగానుండుట ; తీవ్రమయినబాధ.

13 రక్తపిత్తముగల స్త్రీలయందు ఋతుస్రావమెక్కువగ యగుట ; గర్భాశయరక్తస్రావములు : రక్తము ఎర్రగానుండును.

14 గాలివీచినపుడెల్ల జలుబుచేయుట ; ముఖ్యముగా క్షౌరముచేయించుకొనినపిమ్మట : తలకు ఆచ్ఛాదనలేనపుడు.

15 గొంతుజబ్బులు ; కుడివైపు గవదకాయలు వాచుట, ఎర్రబడి మ్రింగుట కష్టముగానుండుట ; గొంతుక ఆరుకపోయి, విడిచివిడిచి బిగబట్టుట ; మునుచుకొనిపోవుట.

16 దగ్గు : కంయ్యుమని మొరగినట్లు దగ్గు : రక్తజీరతోను, కడుపు నొప్పితోను గూడిన కోరింతదగ్గు : ఎడమచట్టయందు నొప్పితో కూడినదగ్గు : కంఠము బొంగురు : మాటరాకుండుట : ప్రతిశ్వాస తోను మూల్గుట ; రాత్రి ఉద్రేకించుట.

17 చర్మము సమానముగ మెత్తదనముతో మెరయుచు ఎర్రబడి యుండుట.

18 కడుపులోనిభాగములు స్త్రీ మర్మావయవముద్వారా క్రిందకు పడు చున్నట్లు దిగలాగుట. (సిపియా) ఉదయమున, నిలుచున్నప్పుడు, కూర్చున్నప్పుడు, ఉపశాంతిగ నుండుట.

19 పగలు మూడుగంటలకు అర్ధరాత్రిపిమ్మట సర్వసాధారణముగ బాధలుద్రేకించును పరున్నను ; నిలుచున్నను ; తిన్నగా కూర్చు న్నను వెచ్చనిగదియందు ఉపశమనముగ నుండును.

---

బెన్ జాయిక్ యాసిడ్ :— (శోరాదోషహరణకరము) (సైకోసిస్ దోషహరణకరము)

**(Benzoic Acid)**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| మూత్రము { మూత్ర పిండములు, మూత్రకోశము. | బహిరంగమయినగాలి, చల్లన గాలిమార్పుచే. |
| కీళ్లు, హృదయము, ప్రేగులు. | **ఉపశమనములు.** |
| | వేడిచే. |
| | విస్తారముగా మూత్రము పోయిన. |

1 మూత్రము మిక్కిలి బూడిదరంగుగా దుర్వాసనతో వెడలుట.

2 ముసలివారియందు దుర్వాసనతో కూడి వెడలుమూత్రము.

3 యూరిక్ యాసిడ్‌తో కూడిన మూత్రముతో కీళ్ల వాతము (Gout.) : అన్నికీళ్లకు కలుగుట : ముఖ్యముగా మోకాలు నడచునపుడు, చిటుకు చిటుకుమనుట.

4 గనేరియా సవాయిరోగములయందు కలుగు ఆమవాతకీళ్లనొప్పులు (Rheumatic Gout.)

---

## బెర్ బెరిస్ వల్గరిస్ :— { (శోరాదోషహరణకరము) (సైకోసిస్ దోషహరణకరము)

**(Berberis Vulg.)**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| మూత్రసంబంధమైన : మరియు జీర్ణావయవ మార్గము. { మూత్రపిండములు. కాలేయము. మూత్రకోశము. | కదలిక { కుదుపు, గట్టిగా అడుగిడుట, కూర్చుని లేచుట |
| రడుము (తుంటిలు) | బడలిక. |
| కీళ్లు · గర్భాశయము. | మూత్రము విసర్జన చేయుచున్నపుడు. |
| శుక్లవాహిక. | |

1 మూత్రాశయములో (Kidneys) ఒకదానియందుగాని రెండింటి యందుగాని, కోయుచున్నట్లు, గుచ్చుచున్నట్లు, పీకుచున్నట్లు బాధ ; మూత్రాశయమునుండి, మూత్రకోశమునకు (Bladder) మూత్రావయవమునకు (Urethra) పొడుచుచున్నట్లు కోయుచున్నట్లు బాధ.

2 మూత్రకోశభాగమునందు, మంట, నొప్పి.

3 మూత్రము విసర్జించునపుడు చట్టలలోను, తుంట్లయందు బాధలు

4 శుక్లవాహికయందు (Speramatic cord) దిగలాగునట్టి పొడుచు చున్నట్టి బాధ. ఈ బాధ అండవుల వరకు విస్తరించుట.

5 మూత్రావయవములకు సంబంధించిన మేహవాత ఆమవాత సంబాధ మయిన బాధలు.

6 కదలికవలన మూత్రసంబంధమయిన బాధలు హెచ్చుట

N. B.—మేహవాత సంబంధమయినవ్యాధులలో ఆర్నికా, బ్రయో, కాలీబై, రూస్‌టాక్స్, సల్ఫరుకు పిమ్మట బాగాపనిజేయును.

---

బొరాక్సు :— (Borax) { (శోరాదోషహరణకరము) (సూడోసోరిక్) }

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| ముచ్చిలిగుంట. | అధోచలనము. |
| జీర్ణక్రియసం { సరములు. | ఆకస్మిక శబ్దములు. |
| బంధమైన } ఆమత్వచలములు. | చలి ; తడి. |
| నోరు. చర్మము. మూత్ర పిండ ములు. | పసిపిల్లలకు, పిల్లలు. పండ్లు. |
| | **ఉపశమనములు.** |
| మూత్రకోశము. | రాత్రి 11 గంటలకు P.M. |

1 సమస్తబాధలలోను, అధోగమనమునందు (Downward motion) భయము.

2 నోరు పూయుట ; నాలుకపైన నోటియందు దవడల లోపలిభాగ మున పూత : నోరు ఆరుకపోయి వేడిగానుండి దాహము. అన్నము

తినునపుడు నోటినుండి రక్తము స్రవించుట : ఈ బాధచే పిల్లలు పాలు త్రాగునపుడేడ్చుట. నాలుక బద్దలై రక్తము స్రవించుట.

3 పిల్లలలో వేడిమూత్రము. అందుమూలమున మూత్రవిసర్జనమునకు భయపడుట : మూత్రము విసర్జించునపుడేడ్చుట.

4 కుసుమ : విస్తారము కోడిగుడ్డుసొనవలె వేడినీళ్లవలె క్రిందకు కారుచున్నట్లుగా నుండుట ; బహిష్టుకు రెండువారములు మధ్యగ వెడలుట. (బొవి ; కోని) ఋతుశూల : త్వరలో బహిష్టగుచు విస్తారమయిన స్రావము వెడలుట.

5 వంధ్యత్వము : సులభముగ గర్భధారణకు సహాయభూతమగును (ఎగ్నస్, నేట్రమూర్, కోనియమ్)

6 అరికాళ్లలో పోట్లు.

N. B :—ఎసిటిక్ యాసిడ్‌కు, ద్రాక్షసారాయమునకు ముందుకాని వెనకగాని వాడరాదు.

---

## బ్రోమియమ్ :—(Bromium)

(సూడోసోరిక్)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| కంఠములోని స్వరపేటిక యనబడు నాళము. | వెచ్చని { తేమ. ఎక్కువవేడిజేయుట గది |
| శ్వాసము. | సముద్రస్నానము.. |
| హృదయము. రక్తప్రసారము | దుమ్ము. విసురుగాలి. |
| మాంసగ్రంధులు { థైరాయిడ్ అండాశయములు స్తనములు | అర్ధరాత్రివరకు |

## బ్రోమియమ్

### ఉపశమనములు.

ముక్కునుండి రక్తముపడిన (తల తిరుగుట, తల, రొమ్ము)
సముద్రమువద్ద : కదలిన.

1 తుమ్ములతో విస్తారమయినరొంప : విడువక దీర్ఘకాలముండురొంప; ముక్కురంధ్రములు ; ప్రక్కలు ; వరసిపుండుపడుట.

2 నల్లటి విరేచనముతో మిక్కిలి నొప్పిగానుండు రక్తము స్రవింపని మూలశంఖ (Blind hemorrhoids)

3 పెద్దశబ్దముతో (అపానవాయువలె) స్త్రీ మర్మావయవమునుండి గాలివెడలుట (లైకో) : ఋతుశూల.

4 గొంతుకలో శీతలముగానుండుట, శ్వాసపీల్చునపుడు చల్లగా నుండుట.

5 వగర్పు : ఆకస్మికముగ ఊపిరాడకుండవచ్చు దగ్గు : ఆయాసము: శ్వాసకొరకు పెనగులాడుట.

6 ఆయాసము : బాగా శ్వాస లోపలికి పీల్చలేకపోవుట : శ్వాస గొట్టము పొగచే నిండియున్నట్లుండుట (గనేరియా అణచిపెట్టిన పిమ్మట వచ్చుదగ్గు)

7 అంగమువాచుట : కదలిన బాధగనుండుట.

8 గట్టిగొంతుక కంతులు (goitre) (ఐడిన్ నివారణచేయలేని గొంతుక కంతి సీబౌషధము నివారణజేసెను.)

N.B :— బ్రోమియమ్‌కు, ఐడిన్‌కి గలతేడా :— బ్రోమియమ్ నీలి నేత్రములుగల రోగులకు ఐడిన్ నల్లని నేత్రములుగల రోగులకును ఉపయోగించును. (హెర్నింగు).

## బ్రయోనియా :—(Bryonia)

### స్థానములు.

రక్తము.

రక్తప్రసరణము. కాలేయము.

ప్రాణ ఆమత్వ చలములు. { తల, రొమ్ము. కీళ్లు, ఉదరము.

చలన నిర్మాణము { నరములు. కండరములు.

కుడివైపు.

ధాతుమజ్జాదులు.

రక్తకణములు.

### ఉద్రేకము.

కదలిన { [illegible] : [illegible] [illegible] : [illegible] ము. [illegible] [illegible]

వేడి—కలుగుట వలన. గాలి.

వేడిపానీయములు త్రాగుట వలన.

శాకములు. పుల్లని పదార్థములు.

రసభస్మము.

విసుగుదల. కోపము.

అణిపెట్టుటచే.

చల్లనిది తీసుకొనుటచే.

### ఉపశమనములు.

ఒత్తిడి { బాధవైపు పరుండిన. గట్టిగాకట్టిన మొదలగు.

చల్లనిగాలిచే. నిశ్చలనముచే.

మబ్బుగానున్న, చల్లగానున్న రోజులు.

మోకాళ్ళపైకి మడచుకొనుట.

వాచినభాగమునకు వేడికలుగుట.

1 శీతకాలముగతించి వేసవికాలము వచ్చురోజులలో కలుగుబాధలు.

2 మిక్కిలి చిరచిరకోపము : సులభముగ కోపించుట : తీవ్రమయిన ఉగ్రము.

3 పరున్న పరుపు క్రిందకు దిగిపోవుచున్నట్లు భావన.

4 తలనొప్పి : చెమటపట్టుచున్న ముఖము చన్నీళ్ళచే కడుగుటచే తల నొప్పి : ముందుకువంగిన, మెదడుబద్దలై ముఖమునుండి క్రిందకు పడునట్లుండుట : దగ్గినమీాదవచ్చు తలపోటు. ఉదయమున లేచిన పిమ్మట తలపోటులేక ఉదయమున నిద్రనుండి కండ్లుతెరువగనే తల పోటు : తలపోటు ఉదయముననే ప్రారంభించి, సాయంత్రముగు వరకు క్రమముగా వృద్ధియగుట : మలబద్ధముపై వచ్చు తలపోటు (ఎలోయి, కోలిన్ సోనియా, ఓపియమ్).

5 పెదవులుఎండి పగులుట : రోగి తరుచు నాలికతోగాని నీటితోగాని పెదవులను తడుపుచుండుట. నోరు ఆరుకుపోవుట, చన్నీళ్ళుత్రాగ వలెనని కోరికతో దాహము.

6 విపరీతమయినదాహము. చాలసేపు కొకమారు, చాలానీళ్ళుత్రాగుట (తరచుకొంచము కొంచముగా త్రాగుట. ఆర్సు)

7 తరచుగా నీళ్ళుత్రాగుటచే నోటిచేదుతగ్గుట: వమనముచేయకోరిక.

8 ఎర్రటిమూత్రము : వేడిగా స్వల్పముగా వెడలుట.

9 విరేచనబద్ధము : విరేచనమునకు అనుమానమే లేకపోవుట (ఓపియమ్) విరేచనము పెద్దదిగ గట్టిగా రాయివలె నల్లగా కాలిపోయి నట్లు వెడలుట.

10 విరేచనములు : వేడిగాలిలో కలుగు విరేచనము ; పసరువిరేచనములు. విరేచనములు ఆసనమున మంట నొప్పితో వెడలుట ; మురికినీళ్ళవంటి విరేచనములు : అరగని ఆహారపదార్థములతోకూడిన

విరేచనములు. వేడిచేసినపుడు చన్నీళ్లు త్రాగుటవలన కలుగువిరేచనములు : ఉదయమునను కదలికవలనను ఉద్రేకించుట.

11 సన్నిపాతజ్వరలక్షణములు :— మిక్కిలి నీరసము, తలలోను, వసముసందు, కాళ్ళయందు, బాధలు. కదలిన ఉద్రేకించును : నాలుకపై తెల్లనిపూత : పెదవులు నోరు ఆరుకుపోయి దాహములేకగాని, చాలసేపునకొకమారు విస్తారముగ నీళ్లుత్రాగు దాహముతోగాని యుండుట : ఆకలిలేకపోవుట : మలబద్ధముతో వట్టి క్రేణుపులు : అస్థిమితమైననిద్ర : నిద్రయందు వ్యాపారముగూర్చి కలలు : తరచుగానుండు ప్రధానలక్షణము :— ప్రక్కనుండి లేచినపక్షమున కండ్లు తిరిగి సొమ్మసిల్లును (ఈ లక్షణ మొక్కొక్కప్పు డుండకపోవచ్చును.)

N. B :— ఈ లక్షణములు గాంచినవెంటనే బ్రయో 30 కొన్నిమాత్రలను ఒకగ్లాసు చన్నీళ్లలోగలిపి రెండుగంటలకొకమారు మూడు నాలుగు మోతాదులవరకు నిచ్చి 24 గంటలవరకు వేచియుండవలెను. అటుపిమ్మట రోగోపశమనముగాంచి సుగుణము నడచునంతకాలము నికమందు నీయవలసినయవసరములేదు. సాధారణముగా నిక ఔషధమీయవలసిన అవసరముండదు. మొదట ప్రయోగించిన ఔషధముతోనే జ్వరము పూర్తిగ నివారణయగును.

12 సంధి : రాత్రిభాగమునను తెల్లవారుఝామున మూడుగంటలకు హెచ్చుగానుండుట. తనవ్యాపారముగూర్చి ఎల్లప్పుడు మాట్లాడుచుండును. ప్రక్కనుండి లేవవలయునని యిటికివెళ్ళవలయునని యుండును. (హాయెస్)

13 అజీర్ణసంబంధమైన జబ్బు : నోరు నాలుక ఆరుకుపోవుట : నాలుకపై తెల్లనిపూత : లేచిన, వంగినతలదిమ్ము : ముఖముబరువు : నోరు

చేదు ; తిన్న ఆహారము బరువుగా రాయివలె నుండుట: త్రేణుపుల వలన ఈబరువుతగ్గుట (నక్సు: పల్సు) కడుపు పచ్చిగాను మొట్టి కన్న నొప్పిగాను యుండుట. విరేచనబద్ధము.

14 జలుబుచేయుటవలన మెడలోను, నడుములోను, తుంటెలలోను, కండరములయందు చితుకకొట్టినట్లు నొప్పులు.

15 ఎడమచెయ్యి కాలు నిరంతరము కదలుచుండుట (ఎపొసి. హెల్లిబో)

16 న్యూమోనియా (Nuemonia). ఎకొనైట్ ప్రథమమున కొన్ని తీవ్రమైనలక్షణములు తగ్గించినపిమ్మట యీమందు బాగుగా ఉపయోగించును.

17 దగ్గు : పొడిదగ్గు : విడిచివడిచివచ్చు ఉక్కిబిక్కిరిచేయు దగ్గు ; వాంతి (కాలీకార్బ) : దగ్గుతో గుండెలలోపోట్లు. కదలలేకపోవుట. ఊపిరి పీల్చలేకపోవుట ; తలముక్కలై పడిపోవుచున్నట్లు దగ్గుతో తలపోటు ; అన్నముతిన్నపిమ్మట, పానీయములు త్రాగినపిమ్మట, వెచ్చనిగదిలోను, ఊపిరిపీల్చినను ఉద్రేకించుట : దగ్గిన గుండెలు పగిలినట్లుండుట ; గుండెలుపట్టుకొని దగ్గుట : దగ్గినప్పుడు గుండెలు మంటగానుండుట : కంఠమున జిగురువంటి శ్లేష్మము ; చాలసేపు దగ్గినపిమ్మట పైకివచ్చుట. బూడిదరంగువంటి శ్లేష్మము ముద్దముద్దలుగ పడుట. రాత్రిభాగమున దగ్గుచే కూర్చునియుండవలసియుండుట.

18 కీళ్ళు ఎర్రబడి వాచి వంగనీయకపోవుట ; కదలుటవలన పోట్లు హెచ్చిపోవుట (కదలికవలన తగ్గుగుణము :—రూస్టాక్సు)

19 చనుకుదురు : స్థనమువాచి, వేడిగా నొప్పితో గట్టిగా రాయివలె నుండి, మంట ; పోటు ; సలుపు ; స్థనము ఎత్తిపట్టి యుంచవలెను (ఫైటో)

20 పిల్లలు దొరకనివస్తువులకొరకు పేచీపెట్టుట ; తెచ్చియిచ్చినవెంటనే తిరస్కరించుట : పిల్లలు ఎత్తుకొనితిప్పుటకు లేవతీయుటకు సమ్మతింపకుండుట.

21 బహిష్టగుదినములలో బహిష్టుకు బదులు ముక్కునుండి రక్తము స్రవించుట. (ఫాస్) రక్తవమనము.

N. B :—బ్రయోనియాకు పిమ్మట కాలీకార్బ్, నక్సువా, ఫాస్, రూస్టా, సల్ఫర్ వాడనగును.

బాధగానున్నభాగమున పరున్న ఉపశాంతిగానుండును: (పల్సు) : కదలికవలన బాధలుద్రేకించును. స్థిమితముగ పరున్న ఉపశమనముగ నుండును. కల్ కేరియాకార్బ్, బ్రయోనియా నీ రెండును, లక్షణములయందు చాలపోలిక గలిగియున్నప్పటికి మధ్య (intercurrent remedy) యీయకుండ ఒకదానిపిమ్మట ఒకటి వాడరాదు.

తలపోటు పరున్నపుడు ద్రేకించిన బెల్లడోనా ఉపయోగించవలెను. తలపోటువలన లేచుటకు వీలులేక పరుండవలసివచ్చినప్పుడు బ్రయోనియా ఉపయోగించును. బాధగానున్నభాగమున పరున్న బాధలుద్రేకించుపక్షమున బెల్లడోనా ఉపయోగించవలెను. బాధలుపశమించుపక్షమున బ్రయోనియా ఉపయోగించును. అస్థిమితము ఉష్ణోపచారములవల్లను కదలికవల్లను ఉపశమించు సందర్భములలో రూస్టాక్సు ఉపయోగించును. బ్రయోనియా అనుకూలించురోగుల తత్వము దీర్ఘవ్యాధిలోనికి జేరినపుడు అల్యూమినా అనుకూలించును. కాలీకార్బ్, నేట్రమ్యూరుకూడ

యిట్లే అనుకూలించును గాని అంతకంటె తక్కువసంబంధముగలదు.

---

## కేక్టస్ :—(Cactus)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| హృదయము (కండరములు) | పరుండిన { ఎడమప్రక్క / ముచ్చిలి గుంటపై |
| రక్తప్రసారము. | నిర్ణీతకాలములో, ప్రయాస, |
| తల ; కుడివైపు. | పగలు 10.11 A. M. లేక |
| రొమ్ము. | 11 P. M. రాత్రి. |
| గుండ్రని కండరములు. | ఉపశమనములు. |
| | బహిరంగగాలిలో. |
| | నడినెత్తిపై నొక్కుటవలన |

1 హృదయము (heart) కొట్టుకొనకుండ యినుపబద్దీలచే బిగించి నొక్కబడుచున్నట్లు భావన. గుండెలు బిగపట్టుట.

2 చనిపోవుదునని భయము. తనవ్యాధి నివారణకాదని విశ్వసించుట (ఆర్సె)

3 శరీరమంతయు ఇనపతీగలుచుట్టి బిగించి నులిపెట్టుచున్నట్లు శరీరము యినుపతీగెల బోనులో బిగించియుంచినట్లు శరీరమంతటను యిట్టి భావన కలిగియుండును.

---

## కల్ కేరియాకార్బానికా :— (శోరాదోషహరణకరము)

**(Calcarea carb)**

స్థానములు.

పోషణ { మాంసగ్రంథులు. ఎముకలు. చర్మము.

రక్తము.

రొమ్ము. కుడిపూపిరితిత్తి.

హృదయము.

పిల్లలు.

ఉద్రేకములు.

శీతలము { పొడిగాలి: తడిగాలి స్నానము. చలువచేసెడు. గాలిమార్పు.

వ్యాయామము { మానసికమైన శారీరకమైన పైకిఎక్కుటచేకలుగు కంటికి ఎక్కువశ్రమచేయు

పండ్లు వచ్చుటచే, యౌవనదశలో

బట్టలయొక్క బిగువు.

పాలు. నిద్రమేల్కొల్పుటచే ఆతృతచే.

1 శోరాతత్వముల కుపయోగించును. పాలిపోవుట ; నీరసము ; అధైర్యము ; నడచిన అతిశులభముగ అలసిపోవుట. శరీరమునకు ముఖ్యముగ తలకు విస్తారముగ చెమటపట్టుట.

2 పిల్లలయొక్కయు, యువకులయొక్కయు శరీరము స్థూలముగ పెరిగిపోవుట. ఊబకాయము. శరీరము విపరీతముగ పెరిగిపోవుట.

3 పెద్దతల : తల ఎముకలు సరిగా అతుకుకొనకుండుట.

4 తలదురద : పిల్లలు నిద్రనుండి మేల్కాంచినప్పుడు తల బరుకుట.

5 పళ్లువచ్చు పిల్లలకు పాలు భర్జింపకుండుట ; పాలు త్రాగినవెంటనే పెరుగుబిళ్లలవలె కక్కుట ; లేక యీవిధముగనే విరేచనములు వెళ్లుట.

6 పిల్లలకు సకాలములో పళ్లురాకుండుట.

7 పిల్లలకు ముఖ్యముగా పళ్లువచ్చు కాలములో నోరు పుల్లనివాసనతో నుండుట; పుల్లటివమనములు వెడలుట; పుల్లనివాసనతో విరేచనములు వెడలుట; శరీరమంతియు పుల్లని వాసనవేయుట (హెఫార్, రూమ్)

8 పిల్లల కడుపుపెరిగి బూర్లుమూకుడు బోర్లించినట్లుండుట.

9 సకాలమునకు చాలముందే బహిష్టగుట: విస్తారమైన స్రావము వెడలుట.

10 నీటిలో పనిచేయుటవలన కలుగు దీర్ఘమేహ వాత కీళ్లనొప్పులు. (chronic rheumatism) యితరబాధలు.

11 పాదములు (feet) తడిమేజోళ్లు తొడుగుకొనియున్నట్లు చల్లగాను తేమగాను యుండుట; విడిభాగములు (Single parts) తల, కడుపు, జీర్ణకోశము, కాళ్లు మొదలగునవి చల్లగానుండుట.

12 చలిగాలికి సులభముగ వ్యాధిగ్రస్తమగుట; చలిగాలి సహ్యాము గాకుండుట: (సల్ఫరుకు వ్యతిరేకము): గదిలో నున్నప్పుడు మంచిగాలికొరకు వాంఛించుట (సంఫరు, పల్సు).

13 సంయోగానంతరము అనేకదినములవరకు నీరసముగను, సుస్తీగాను యుండుట.

14 అతిస్వల్పమైన మానసోద్రేకమువలన విస్తారమైన రుతుస్రావము కలుగుట (సల్ఫరు)

15 నిద్రపోవుసప్పుడు తలకు విస్తారముగ చమటపట్టుట. తలగడ చాలవరకు చమటతో తడిసిపోవుట (సిలికా). తల వెనుకభాగమున, గుండెలుమీద, శరీరముయొక్క పైభాగమున విస్తారముగ నీళ్లు కారుచున్నట్లు చెమటపట్టుట (సిలికా)

16 తినిన ఆహారము సరిగా జీర్ణముకాకపోవుటమూలమున వచ్చు వ్యాధులు.

17 పిల్లలు సకాలములో నడువలేకపోవుట ; నడచుటకు శక్తిలేకపోవుట ; నడుచుటకు ప్రయత్నించకపోవుట.

18 చెమటచే అరికాళ్లు వరిసి పుండుపడుట (గ్రాఫైటిస్). కాళ్లకు దుర్వాసనతోకూడిన చెమటపట్టుట ; పొక్కులెక్కుట.

19 మలబద్ధము : యంత్ర సహాయ్యమున మలమును బైటకు తీయవలసియుండుట (ఎలూమ్స్, సెలీనియమ్, సిపియా, సిలికా)

N. B.—కల్ కేరియాకార్బ్ ఉపయోగించిన పిమ్మట సల్ఫరు ఉపయోగించరాదు అట్లు ఉపయోగించిన అనవసరమైన చిక్కుపరిస్థితులు కలుగజేయును. సల్ఫరు ఉపయోగించిన పిమ్మట కొన్ని సందర్భములయందు కల్ కేరియాకార్బ్ ఉపయోగించవచ్చును.

పిల్లలకు మోతాదులు తరుచు ప్రయోగింపవచ్చును. వృద్ధులకు మోతాదులు తరుచు తిరిగి ప్రయోగింపరాదు.

---

## కల్ కేరియాఫాస్ :— (శోషదోషహరణకరము) (సూడోసోరిక్.)

**(Calcarea phos)**

| స్థానములు. | | | ఉద్రేకములు. | |
|---|---|---|---|---|
| పోషణము | ఎముకలు. మాంసగ్రంధులు నరములు | పుర్రెలతుకు ఎముకపైభాగము. ఉపాస్థి | బహిర్గతమగుటకు | గాలిమార్పునకు గాలికెరటములకు చలికి. తేమకు కరిగెడు మంచుకు తూర్పుగాలికి. |

ఉదరము.
నడినెత్తి.
రొమ్ము.

పండ్లు వచ్చుట
మానసిక వ్యాయామము
ద్రవపదార్థములు పోవుటచే
యౌవనదశ. పండ్లు. సీమరేగిపండ్ల సారాయి

ఉపశమనములు.

పరుండిన.

1 శిశువుల తలయెముకలయొక్క గ్రంథులు ఆలశ్యముగా అతుకు కొనుట.

2 పిల్లలకు పండ్లు ఊడిపోయినపిమ్మట తిరిగి పళ్ళు వచ్చుట ఆలస్యమగుట.

3 తినుటకు ప్రయత్నించినపుడెల్లను ప్రేగులలో (intestines) నొప్పి వచ్చుట.

4 పిల్లలకు బలవర్ధకౌషధము ; రజస్వలగువయస్సులో ముఖ్యముగా స్త్రీలకు బాగుగా అనుకూలించును.

5 భోజనము చేసినపిమ్మట ఒకటి రెండుగంటలకు కడుపులోమంట యితర అజీర్ణలక్షణములు.

---

## కేంఫరు :—(Camphor)

స్థానములు.

జీర్ణావయవమార్గము.
మెదడుయొక్క నరములు.

ఉద్రేకములు.

చలి. అరనిద్ర అయినపుడు.
(మేగ్-ఫా, ఆసిడ్-నైట్రి)

మూత్రావయవములు.

ముక్కు

మానసికవ్యాయామము. దెబ్బ

అణచిపెట్టుట

పరధ్యాహ్నము.

**ఉపశమనములు.**

నిరోధములేని స్రావములు.

చెమటచే ఆలోచించుటచే.

1 కలరా, కలరావంటి పరిస్థితులలోను బాగుగా పనిచేయును.

2 శరీరము మంచువలె చల్లబడిపోయి మృత్యుముఖమున నుండుట; నాలుక చల్లబడి వణకుట; నాడి నీరశించుట; నాడి కనుపడికను పడనట్లుండుట.

3 శరీరము ముట్టుకున్న అతిచల్లగానుండుట : గాని బట్టకప్పిన సహించ లేకపోవుట. శరీరముపై గల బట్టను త్రోసివేయుట (సికేల్, మెడో రినమ్) కాళ్ళు పెనివేసుకొనిపోవుచున్నట్లు లాగుట. కడుపులో బిగపట్టుచున్నట్లు బాధ.

4 ఆకస్మికముగ సంభవించు విరేచనములు : వాంతులు : ముక్కుచల్ల బడి నిడివిగాయుండుట. ఆతురత : అస్థిమితము : శ్వాసశరీరము చల్లగానుండుట (విరాట్రమ్ఆల్బమ్)

5 ఆకస్మిక ప్రమాదములవలనగలుగు విపరీతపరిస్థితులకు (shocks) మంచిమందు.

6 పొంగుజూపినపిమ్మట గలుగు సమస్తఅనంతర లక్షణములకు మంచి మందు.

N. B:—మూలికాసంబంధమైన ప్రతిఔషధమునకు కేంఫరు విరుగుడు. రోగులగదిలో హారతికర్పూర ముండరాదు. ఔషధము సేవించురోగులు దీనిని వాసనచూడరాదు.

## కెనబిస్ సతీవా :—(Cannabis Sativa)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| మనోవికారములు. మనస్సు. నరములు. | మూత్రము విసర్జనచేయుచున్నప్పుడు. |
| మర్మావయవ మూత్రావయవ మార్గములు. | చీకటిలో |
| | ప్రయాసచే : మాట్లాడుటవలన |
| | నడుచుటవలన |
| | సెగవ్యాధి. |

1 శగకు ముఖ్యముగా ప్రథమావస్థలో సిద్ధౌషధము (specific)

2 శెగ రెండవ అవస్థలో మూత్రము వెడలినపిమ్మట మర్మావయవమున మంట, చురుకు, పోటు, కొంచముగా మూత్రము వెడలుట, చీమువంటి చిక్కటి పసుపురంగు స్రావము వెడలుట. (కొ పెబా)

3 మూత్రాంగము ముట్టుకున్న మిక్కిలి నొప్పిగానుండుట ; కాళ్లు దగ్గరగానుంచి నడువలేకపోవుట ; అట్లు నడచిన అంగమునకు అదురు తగిలి బాధకలుగుట.

4 మర్మావయవ అగ్రమునుండి వెనుకకుపోయి ; మంట ; వాపుట మూత్రమువెడలునపుడు బాధ లెక్కువగుట.

5 కఠినమైన మలబద్ధము. (obstinate constipation) ఇందుమూలమున మూత్రము బంధింపబడుట. ఆసనము బిగపట్టుట.

---

## కేంథారిస్ :—(Cantharis) (సైకోసిస్ దోషహారణకరము)

| స్థానములు. | | ఉద్రేకములు. |
|---|---|---|
| ఆమత్వచలములు (ఆమసంబంధమైన రక్తకణ సంబంధమైన) | మూత్రావయవములు. మూత్రకోశము. కంఠనాళము. బుద్ధిఊపిరితిత్తులపైపొర. అడుగుప్రేగులు. | మూత్రవిసర్జన చేయుచున్నపుడు. పానముచేయుట ; చలి. ప్రకాశమానమైన వస్తువులు. నీటిధ్వని. తాకిన ; కంఠనాళములోని స్వరపేటికయనబడు నాళము. |
| చర్మము. | | **ఉపశమనములు.** |
| కుడివైపు. | | వెచ్చదనముచే విశ్రాంతివలన. |

1 ఇది గనేరియా (సెగ) ద్వితీయావస్థలో బాగా ఉపయోగించును. నిరంతరము మూత్రానుమానము : మూత్రము విసర్జించుటకు వెడలిన, రక్తముతో కలసినకొలది చుక్కలుమాత్రము వెడలుట.

2 తరచు మూత్రానుమానముతో (urging) మూత్రము వెడలుటకు ముందు, మూత్రము వెడలునపుడు, వెడలిన పిమ్మట, మూత్రకోశమున (Bladder) విపరీతమైన బాధ ; మూత్రము చుక్కలు చుక్కలుగాపడుట ; విపరీతమైన తీపు (Tenesmus) మంట.

3 మూత్రము వెడలుటకుముందు, వెడలునపుడు, వెడలినపిమ్మట మూత్రవాహికయందు (అంగము urethra) విపరీతమైన మంట : కోయుచున్నట్లు బాధ.

4 రక్తముతో కలసియున్నట్లు మూత్రము రక్తవర్ణముగాయుండుట.

5 నిరంతరము విడువకుండ, పురుషాంగమునకు బాధతోకూడిన లేప నము కలుగుట (painfull erections).

6 స్త్రీ మర్మావయవమున విపరీతమైన దురద; విస్తారమైన సంభోగ వాంఛ.

7 మూత్రము విసర్జించునపుడు చట్టలలోను, మూత్రకోశముల యందు (kidneys) కడుపులోను (abdomen) విపరీతమైన బాధ కలిగి మూల్గకుండగను, ఏడ్చునంతటిబాధ కలుగకుండగను, ఒక్క బొట్టైనను పడకుండుట.

8 శరీరమున వాపుతోకూడిన పొక్కులు బయలుదేరి యుండుట.

9 తల పక్కులు కట్టుట; విస్తారమయిన చుండ్రు.

10 నోటియందు, కంఠములోను, కడుపులోను, ప్రేగులయందు (Intestinal tract) విపరీతమయిన మంటతోకూడిన బాధ.

11 చీము రక్తముతోకూడిన జిగటవిరేచనములు; కోశములు గోకి వేయుచున్నట్లు బాధ; ఆసనము మంట.

12 రక్తవర్ణమయిన స్వప్నస్ఖలనము (లెడమ్, పెట్రోలియమ్, మెర్క్యూరీ)

13 స్త్రీపురుషులయందు సంభోగవాంఛ హెచ్చుట; ఈ సంభోగవాంఛ వలన నిద్ర నిరోధింపబడుట.

14 శ్వాసమార్గమున బంకవంటిశ్లేష్మము (బొవిస్టా, కాలీబైక్రామికమ్)

N. B:—చర్మము కాలిన ప్రదేశమునందు యీ మందును (external) నీళ్లలో కలిపి అందు గుడ్డతడిపి కాలినభాగమున వేసిన పక్షమున వెంటనే మంటబాధ తగ్గించి పొక్కకుండ

జేయును. హోపెన్‌సీలోగల యీ మందును లోపలకు ప్రయోగించిన వెంటనే బాధను తగ్గించును.

---

కేప్సికమ్ :—(Capsicum) (సైకోసిస్ దోషహరణకరము.)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| ఆమత్వచలము. | అల్పమయిన గాలివిసురు. |
| గొంతుక. | చల్లని { గాలి, నీరు |
| మూత్రపిండములు. | కప్పుకొనకుండుటచే. తేమ |
| ఎముకలు. | స్నానము |
| | ఊరకే గుటకవేయుట |
| | త్రాగుటచే |
| | తినుట. త్రాగుబోతులు. |
| | **ఉపశమనములు.** |
| | ఎల్లప్పుడు కదలుచుండిన. |

1 మ్రింగునప్పుడు కంఠమున మంటతోకూడిన బాధహెచ్చగుట. కంఠములోమంట ; చురుకు : వేడివలన ఉపశమించుట.

2 దాహముతో నడుములోచలి ప్రారంభించుట. నీళ్లు త్రాగినపిమ్మట హెచ్చుట.

3 నీళ్ళుత్రాగినపిమ్మట బాధలు చాలవరకు వృద్ధిజెందుట.

4 విరేచనమైన ప్రతిపర్యాయము దాహమగుట, పానీయముత్రాగిన వెంటనే వణకువచ్చుట.

5 దగ్గు ఊపిరితిత్తులనుండి దుర్వాసనతో కూడిన శ్వాసను వెలువరించుట

6 దగ్గునప్పుడు, దూరప్రదేశములయందు అనగా మూత్రకోశము నందు, మోకాళ్లయందు చెవులలోను కాళ్ళలోను బాధ.

---

## కార్బోఎనిమలిస్ :— (శోరా దోషహరణకరము.)

### (Carbo Animalis)

**స్థానములు.**

జీర్ణము.
మాంసగ్రంథులు.
సిరలు.

**ఉద్రేకములు.**

క్రొలదికారణములు { క్రొలదిరక్తము పోయిన : బెణుకులు. ఎత్తిన. చల్లనివి తీసుకొనిన.

తినుచున్నపుడు.
చల్లటి పొడిగాలి.
క్షురకర్మచే.
వృద్ధాప్యమున. బహిష్టు అయిన తర్వాత.

**ఉపశమనములు.**

భాగముపై చేయివైచుట.

1 చాలకాలముక్రిందట తినినఆహారముయొక్క రుచితోకూడిన త్రేణుపులు.

2 పళ్ళు జరిలేక కదలుచుండుట ; నమలుచున్నప్పుడు నొప్పిగానుండుట.

3 రాత్రిభాగమున దుర్వాసనతోకూడిన, నీరసముకలుగజేయు చమటలు. ఈ చమటచే పరున్నపక్క పసుపురంగుమరకలగుట.

4 మెడమీాద, చంకలలోను, చట్టలలోను, స్తనములలోను గల కండరములు (glands) వాచి గట్టిపడి బాధకరముగ నుండుట ; చురుకు, పోటు మంటతోకూడినబాధ.

---

కార్బొవెజిటబిలిస్ :... (శోరాదోషహరణకరము)

**(Carbo vegetabilis)**

స్థానములు.

ఆమత్వచలములు { జీర్ణావయవమార్గము, కడుపు.

హృదయము { సిరసంబంధమైన. రక్తప్రసారము. రక్తము.

ముచ్చిలిగుంట.

ఉద్రేకములు.

వెచ్చదనముచే. రక్తముపోవుటచే.

చలువచేయుట.

బలహీనముజేయు రోగములు.

వృద్ధాప్యములో.

విలువైన భోజనములు.

దుర్నడతచే.

పైకెత్తుటచే.

బట్టలయొక్క ఒత్తిడి.

వాయుస్థితి { ఎక్కువగాలి. వాతావరణమార్పు. చల్లనిరాత్రిగాలి. అతిశీతలమైన గాలి. తడిగానున్నగాలి.

గాలి. తలమీాద గాలివీచిన.

అణుపెట్టుటచే.

ఉపశమనములు.

త్రేణుపులవలన. చల్లగాలిచే.

1 వ్యాధియొక్క అంత్యదశయందు రోగికి విస్తారమైన చల్లని చెమటలుపోయుట ; శరీరము చల్లబడిపోవుట ; శ్వాస చల్లబడిపోవుట ; నాలుక చల్లబడిపోవుట ; మాటపోవుట ; కాళ్ళు ముఖ్యముగ మోకాళ్ళ దిగువభాగమున, చేతులు చల్లబడుట : నాడి ధారము వలె మిణుకుమిణుకుమని యుండుట : చనిపోయినట్లు పడియుండుట. యీ పరిస్థితులయందీ ఔషధమును హెచ్చుపొటన్సీలో ప్రయోగించిన ప్రాణముకాపాడును.

2 రోగి నిరంతరము విసరమని కోరుచుండును. మంచిగాలి కావలసియుండును శరీరమునల్లబడి కాళ్ళుచేతులు చల్లబడిపోవుట. చల్లటిచెమటపట్టుట, ప్రాణశక్తి చాలవరకు నశించిపోవుట.

3 వ్యాధిగ్రస్థమై నీరశించిన వ్యక్తియొక్క శరీరద్వారములనుండి (ముక్కు, నోరు, ఆసనము) రక్తస్రావము : (చైనా, ఫాస్ఫరస్) నీరశించిన కండరములనుండి (tissues) రక్తము స్రవించుట : జీవశక్తి నశించుట ; నిస్ప్రాణజెందుట : రక్తస్రావముల అనంతరము శరీరము చల్లబడి చల్లనిచెమటపట్టుట : ముఖము వికారముగ మారిపోవుట ; మృత్యుముఖమున కాసన్నమగుట.

4 తల ముట్టుకున్న నొప్పిగానుండుట : టోపీధరించిన ముఖ్యముగా తలనొప్పిగానుండుట ; టోపీతీసివేసినను తలకు గుడ్డకట్టినట్లు భావన కలిగియుండుట.

5 పళ్ళు వదులుగానుండి యిగుళ్లనుండి సులభముగ రక్తము స్రవించుట : నమలునపుడు యిగుళ్ళు మిక్కిలి బాధకరముగ నుండుట.

6 కడుపుబ్బరింపజేయు, మాంసము, క్రొవ్వుపదార్థములు, పాలు వీనియందలి విముఖత.

7 అతిమందమైన జీర్ణశక్తి : సౌమ్యమైన ఆహారముకూడ భర్జింపకుండుట : కడుపులోను ప్రేగులయందు (abdomenal intestines) విస్తారముగ గాలిజేరి కడుపుపగిలిపోవునట్లుగ ఉబ్బరించుట : ఏమాత్రము ఆహారము తీసికున్నను పరున్నను యీబాధ లధికమగుట. త్రేణుపులు, అపానవాయువు (flatus) వెడలుటవలన తాత్కాలికోపశమనము గలుగుట.

8 నిరంతరము, నట్టిత్రేణుపులుగాని (empty eructations) పుల్లటి త్రేణుపులుగాని దుర్వాసనతోకూడిన త్రేణుపులుగాని వచ్చుచుండుట.

9 కంఠము బొంగురుపోయి కంఠము పచ్చిగానుండు లక్షణములు సాయంత్ర మధికమగుట ; కంఠమునుండి మాట రాకపోవుట (aphonia) : ఉదయమున హెచ్చుగానుండుట.

10 చలి, జ్వరము : క్వినామూలమున వ్యాధిని అణచిపెట్టుట మూలమున సంభవించుబాధలను, పాదరసమును (Mercury) దుర్విని యోగపరచుటవలన సంభవించుబాధలను, లవణము, మాంసములు కుళ్ళినచేపలు, కుళ్ళినమాంసము, దుర్వాసనతోకూడిన క్రొవ్వుపదార్థములు తినుటవలన కలుగుబాధలను నివృత్తిజేయును.

11 కడుపు బరువుగా వ్రేలాడుచున్నట్లు భావన : వంగి నడువవలెను.

12 విపరీతమైన దుర్వాసనతో తరచు అప్రయత్నముగా వెడలు విరేచనములు ; విరేచనములయనంతరము ఆసనమున మంట ; మెత్తటి మలముకూడ కష్టతరముగ వెడలుట (అల్యూమినా)

11 గుండెలలో కొరకంచులు వెలుగుచున్నట్లు మంట ; గుండెలు నొప్పిగాను పచ్చిగాను యుండుట.

14 తలత్రిప్పు ; యీత్రిప్పుచే నేదియోయొకటి రోగిపట్టుకొనీ యుండవలెను.

15 ప్రాణపోషక ద్రవములు (vital fluids) పోవుటవలన కలుగు దుర్గుణములు (కాస్టి)

16 ఉదయమున నగుపడు కుసుమ, ఈ కుసుమ పాలవలెయుండి, ఆమ్లయుతమై (Acid) స్రవించుభాగములయందు వరుపు కలుగజేయుచుండును.

N. B:—వ్యాధి లక్షణములకు మిక్కిలి సారూప్యమగు ఔషధములను నిర్ణయముగావించి ప్రయోగించినపు డెట్టిసుగుణము యగుపడక ఔషధశక్తికి వ్యాధి వశ్యముగానపు డీ ఔషధము గుణము కలుగజేసి పనిజేయును. (ఓపీయమ్)

---

కాలోఫిలమ్ :—(Caulophyllum)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| స్త్రీ అవయవములు. | గర్భిణీలో. |
| నరములు. | బహిష్టు అణిపెట్టుటచే. |
| మాంసకండరములు. మెడ. | బహిరంగగాలిలో. P. M. |
| దిగువ అవయవములు. | |
| చిన్నకీళ్ళు. | |

1 ఋతుశూలయందు (Dysmenorrhoea) గర్భాశయమున కడుపులో దిగువభాగమున విడిచి విడిచివచ్చు పోటు. పోట్లు అన్నివైపులకు విస్తరించుట.

2 విడిచి విడిచి మందముగావచ్చు ప్రసవనొప్పులు; నొప్పులు వృద్ధిగాకుండుట; అలసిపోవుట. దొంగనొప్పులు: (false pains) ఈ ఔషధము నొప్పులను వృద్ధిజేసి వెంటనే ప్రసవముగావించును

3 గర్భకోశమున బలములేక గర్భస్రావము కలిగినపిమ్మటను, ప్రసవమయిన పిమ్మటను ; విస్తారమయిన రక్తస్రావము కలుగుట ; ప్రసవమయిన పిమ్మట వెడలుమైల దీర్ఘకాలము వెడలుచుండుట.

4 చిన్నకీళ్లకు ముఖ్యముగా మణికట్టు, వేళ్లగ్రంథులకు గలుగు మేహవాతము (Rheumatism)

5 ప్రసవానంతర నొప్పులు ; ఈ నొప్పులు విడిచి విడిచి కడుపున కడ్డముగా కడుపు దిగువభాగమున వచ్చుచుండుట : యీనొప్పులు చట్టలలోనికి విస్తరించుట.

6 గర్భకోశముయొక్క బలహీనతచే గర్భస్రావము కలుగుచుండుట (పల్సు, సెబీనా)

N. B :— ప్రసవనొప్పులలో పల్సటిల్లాకు పోలియుండునుగాని మానసిక పరిస్థితివ్యతిరేకముగ నుండును.

---

కాస్టికమ్ :—**(Causticum)** { (సోరా దోషహరణకరము) (సైకోసిస్ దోషహరణకరము) (సిఫిలిస్ దోషహరణకరము.) }

| స్థానములు. | | ఉద్రేకములు. |
|---|---|---|
| నరములు | చలనహేతువుగల ; స్పర్శజ్ఞానముగల : | గాలి { చల్లనిపొడి : విసురు గాలులు. గాలి. |
| మాంసకండరములు | మూత్రకోశము. కంఠములోని స్వరపేటిక యనబడు నాళము. అవయవములు. | వాతావరణస్థితి ఎక్కువగానున్న. ముందుకువంగిన. అణిపెట్టుటచే కాఫీ. 3_4 A. M. లేక సాయింత్రము. వ్యాయామము. |

శ్వాసము.
చర్మము.
కుడివైపు ; ముఖము.

ఉపశమనములు.

చల్లనిపానీయము.
కదుగుచుండిన
వెచ్చగానున్న ; ప్రక్కవేడిచే
మెల్లగాకదలిన.

1 కండ్లుమూసుకొనవలెనని యుండుట ; రెప్పలు బరువుగానుండుట ; పై రెప్పలకు పక్షవాతమువచ్చుట ; రెప్పలు వాలిపోవుట ; పై కెత్తలేకపోవుట ; (జెల్సి, గ్రేఫైటిస్—రెండురెప్పలకు సిపియా)

2 ముఖమున కొకవైపు పక్షవాతమువచ్చుట ; ప్రత్యేకభాగములకు అనగా గాత్రము (Vocal organs) నాలుక, కనురెప్పలు ; ముఖము, కాళ్లు, చేతులు మూత్రకోశము వీనికి సర్వసాధారణముగా కుడివైపు అవయవములకు చలిగాలివలన, సన్నిపాతజ్వరములకు పిమ్మట పక్షవాతము వచ్చుట.

3 రాత్రి నిద్రలో అప్రయత్నముగ మూత్రమువిడచుట. తుమ్మునపుడు, దగ్గునపుడు, చదువునపుడు అప్రయత్నముగ మూత్రము వెడలుట (పల్స, స్కివిల్లా, విరాట్రమ్)

4 గొంతుకలో దురదగానుండి ఉదయమున సాయంత్రమున బొంగురుపోవుట.

5 దగ్గు : ఈ దగ్గువలన గుండెలు నొప్పిగాను పచ్చిగాను నుండుట.

6 దగ్గినపుడు చట్టలో పోటువచ్చి అప్రయత్నముగ మూత్రము వెడలుట.

7 కంఠనాళములు స్వాధీనముగాక మాట గట్టిగా మాట్లాడలేకపోవుట.

8 దీర్ఘకాలముగల దుఃఖము, విచారమువలన కలుగు వ్యాధులు (ఫాస్ఫారిక్ యాసిడ్) : నిద్ర లేకపోవుటవలన, జాగరము చేయు

చుండుటవలన కలుగు బాధలు (కాక్యు, ఇగ్షి). అకస్మాత్తుగా కలుగు మానసోద్రేకము, భయము, సంతోషము వలనకలుగు వ్యాధులు (కాఫీ, జెల్సి) కోపము విసుపుదల వలనను, పాకృలు అణచిపెట్టుటవలనను కలుగువ్యాధులు.

9 మలబద్ధము : తరుచు విరేచనానుమానము ; విరేచనము కాకుండుట (నక్సువా). నిలుచున్న స్థితిలోనే విరేచనము సులభముగ వెడలుట.

10 పిల్లలు సరిగా నడువలేకపోవుట ; నడచుచుపడిపోవుట (కల్కేరియా ఫాస్).

11 శక్తి తగ్గికృశించిపోవుట ; నీరసము వణకు.

N. B.—ఈ ఔషధమునకు ముందుగాని వెనుకగాని పాస్పరస్ ఉపయోగించరాదు.

---

## సిడ్రన్ :—(Cedron)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| నరములు. | నిర్ణీతకాలములలో ; ఒకేగంటలో ; |
| రక్తము. | నిద్ర తర్వాత. |

1 విడుపువ్యాధులు (Intermittents) : తేమవలనను, చవిటిభూములయందును, మన్యపుప్రాంతములయందును, అధిక ఉష్ణప్రదేశములయందును జనించి గంటలప్రకారము వ్యత్యాసములేక ఒకేకాలమునకు అగుపడుచు తిరిగి తిరిగివచ్చుచు వట్టివిడువక బాధించు జబ్బులు.

---

కెమొమిల్లా :—(Chamomilla) (శోరాదోషహరణకరము.)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| మనస్సు. | కోపముచే. రాత్రి. |
| నరములు. | దంతములువచ్చు కాలములో. |
| మనోవికారములు. | చల్లని { గాలి తేమ. |
| ఆమత్వచలము { జీర్ణావయవ మార్గము. | గాలిచే. చల్లనివి తీసుకొనుటచే. |
| కాలేయము. | కాఫీవలన |
| స్త్రీలకు పిల్లలకు. | మైకముకలిగించెడి పదార్థములు. |
| ఎడమ ప్రక్క. | నల్లమందు. |
| | **ఉపశమనములు.** |
| | యెత్తుకొని త్రిప్పుచుండుటచే. |
| | శాంతమైన వాయువులవలన. |
| | వేడివలన. చెమటపట్టుటవలన. |
| | చల్లని పూతలచే |

1 పిల్లలు ఎత్తుకొని త్రిప్పనలసినదిగా ఏడ్చుచుందురు. అట్లు ఎత్తుకొని తిరుగుటవలన కొంత స్వస్తతగానుండును.

2 పిల్లలు పెంకితనముతో ఏడ్చుట ; ఈ వస్తువు ఆ వస్తువు అని అనేక విధములైన వస్తువులు కావలెనని ఏడ్చుట. వానిని యిచ్చినప్పుడక్కరలేదని త్రోసివేయుట.

3 కడుపులో నొప్పితోకూడిన, ఆకుపచ్చని నీళ్లవిరేచనములు ; విరేచనమయిన బట్ట మరకయగుట. ఈ విరేచనములతో దాహము, నోరు చేదు ; చేదుత్రేణుపులు : విరేచనములు వేడిగాను, మిక్కిలి దుర్వాసనతోను నుండుట.

4 ఒకచెంప వేడిగాను ఎర్రగానుయుండుట ; రెండవచెంప పాలిపోయి చల్లగానుండుట.

5 పరుండుటవలనగాని, నిద్రపోవుటవలనగాని, చమటపట్టుటవలన గాని బాధలు తగ్గవు. గాని చమటపట్టినపిమ్మటను లేచుటవలనను తగ్గును.

6 చెమటపట్టునప్పుడు బాధలు వృద్ధిజెందుట.

7 అరికాళ్ళుమంటలు ; అందుచే కాళ్లు ప్రక్కనుండి బైటపెట్టుట (పల్సు, మెడోరినమ్, సల్ఫరు)

8 పళ్ళువచ్చుకాలములో స్థానికమైన ఉద్రేకమువలన, జ్వరము, విరే చనములు, లేక కంపములు (convulsions) : అజీర్ణపదార్థములు జీర్ణకోశములోను ప్రేగులయందు ఉండుటవలనను కడుపులో నులి పురుగుండుటవలనను జ్వరము విరేచనములు లేక కంపములు కలు గుట.

9 నోటియందు వేడిపదార్థము లేమిపెట్టుకున్నను పండ్లపోటు (బిస్మత్, బ్రయో, కాఫీ)

0 మేహవాతపు నొప్పులు రాత్రి తీవ్రముగ ఉద్రేకించుట : మం చమునుండిలేచి బాధచే యిటునటు తిరుగవలసివచ్చుట. (రూస్‌టా)

1 నిద్రగానుండి నిద్రపోజాలకుండుట (బెల్, కాస్టికమ్, ఓపియమ్)

. B:—నల్లమందు వాడుటచే పిల్లలవ్యాధులు, దుస్థితిలోనికి తీసికొని వచ్చినపుడు అట్టి దుర్గుణములు పోగొట్టి స్వస్తత చేకూర్చును. రోగికి మానసిక అస్థిమితము (mental restlessness) . లేనిపక్ష మున యీమందు అనుకూలింపదు. పిల్లలకు తల్లిదండ్రులనుండి

సంక్రమించు సెగసంబంధమైన దోషములమీద (hereditary sycosis) పనిచేయును.

---

చెలిడోనియమ్ :—(Chelidonium)

**స్థానములు.**

కుడిప్రక్క { ఉదరము. ఊపిరితిత్తులు (దిగువ)

ఆమత్వచలము.

ప్రేగులు (కుడి)

ముచ్చిలిగుంట. మూత్రపిండములు.

మోకాళ్ళు.

**ఉద్రేకములు.**

కదలిన. దగ్గిన. ముట్టుకొనిన.

గాలిమార్పులచే.

ఈశాన్యపవనములు.

4 గం. తెల్లవారగట్ల మరియు 4 గం. సాయంత్రము.(ఇగ్ని)

**ఉపశమనములు.**

వెచ్చనిభోజనము. భుజించుట ; ప్రాతఃకాలభోజనమువలన.

పాలు. ఒత్తిడివలన. వేడిస్నానము.

వెనుకకువంగిన.

1 కుడిచెయ్యిరెక్క కూటి (shoulder blade) క్రిందభాగమున విడువకుండ నుండుపోటు, జీర్ణకోశములోనికి గుండెలలోనికి విస్తరించుట.

2 ముఖము పచ్చగానుండుట, ముఖము, నుదురు, ముక్కు, దవుడలు, కండ్లయందలి తెల్లగుడ్లు పసుపుపచ్చగా మారుట.

3 చర్మము పచ్చబడుట ; అరిచేతులు పచ్చబడుట (సిపియా)

4 క్షయసంబంధమైన లేక కాలేయ, (liver) సంబంధమైన జబ్బుగల వ్యక్తులకుగల పాతరణములు దుర్వాసనతో విస్తరించుచుండుట.
5 వేడిపానీయములయందు కోరిక.

N. B :—అన్నముతినిన వ్యాధిలక్షణము లుపశమించును. పాలు త్రాగిన దగ్గు ఉపశమించును. ప్లీహసంబంధమయిన వ్యాధులలో బ్రయోనియాను దుర్వినియోగపరచినపుడు కలుగు దుర్గుణములను పోగొట్టును. ఈ ఔషధము వ్యాధిని కొంత వరకు నివారణచేసినపిమ్మట ఆ వ్యాధిని పూర్తిగా నివారణ చేయుటకు ఆర్సె, లైకో, సల్ఫరు, అవసరమగును.

---

చినినమ్సల్ఫ్ :—(Chininum Sulph)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| నరములు. | సరియైన నిర్ణీతకాలక్రమముగా. |
| రక్తప్రసారము. | చలి. 10-11 ఉదయము. |
| వెన్నెముక. | తలనుండి ఎడమభాగమునకు. |
| (Dorsal spine) | ఉపశమనములు. |
| | ఆవలింతలవలన. |

1 విడుపుజ్వరములు (intermittent fevers): జ్వరలక్షణములు అనుదినము లేక దినమువిడిచి దినము, లేక అనుదినము కొంచెము ముందుగా ఒకేగంటకు అగుపించుచుండును. జ్వరముయొక్క వివిధావస్థలు జ్వరముతగ్గినస్థితి విస్పష్టముగ నుండగలవు.

---

సికూటా :—(Cicuta) (సైకోసోరిక్.)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| బుద్ధి. | గాయములు. |
| నరములు. | బుద్ధికి (నేత్ర-స) |
| చర్మము. | వణుకు, ధ్వని, తాకుట. |
| | చలి, దంతములువచ్చుకాలములో. |
| | పొక్కులను అణిచిపెట్టుటచే. |

1 కంపములు (convulsions): యీ కంపములు వచ్చినపుడు స్మృతి లేకపోవుట ; శరీరము వుండీలబద్దవలె వెనుకకు వంగిపోవుట, ముఖము, శరీరము, అవయవములు భయంకరముగ యగుపడుట.

2 సూతికాకంపములు (puerperal convulsions). ఒకక్షణము శ్వాస ఆగిపోయి మృతినొందినట్లు పడియుండుట. ప్రసవాంతరము యిట్టి కంపములు వచ్చుచుండుట.

3 మూర్ఛ : కడుపునుండి తీవ్రమైన ఎగుపులవలన వచ్చుచున్నట్లు కడుపుబ్బరించుట ; ముఖము ఎరుపు లేక నీలివర్ణముగ మారుట : వికటమైనమూల్గు : దవుడలు దగ్గిరపడుట : స్మృతిలేకపోవుట : కాళ్ళు తన్నుకుపోవుట ; రాత్రిభాగమున తరుచువచ్చుమూర్ఛ ; ప్రధమమున మూర్ఛ వెంటవెంటనేవచ్చి పిమ్మట కాలవ్యవధిలో వచ్చుట.

4 అజీర్ణపదార్థములు, సుద్ద, మసిబొగ్గు మొదలగు పదార్థములు తిన వలయునని కోరిక. పిల్లలు వీనిని ఆసక్తిగా తినుట (అల్యూమినా, సోరినం)

5 మెదడునకు వెన్నెముకకు బలమైనదెబ్బ తగులుటవలన కలుగు కంపములు. మాంసములోనికి ఎముకముక్కలు, కర్రమేకులు గుచ్చుకొనుటవలనకలుగు ధనుర్వాతము (tetanus): దౌడలు దగ్గిరబడి బిగిసిపోవుట. (lockjaw)

6 పొక్కులు అణచిపెట్టుటవలన కలుగు మెడకు సంబంధించినవ్యాధి. (Braindisease)

---

## సిమిసిఫ్యూగా :— (యాక్టియారేస్ మోసా)

**Cimicifuga :—**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| మనస్సు. ముచ్చిలిగుంట. నడినెత్తి<br>నరములుమాంస కండరము { బ్రహ్మాస్మస్తిష్కము. కనుగ్రుడ్లు. స్త్రీ అండాశయ గర్భాశయసంబంధమైన. హృదయము.<br>ఆడవారలకు. కీళ్ళు.<br>ఎడమప్రక్క; స్త్రీఅండాశయము.<br>రొమ్ము. మొదలగునవి. | బహిష్టు అగునపుడు; అణచిపెట్టుటచే. ప్రసవమగునపుడు. మానసోద్రేకములవల్ల. సారావలన. గాలి. చెమ్మ. చల్లని. గాలిమార్పులచే. కూర్చుండిన.<br>**ఉపశమనములు.**<br>చుట్టు వెచ్చగానున్న, బహిరంగగాలిలో, ఒత్తిడివలన, కదలుచుండుటచే. |

1 తలంతా అన్ని భాగములయందు పోటు; ముఖ్యముగా మాడపట్టున, ముచ్చిలిగుంటయందు విశేషముగాయుండుట; ఒక్కొక్కప్పుడు యీపోటు భుజములకు వెన్నెముకకు విస్తరించుట.

2 తల పై భాగముపగిలి ముక్కలు క్రిందపడిపోవునట్లు భావన.

3 ఋతుస్రావములు, అణగిపోవుటవలన తలకు విశేషముగ రక్తము ప్రవహించుట.

4 కండ్లగుడ్డులయందు విపరీతమైనపోటుతోకూడిన బాధ ; తల కదపిన యీబాధ హెచ్చగుట

5 అపస్మారలక్షణములుగల స్త్రీలలో మేహవాతసంబంధమైన కండరముల ఉద్రేకము.

6 స్త్రీకి యుక్తవయస్సు వచ్చినప్పుడు ఋతుమతిగాక సంభవించు దీర్ఘవ్యాధులు.

7 మానసోద్రేకమువలనగాని శీతలమువలనగాని ఋతువు అణచిపెట్టబడుట ; బహిష్టు ఆలస్యమగుట ; సకాలములో జరుగకుండుట ; నీరసము కలుగజేయుట. గర్భాశయభాగమున, నడుము దిగువ భాగమున, దిగలాగుచున్నట్లుండుట. కాళ్ళు బలువుగాను, దిమ్మెగానుండుట.

8 మెడ నరములయందు, నడుములోను ; మేహవాతనొప్పులు ; కండరములు బిగబట్టి ముడుచుకొనుట

9 నడుములో చట్టలనుండి క్రిందకుదిగలాగుచు, విపరీతమైనపోటుతో కూడినబాధ.

10 నాట్యముచేసినపిమ్మటను యితరవ్యాయామము మూలముననూ కండరములన్నియు (Muscles) వచ్చిగాను పోటుగాను యుండుట.

11 స్త్రీ అండాశయముల యొక్కయు, గర్భాశయవముయొక్కయు ఉద్రేకముతోకూడి అనేకభాగములయందు చురుకు చురుకుమని పోట్లు.

12 గర్భిణీలో నిద్రలేమి, వికారము దొంగనెప్పులవలె కడుపులోపోట్లు; మూడవమాసమున గర్భస్రావము (సెబీనా).

13 లక్షణములు సరిపోలినపక్షమున ప్రసవమగుటకుముందు ఆఖరి మాసములో నీఔషధమునిచ్చిన ప్రసవనొప్పులు తగ్గించును. (కాలోఫిలిమ్ ; పల్సే).

N. B:— చనిపోయిన శిశువులను ప్రసవించు స్త్రీలకు నీ ఔషధమును అనుదినము 1 + పవరులో ప్రసవించుటకుముందు రెండుమాసములిచ్చిన సజీవులగు శిశువులు నిశ్చయముగ జన్మింతురు.

---

## సీనా :—(Cina)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| నరములు { బృహన్మస్తిష్కము. (Cerebro-spinal) ఉదరము | ముట్టుకొనిన. నులిపురుగులు. |
| | చీదర. తనవైపుకుచూచిన. |
| జీర్ణావయవమార్గము. | నిద్రబోవుచున్నపుడు. |
| కండ్లు. ఆమత్వచలములు. | పౌర్ణమినాడు. |
| పిల్లలలో (ఎడమప్రక్క) | తేరిచూచుచున్న. |
| | ఆవలింతలచే. |

### ఉపశమనములు.

ఉదరముమీద పరుండిన.

కండ్లుతుడుచుటచే .

కదలికవలన .

1 ఆసనముద్వారా విరేచనముతో వెడలు నలిపురుగులను నిర్మూలము చేయును.

2 ముఖమువాలిపోవుట, నోటివద్ద తెల్లగానుండుట ; ముక్కుదురద ; వ్రేళ్ళతో ముక్కురంధ్రములను గోలుగుట ; రాత్రి పళ్ళు కొరుకుట ; విపరీతమైన ఆకలి ; ఆసనము దురద ; అస్థిమితమైన నిద్ర జ్వరము మొదలగునవి.

3 తినినవెంటనే విపరీతమైన ఆకలి ; పలువిధములైన అనేకవస్తువులు కోరుట.

4 దగ్గు ; ఉదయమున దగ్గుచే ఉక్కిరిబిక్కిరియగుట మాట్లాడిన దగ్గు వచ్చునను భయముచే పిల్లలు మాట్లాడుటకుగాని కదలుటకుగాని భయపడుట. (బ్రయో)

N. B:—నులిపురుగును నివారణచేయుటకు రోగియందుగల వ్యాధి లక్షణములకు సీనా అనుకూలమైన ఔషధముగ యగుపడి నివారణ జేయజాలనపుడు శాంటోనైన్ ఒక్కొక్కప్పుడు నివారణజేయును

---

చింకోనా (చైనా) :— (శోరాదోషహారణకరము)

**(Chinchona)**

| స్థానములు. | ఉద్రేకములు |
| --- | --- |
| రక్తము. | ప్రాణపోషకమైనవి పోవుటచే. |
| రక్తప్రసారము. | తాకుటచే. వణుకుచే. ధ్వనిచే. |
| స్రవించు రసములు { జీర్ణావయవములు నుండి కాలేయము నుండి | నిర్ణీతకాలములలో { రోజువిడిచి రోజు (అర్చ్స్, నేత్రములా) |

వృక్వకము. (ప్లీహము) జ్వరములు.

చలి ; పవనములు ; గాలి. బహిరంగగాలిలో. భోజనము చేసిన ; పండ్లవలన ; పాలవలన. మానసికవ్యాయామముచే.

ఉపశమనములు.

గట్టిగా నొక్కుటచే (లేక) బట్టలు వదులుగా కట్టిన.

1 విస్తారమైన రక్తస్రావము వెడలిన పిమ్మట విపరీతమైన తలపోటు ; తల పగిలిపోవునంతటి తలపోటు ; ముఖముకందుట ; తలపోటు కూర్చున్న పరున్న హెచ్చుగుట ; అందుచే నిలిచియుండవలెను లేదా నడచుచుండవలెను.

2 రక్తహీనమైన వ్యక్తులలో ముక్కునుండి యితర అవయవముల నుండి దీర్ఘకాలము వెడలు రక్తస్రావములు (Hemorrhages)· రక్తము కండకండలుగ స్రవించుట ఇందువలన విపరీతమైన నీరసము ; చెవులలో గింగురుశబ్దము మొదలైనవి. (ఫెర్రంఫాస్) రక్తస్రావములు వెడలు తత్వస్వభావములు.

3 ప్రాణపోషక ద్రవములు (vital fluids) పోవుటవలన, ముఖ్యముగా రక్తస్రావములు కలుగుటవలన సంభవించువ్యాధులు ; విస్తారము విరేచనములు వెడలుటవలన అధికముగ స్థన్యపానమిచ్చుట వలన, చీముపట్టుటవలన, శుక్లనష్టము, కుసుమ, చమట, ముష్టి మైథునము మూలశంఖవలన కలుగు విస్తారమైన నీరసము ; యితర బాధలు.

4 ఉబ్బు (Dropsy) వ్యాధిలోనికి మారు తరుణవ్యాధులు.

5 జీర్ణముకాని పదార్థములతో కూడిన విరేచనములు; అజీర్ణవిరేచనములు.

6 పండ్లు తినినపిమ్మట అప్రయత్నముగా విరేచనము వెడలుట.

7 కడుపు బాధకరముగ ఉబ్బరించుట; త్రేణుపులు వెడలవలయునని యుండుట; జీర్ణకోశములోను; ప్రేగులయందు విస్తారముగ గాలిచేరుట; కడుపులో గుడగుడలాడుట; జీర్ణకోశము పులియుట; కడుపు నిండుగాయుండుట; త్రేణుపులవలన ఉపశమనము లేకుండుట. త్రేణుపులవలన ఉపశమనము కలుగుట:—కార్బోవెజ్) :పండ్లుతినుటవలన యీబాధ లధికమగుట (పల్స).

8 శూల: అనుదినము సరిగా ఒకానొకగంటకువచ్చు శూల. రాత్రిభాగమున పండ్లు తినుటవలన శూల అధికమగుట. మూత్రకృచ్ఛ్రమునందు ఏర్పడు రాళ్లవలనకలుగు శూల: (Gall Stone-colic.)

9 నల్లటి పల్చని నీళ్లవంటి విరేచనములు; విపరీతమైన నిస్త్రాణ (Great prostration): విరేచనములతో బాధలులేకుండుట.

10 రాత్రిభాగమున నీరసము కలుగజేయు విస్తారమైన చెమట.

11 వ్యాధిస్థానమును ముట్టుకున్న బాధలుద్రేకించుట; గాని గట్టిగా నొక్కిన ఉపశమనముగనుండుట. (ప్లంబం)

12 యెముకలయొక్క సమస్త కీళ్ళయందు (joints) పీకునట్టి లాగునట్టి బాధలు. యెముకలయొక్క పైభాగము (periosteum) పచ్చిగాను నొప్పిగాను యుండుట

13 ఒకహస్తము మంచువలె చల్లగాను రెండవహస్తము వెచ్చగాను నుండుట. (డిజిటలిస్, ఇపికాక్, పల్స).

14 విడుపుజ్వరములు (Intermittent fevers). జ్వరలక్షణములు రెండు మూడు గంటల వ్యత్యాసములో యగుపడుట (చినినమ్ సల్ఫు): ప్రతివారమునకు లేక పక్షమునకు జ్వరలక్షణములు తిరిగి యగుపించుట. నిద్రపోవునపుడు, కప్పుకొన్నపుడు విస్తారముగా చమటలు పోయుట.

N. B :—సెలీనియమ్, డిజిటాలిస్, వాడినపిమ్మట నీ ఔషధమును వాడరాదు.

---

## క్లెమెటిస్ :—(Clematis) { (శోరాదోషహరణకరము) (సైకోసిస్ దోషహరణకరము)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| ఆమత్వ చలములు { కండ్లు, మూత్రమార్గము | సెగవలన. |
| | పక్కవేడిచే. రాత్రి. |
| మాంసగ్రంధులు { వృషణములు. వృషణముల నంటి యుండు భాగము. స్త్రీ అండాశయములు. స్తనములు. | చన్నీళ్లచే కడగిన. |
| | శుక్లపక్షములో క్రమముగా ఉద్రేకము |
| | కృష్ణపక్షములో క్రమముగా ఉపశమనము. |
| చర్మము; పుర్రె. ముచ్చిలిగుంట. | పాదరసమువలన |

**ఉపశమనములు.**

చెమటచే.

1 సెగ, సవాయి, మేహవాతసంబంధమైన రోగుల కుపయోగించును. ముఖ్యముగా చర్మముమీదను, గ్రంధుల మీదను (Glands)

మూత్రావయవములమీదను ప్రధానముగా వృషణములమీదను (Testicles) పనిచేయును. వివిధభాగములయందుగల వాపుతో కూడిన పోట్లకు ముఖ్యమైనమందు.

2 తలవెనుకభాగమున ముచ్చిలిగుంటనుండి మెడనరకు విస్తరించి దురదతోకూడి ప్రాకుచున్నట్లుండు పొక్కులు నొప్పిగాను చిమ్మగాను యుండుట; పడకవేడిమివలనను చన్నీటిస్నానమువలనను హెచ్చుట; పొక్కులు చేతులపైన ముఖమునిమీదకూడ యుండును.

3 పోగాకువలన పండ్లపోటు రాత్రిభాగమున అధికమగుట.

4 వృషణములువాచి చితుకకొట్టినట్లు బాధగానుండును. ముఖ్యముగా కుడిభాగమునందలి వృషణమువాచి బాధగానుండుట. వృషణములుండు సంచి (Scrotum) వాచుట. గనేరియా అణచిపెట్టుటవలన కలుగుబాధలు. వృషణములు బలువుగా క్రిందకు వ్రేలాడుట లేక బిగదీసికొని శుక్లవాహికయందు బాధకలిగియుండుట. ఈ లక్షణములు కుడివైపున హెచ్చుగాయుండును. వృషణమువాచి పోటు నలుపు. (orchitis).

5 తరచుగా కొంచెము మూత్రమువెడలుట; మూత్రము వెడలునప్పుడు ధార మధ్యమధ్య ఆగిపోవుట; బొట్లు బొట్లుగా వెడలుట; మూత్రవాహిక బిగబట్టినట్లుండుట.

6 గ్రంధులు (glands) వాచి వేడిగానుండుట.

---

## కాక్యులస్ :— (Cocculus)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| ఘ్రాణేంద్రియము. | ప్రయాణము { పడవమీద. కారులమీద. బండ్లమీద. |
| వెన్నెముక { ముచ్చిలిగుంట. నడుము. కండరములు. | |

స్త్రీ మర్మావయవములు.
ఒకవైపు.

కొద్దికారణములచే { నిద్రలేకుండుట. వ్యాయామము. నొప్పి. ధ్వని. మానసోద్రేకము.
ఆతృత, చలి, బహిరంగగాలి, భోజనముచేసిన, బహిష్టులో

1 ఋతుసమయమునందును, గర్భిణీసమయమునందును తీవ్రముగా బాధల ననుభవించు స్త్రీలకును సంతానములేని స్త్రీలకును, అవివాహితలగు స్త్రీలకును ఉపయోగించును.

2 గొప్ప నేరముగావించినట్లు ఆతురత. సులభముగా మానసోద్రేకము కలుగుట.

3 మిక్కిలి అభిమానమైన స్వభావము. ప్రతివిషయము తాపత్రయమును కలుగజేయును.

4 బండిలోను, కారులోను, పడవలోను, రైలులోను ప్రయాణము చేయుచున్నప్పుడు ఉయ్యాల ఊగునప్పుడు వికారములేక వాంతులు.

5 బహిష్టయినప్పుడు నిలువబడలేనంతటి, మాటలాడలేనంతటి నీరసము.

6 బహిరంగమైన గాలినిగాని, శీతగాలినిగాని వేడిగాలినిగాని సహింపలేకుండుట.

7 నిద్రలేమివలన, రాత్రి కావలికాచుటవలన విస్తారమైన ఆతురతవలన (Anxiety) సంభవించు అపస్మారము (Hysteria), తదితర నరములసంబంధమైన వ్యాధులు (Nervous diseases).

8 బహిష్టుకు బదులు కుసుమ. బహిష్టుసమధ్యకాలములో యగుపకుసుమ (అయోడియమ్; జాంతోగ్జైలమ్) మాంసముకడిగిన నీళ్లవలెనుండు కుసుమ; రక్తము, చీముకలసినట్లుండు కుసుమ: గర్భిణీ సమయములో యీ విధముగా వెడలు కుసుమ.

N. B:—విపరీతమైన మలబద్ధముతోగల పొత్తికడుపునందలి గిలకను నక్సువామికా నివారణజేయజాలనపుడీ యౌషధము నివారణ చేయగలిగెను.

---

కాఫి :—(Coffea) (శోరాదోషహరణకరము)

| స్థానములు. | ఉద్రేకములు. |
| --- | --- |
| నరములు. | ధ్వనివలన. తాకుటచే. వాసనలు. |
| రక్తప్రసారము. | గాలి (బహిరంగ, చల్లని, తుపాను పట్టిన) |
| మర్మావయవములు. | మానసిక } మనోవికారములు. మయిన } ప్రయాస. |
| స్త్రీలు. | అమితముగాతినుట. మద్యసారము. రాత్రి. |
| | **ఉపశమనములు.** |
| | పరుండిన. |

1 గొప్ప శరీరమానసిక చురుకుదనము; మనస్సంతయు ఆలోచనలతో నిండియుండుట: యిందుమూలమున నిద్రలేకపోవుట.

2 భరింపశక్యముగాని బాధలు (ఎకొనైట్, కెమొమిల్లా) బాధలు నిరాశజెందించుట: బాధతో నిటునటుదొర్లుట.

3 జ్ఞానేంద్రియములన్నియు మిక్కిలి సూక్ష్మశక్తి గలిగియుండుట : చిన్న అక్షరములుకూడ చదువకలుగుట : నెమ్మదిగా మాట్లాడిన మాటలుకూడ వినబడుట : వాసన అతిసూక్ష్మముగా తెలిసికొన గలుగుట : రుచి వెంటనే గ్రహించుట : అతిసూక్ష్మమైన స్పర్శ జ్ఞానము కలిగియుండుట: (బెల్, ఓపియమ్, కొమొమిల్లా).

4 ఒకవైపుననేయుండు పార్శ్వపుతలపోటు : తలలోనికి మేకులుకొట్టి నట్లు బాధగానుండుట (నక్సు, ఇగ్ని). బహిరంగమైనగాలిలో వృద్ధి యగుట.

5 విస్తారమైన పండ్లపోటు : మంచుగడ్డ, మంచువలె చల్లగానుండు నీళ్లుమాత్రము నీతీవ్రమైనబాధను తగ్గించును. నోటియందు పట్టిన నీనీళ్లు వేడెక్కినవెంటనే తిరిగి పోటువచ్చును. (బిస్ : బ్రయో, పల్సు, కాస్టి, సిపియా, నేట్రంసల్ఫు).

6 అధికమైన శరీరమానసోద్రేకములవలన నిద్రలేకపోవుట.

7 శరీరము వేడిగానుండి పొంగువంటి పొక్కులు బయలుదేరుట ; అధికమైన వుద్రేకము ; ఏడ్చుట.

8 ఆకస్మిక మానసోద్రేకములవలన ముఖ్యముగా ఆశ్చర్యకరమగు ఆకస్మిక ఆనందమువలనకలుగు లక్షణములు. (దుఃఖవార్తవలన కలుగు లక్షణములకు జల్సిమియమ్).

9 తొందరగా భుజించుట, తొందరగా పానీయములు త్రాగుట (బెల్, హెపార్).

N. B :—శత్రుకరములు :— కేంథారిస్, కాస్టి, కాక్యు, ఇగ్ని :

---

## కొల్చికమ్ :— (Colchicum) (సైకోసిస్ దోషహరణకరము.)

**స్థానములు.**

జీర్ణాశయము.

హృదయము.

రక్తప్రసారము. మూత్రపిండములు.

ధాతుసముదాయముల పదార్థములు { మాంస కండరములు. కీళ్లు చిన్న కీళ్లు

**ఉద్రేకములు.**

కదలుట. తాకుట. రాత్రి.

కాలివ్రేళ్లు మొద్దుబారిన. కంపమున.

వాయుస్థితి { చల్లని. చెమ్మగా. గదులలో. మారుచుండుట. శరదృతువులో.

కొద్దివ్యాయామము.

చెమట అణిపెట్టుట. చాచుట.

సూర్యాస్తమయము మొదలు సూర్యోదయము.

**ఉపశమనములు.**

ఉష్ణము : విశ్రాంతి.

కూర్చుండుట : ముడుచుకొనుట.

1 మేహవాత ఆమవాత తత్వములకు (Rheumatic and Gouty) ఉపయోగించును. కీళ్లువాచుట, పోటు, సలుపు. ఈ భాగమును ముట్టుకొన్నను నొప్పిగానుండి బాధచే కేకలువేయుట.

2 ఒకచోటునుండి ఒకచోటునకు శరీరమునందలి లోపలి అవయవములకు ముఖ్యముగా హృదయమునకు (Heart) మారి అందు విపరీతమైనపోటుతో మేహవాత లేక ఆమవాతవ్యాధులు (Rheumatism and Gout.) నాడి నూలుపోగువలె యగుపడి యగుపడని ట్లుండుట. గుండెలు విపరీతముగ బిగపట్టుట; ఆయాసము; వగర్పు.

3 ఆమవాత లేక మేహవాతరోగులలో కలుగు గ్రహణివిరేచనములు; తెల్లగా జిగురుకళ్లెలతో తెల్లగా బంకవలె విరేచనములు వెడలుట.

4 ఆమవాత లేక మేహవాత సంబంధమైనవ్యాధులతో కలసియుండు అజీర్ణవ్యాధిలక్షణములు లేక ఆమవాతవ్యాధి (Gout) అణచిపెట్టబడినపిమ్మట గలుగు ఎల్లప్పుడునుండు వికారము. ఆహారమునందయిష్టత. వంటయొక్కవాసన ఎంతమాత్రము కిట్టకుండుట: వంటవాసన విపరీతమయిన వికారము కలుగజేయుట. (ఆర్సె, సిపియా).

5 కడుపులోను జీర్ణకోశములోను మంటలేక మంచువలె చల్లగానుండుట.

6 మూత్రముకొలదిగాను ముదరరంగుగాను తక్కువగాను చుక్కలు చుక్కలుగాను వెడలుట; మూత్రముదిగువను తెల్లటిమడ్డిచేరుట; మూత్రము రక్తవర్ణముగాను లేక బూడిదరంగుగాను లేక నల్లగాను సిరావలెను యుండుట. ఇందు కృళ్లినరక్తము శ్వేతధాతువు పంచదార యుండుట.

7 కడుపుపగిలిపోవునట్లు విస్తారము గాలితో విపరీతముగాఉబ్బరించుట.

N. B:—ఉబ్బును (Dropsy) ఎపిస్, ఆర్సెనిక్ నివారణ చేయజాలనప్పుడు యీ ఔషధము తరచు నివారణజేయును.



## కోలిన్సోనియా :—(Collinsonia)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| వస్తికము { ఆసనము. మలాశయము. గర్భాశయము. ప్రేగులు. | మూలశంఖ { యున్నపుడు అణిపెట్టిన. |
| హృదయము. కంఠనాళము. | రాత్రి. |
| కాలేయము. | గర్భిణీలో. చలి. |
| | కలవరపాటు. |

1 గుండెజబ్బుతోకూడిన మూలశంఖ, మలబద్ధము.

2 గర్భకోశము దిగజారుట. ఋతుశూల: యిట్టిబాధలవలన సంభవించు మూలశంఖ.

3 గుండెజబ్బువలన జనించుఉబ్బు.

4 గుండెజబ్బు తగ్గినపిమ్మట అణిగిపోయిన ఋతువు తిరిగి అగుపించుట, లేక వెనుకటి మూలశంఖ తిరిగి అగుపించుట.

5 దీర్ఘకాలమునుండిగల రక్తము స్రవించు మూలశంఖ (Bleeding Piles). పుల్లముక్కలుగాని యిసుకగాని చిన్నచిన్న రాళ్ళుగాని ఆసనములోనున్నట్లు భావన. (ఏస్కులస్).

6 ఒకసారి విరేచనములు: ఒకసారి మలబద్ధము: మలము గట్టిగ బాధకరముగా వెడలుట. ఎక్కువగా కోశములలో గాలిజేరి మలబద్ధము.

7 ముఖ్యముగా గర్భిణీ ఆఖరుమాసములలో గలుగుమూలశంఖబాధ మూలశంఖబాధచే పరుండలేకపోవుట.

N. B.:— మూలశంఖతో సంబంధించిన గుండెజబ్బులో కల్కేరియా, డిజిటలిస్, పనిచేయనపు డీమందునుగూర్చి యోచింప నగును.

శూలపోటును కోలోసింతిస్, నక్సువామికా నివారణ చేయలేని సందర్భమున నీఔషధము నివారణజేసెను.

---

కోలోసింధిస్ :— (సైకోసోరిక్ దోషహరణకరము)
**Colocynthis:—**

| స్థానములు. | ఉద్రేకనులు. |
|---|---|
| నరములు { ఉదరసంబంధమైన. వెన్నెముక సంబంధమైన. తొడనుండి పాదమువరకుయుండు నరముయొక్క బాధ. | మనోవికారములు. విసుగుదలచే. అవమానము. కోపము. బాధలేని వైపుపరున్న. రాత్రిపరుపుమీద. గాలులు. చల్లనివి తీసుకొనుటచే. |
| జీర్ణావయవమార్గము. | ఉపశమనములు. |
| ప్రేగులు స్త్రీ అండాశయములు. | గట్టిఒత్తిడిచే. కాఫీ. వేడి. |
| మూత్రపిండములు. ఎడమప్రక్క. | విశ్రాంతి. మెల్లగా కదలిన. విరోచనమైనతర్వాత లేక ప్రేగులలోని గాలిపోయినతర్వాత. |

1 కడుపులో ముఖ్యముగా పొత్తికడుపునందు శూలపోటువంటి విపరీతమైన పోట్లు ; యీ బాధచే వంగియుండవలసియుండుట. ఇట్లుగాక ఏ స్థితిలోయున్నను బాధ హెచ్చగుట. ఇట్లుగాక • ఏ వైపుకు తిరిగినను విపరీతమయిన అస్థిమితముతో గట్టిగా మూల్గుట. ఐదు

లేక పదినిముషముల వ్యవధిలో బాధ హెచ్చుచుండుట. గట్టిగా నొక్కుటవలన బాధ ఉపశమనముగా యుండుట (వేడి కాపటము వలన ఉపశమనము మేగ్ ఫాస్). బాధతగ్గుటకు యిటునటు దొర్లుట. విరేచనము అపానవాయువు వెడలుటవలన తాత్కాలికోపశమనము గలుగుట.

2 శూలబాధ ఉపశమనముగనుండుటకు కడుపును మంచపుకోటికిగాని, డ్రాయరుకొనను గాని పట్టి నొక్కియుంచుట. అట్లు నొక్కియుంచ వలసినంత శూలపోటు. ఏ మాత్రపు ఆహారముగాని, పానీయము గాని తీసికొనినను వెంటనే తిరిగితిరిగి సంభవించు జిగటవిరేచనము వంటి విరేచనములు.

3 చిక్కటి జిగురువంటి దుర్వాసనతో కూడిన మూత్రము కొద్ది కొద్దిగా తరుచు అనుమానముతో కూడి విడుచుట.

4 స్త్రీ అండాశయమున విపరీతమయిన బాధ. అందుచే వంగియుండి అస్థిమితముతో బాధపడుట.

5 మిక్కిలి కోపస్వభావము : ఆతురత : ప్రశ్నించినంతమాత్రమున కోపించుట లేక మనస్సున కష్టపెట్టుకొనుట : ఎడమచట్టలోను, తొడలోను, మోకాటియందు, పైనుండి దిగువకు కాలంతయు పొడుచుచున్నట్లు బాధ. బాధగల భాగముననే పరుండుట.

6 శూలపోటువలన ఋతువు అణచిపెట్టబడుట.

## కోనియమ్ :—(Conium) (శోరాదోషహరణకరము)

| స్థానములు. | ఉద్రేకములు. |
| --- | --- |
| ౦రములు మాంసకండరములు. మాంస గ్రంధులు. { స్త్రీ అండాశయములు. మర్మావయవములు. శ్వాసము. | కదిలెడువస్తువులను చూచుచున్న. మద్యసారము. చేతులు ఎత్తిన. వ్యాయామముతర్వాత. గాయము. రాత్రి. చలి; తగులుట. ఇంద్రియనిగ్రహముచే. వృద్ధాప్యములో. పరున్న. తల క్రిందకు బెట్టిన. |

1 తలత్రిప్పు : ముఖ్యముగా పరున్నపుడు లేక ప్రక్కయందు యిటునటు ద్రొల్లునపుడు తలత్రిప్పు.

2 మెదడుయొక్క కుడివైపు సఖముభాగములో నేదోయొక పెద్ద వస్తువుయున్నట్లు భావన.

3 కాళ్లయందు చేతులయందు మిక్కిలి నిస్సత్తువగానుండి దిమ్మతో కూడి కండ్లయందు సీరసము : కండ్లు మిరుమిట్లు గొలుపుట : కల్లు త్రాగిన వానివలె తూలుట.

4 కాఫీ మడ్డిరంగుతో తీవ్రమైన వమనములు.

5 కడుపులోనుండి కుడివైపుగుండెకు విస్తరించుపోట్లు.

6 మూత్రము విసర్జించునపుడు దార తటాలున ఆగిపోయి కొలది వ్యవధియైనపిమ్మట తిరిగి స్రవించుట.

7 లేపనములేకుండగనే సంయోగవాంఛ.

8 తృప్తికరని సంయోగవాంఛ : ఇది ప్రధానలక్షణము. స్త్రీ పురుషులలో నిందుమూలమున జనించినవ్యాధులను నివారణజేయును. లేక అధికముగా స్త్రీలోలుడగుటవలన కలుగు దుర్గుణములను లేక సంయోగవాంఛ అణచిపెట్టుటవలన కలుగు దుర్గుణములను నివారణజేయును.

9 యువకులలో ముష్టిమైథునము (Masturbation) వలన కలిగిన నీరసమును పోగొట్టును.

10 శుక్లనష్టము ; ఎంత స్వల్పమయిన ఉద్రేకముకలిగినను స్ఖలనమగుట : స్త్రీలను గాంచినవెంటనే స్ఖలనమగుట. బ్రహ్మచారులకు బాగుగ నుపయోగించును.

11 వృషణములువాచి గట్టిపడి రాయివలెనుండుట ; స్తనములువాచి గట్టిపడి రాయివలె నుండుట.

12 బహిష్టుకుముందు స్తనములువాచి నొప్పిగానుండుట.

13 అధికమయిన సంయోగవాంఛతో స్తనములు ముడుతలుపడుట ; ముడుచుకొనిపోవుట.

14 గర్భాశయము, స్తనములు, స్త్రీ అండాశయములు, చురుకుచురుకుమని పోట్లుతో వాచుట.

15 రాత్రిభాగమునగాని పగటియందుగాని పరున్నవెంటనే విడిచివిడిచివచ్చు తీవ్రమైన పొడిదగ్గు ; కంఠములో దురదగాను పాకుచున్నట్లు యుండుట.

16 వృద్ధులయొక్క నీరసమునకు, దెబ్బతగులటవలన పడిపోవుటవలనను కలుగు బాధలకు పనిచేయును.

17 బహిష్టుస్రావము స్వల్పముగా వెడలుట ; అణచిపెట్టబడుట ; లేక ఆలశ్యముగా వెడలుట ; లేక స్వల్పకాలమేయుండుట ; చన్నీళ్లలో చేతులుంచుటవలన బహిష్టు నిలచిపోవుట.

18 కుసుమ: బహిష్టు అయిన పదదినములకు యగుపించు కుసుమ. (బొరేక్సు, బొవిష్టా) కుసుమపాలవలెను, చిక్కగాను, విస్తారము గను యుండుట; లేక రక్తవర్ణముగానుండుట లేక ఒరుపుగలుగ జేయునదై యుండుట.

19 రాత్రింబవళ్లు నిద్రించినవెంటనే చమటలు; కండ్లుమూసినవెంటనే గూడ చమటలు (చైనా). తలకు విస్తారము చెమటపట్టుట. (సిలీకా)

20 బలహీనమైన బుద్ధిబలము; మానసిక పరిశ్రమనేమియు చేయజాల కుండుట.

---

## క్రోకస్ :—(Crocus) (సైకోసోరిక్)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| మనస్సు. నరములు. | కదలుటచే. |
| కండ్లు. | యౌవనములో. |
| రక్తప్రసారము. | గర్భిణీతో. |
| స్త్రీ అవయవములు. | చదువుచున్న. వేడిచే. |
| | **ఉపశమనములు.** |
| | బహిరంగమైనగాలిలో. |

1 కడుపులోను, జీర్ణకోశమునందు సజీవమైన నేదియోయొకటి గంతులు వేయుచున్నట్లు భావన.

2 స్త్రీ మర్మావయవమునుండి నల్లటిజిగురువంటి రక్తముతో కూడిన ముద్దలవలె రక్తస్రావము (Metrorrhagia).

3 ముక్కునుండి రక్తస్రావము: యీ రక్తస్రావము నల్లగాను జిగురు వలెను నుండుట. ఇట్లు స్రవించు ప్రతిచుక్క తీగవలెసాగుట.

4 ఏభాగమునుండి కలుగు రక్తస్రావములైనను నల్లగా జిగురువలె ముద్దలు ముద్దలుగానుండి స్రవించు ప్రదేశమునుండి తీగవలె వ్రేలాడును.

---

## క్రోటన్‌టిగ్ :— (సోరాదోషహరణకరము) (సైకోసిస్ దోషహరణకరము)

**(Croton Tig)**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| ఆమత్వచలములు { ప్రేగులు. కండ్లు. | త్రాగుచున్న. |
| | భోజనముచేసిన. |
| మూత్రకోశము. | కడుగుచున్న. |
| గర్భాశయము. | కదలిన. |
| చర్మము { వృషణములుండు కోశము (అండకోశము) ముఖము. | మల్లిపోవుపొక్కులు. |

1 నిరంతరము విరేచనానుమానము. ఇందుతో ఆకస్మికముగా, జిగురు వంటి, దుర్వాసనతోకూడిన, ఆకుపచ్చని రంగుగల విరేచనములు వెడలుట. ఈ విరేచనములు వేగముగా (forcebly) కొట్టివేయుట (Shot out).

---

కూప్రమెట్ :— (Cuprum Met) { (శోరా దోషహరణకరము.) (సూదోస్పోరిక్)

**స్థానములు.**

నరములు { మెదడునందలి. వెన్నెముకనందలి. వెన్నెముక పూసనందలి.

జీర్ణావయవమార్గము.

జీర్ణకోశభాగముగల కడుపు ; ఉదరము.

మాంసకండరములు.

రక్తము.

**ఉద్రేకములు.**

మానసోద్రేకములు. కోపము.

అణచిపెట్టుట.

కదలిన.

వేడిగాలిచే. షోకువలన.

నిద్రలేకపోవుటచే. తాకిన.

చెయ్యి ఎత్తిన.

**ఉపశమనములు.**

చల్లనిపానీయములవలన.

హృదయముపై నొక్కుటచే.

1 కంపములు ; కండరములు నులిబెట్టుట ; లక్షణములు కాలక్రమముగను (Periodically) సమూహముగను (Groups) నగుపడుట.

2 ముఖము నీలివర్ణముగామారి, గుప్పెళ్లు బిగబట్టియుండు లక్షణములతో కంపములు.

3 కాళ్లుచేతులును నులిపెట్టినట్లు లాగుట. అరికాళ్లలో నొప్పులు.

4 విడిచివిడిచివచ్చు కంపములు ; వేళ్లలోను, గోళ్లలోను ప్రారంభించి శరీరమంతయు కంపములు విస్తరించుట ; గర్భిణీకాలములోవచ్చు కంపములు ; సూతికాకంపములు ; భయమువల్లవచ్చు కంపములు.

5 నాలుకకు పక్షవాతము వచ్చుట ; మాట అస్పష్టముగా వచ్చుట.

6 మూర్ఛ : మోకాలులో లక్షణము ప్రారంభించి పైకి విస్తరించుట : రాత్రి సమయమున నిద్రయందు ద్రేకించుట (బ్యూఫో). అమావాశ్య కుద్రేకించుట : ఒకానొక నియమితకాల వ్యత్యాసములో ఉద్రేకించుట : దెబ్బ తగులుటవలన లేక పైనుంచి పడుటవలన కలుగు మూర్ఛ : కాళ్ళు తడిచే నానుటవలన వచ్చుమూర్ఛ :

7 మూర్ఛవంటి కంపములు (Epileptic form convulsions) వణకుట ; తూలుట ; స్మృతితప్పి పడిపోవుట : నోటినుండి నురగలు : పిమ్మట తలపోటు :

8 పొక్కులు అణచిపెట్టుటవలన, లేక పండ్లువచ్చుకాలములో సంభవించు, మెదడుకు సంభవించు వ్యాధులు (Brain-Effections) : కంపములు మొదలగునవి.

9 కోరింతదగ్గు (Whooping Cough) దీర్ఘకాలము బాధించుట : దగ్గుచే ఉక్కిరిబిక్కిరి యగుట : ఉక్కిరిబిక్కిరి యగునట్లు విడిచి విడిచివచ్చు దగ్గు : దగ్గుచేమాటలాడ లేకపోవుట : శ్వాస నిలచి పోవుట : ముఖము నీలివర్ణమగుట : శరీరము బిగబట్టి కర్రవలె యగుట : ఫిట్లు వరుసను మూడుపర్యాయములువచ్చుట (స్టానమ్) : స్మృతివచ్చినపిమ్మట గట్టి ఆహారపదార్థము వమనముచేయుట.

10 పాము నాలుకవలె నిరంతరము నాలుక ముందుకు వెనుకకు ఆడించుట (లేకసిస్).

11 నీరు త్రాగునప్పుడు గళగళ శబ్దముతో దిగుట (ఆర్సు, తూజా)

---

డిజిటలిస్ :— (శోరాదోషహారణకరము)

**Digitalis:—**

స్థానములు.

స్పర్శజ్ఞానచలన సంబంధమైన నరములు. హృదయము; మాంసకండరములు.

రక్త ప్రసారము { కాలేయము. ఊపిరితిత్తులు. కడుపు.

ముచ్చిలిగుంట.

మర్మానయన మూత్రావయన మార్గములు.

ఉద్రేకములు.

పైకిలేచిన. వ్యాయామము. వేడివలన. ఎడమప్రక్కపరున్న. కదలిన. భోజనముయొక్క వాసన. చల్లని పానీయములు. అధికసంభోగము.

ఉపశమనములు.

విశ్రాంతివలన. చల్లనిగాలిచే. నడుముపై వెల్లగిలపరుండిన.

1 శ్వాస కష్టముగను, క్రమము తప్పియు (Irregular) తరుచు వచ్చు పెద్ద నిట్టూర్పులతో (Deep sighs) వచ్చుచుండుట.

2 విపరీతమైన ఆతురతతోకూడి గుండె కొట్టుకొనుట: గుండె ఆగిపోయెనని ఆకస్మికభావన. కదలిన గుండె విపరీతముగ కొట్టుకొనుట: లేచి నడచిన గుండె ఆగిపోవునని భావన (జెల్సికి వ్యతిరేకము. జెల్సికి కదలకున్న గుండె ఆగిపోవునను భావన).

3 మిక్కిలి మందగమనముగల నాడి. నాడియొక్క ప్రతిమూడవ, అయిదవ, లేక ఏడవదెబ్బ ఆగిఆగి కొట్టుట. (Intermitting).

4 గుండెయందు విపరీతమయిన నీరసము. మాట్లాడలేకపోవుట: రోగిని లేవదీసిన, లేక నిలువుగా కూర్చుండబెట్టిన, స్మృతితప్పి మరణమాసన్నమగుట.

---

డయోస్కొరియా :—(Dioscorea)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| నరములు { ఉదరసంబంధమైన. తుంటినుండిపాదము నరకునుండు నరము సంబంధమైన. | ముడుచుకొనుట. పరుండిన. టీ వలన. భోజనము చేయుటచే. |
| బాహ్యము. కుడివైపు. | ఉపశమనములు. |
| | సాచుకొనుట. లేక వెనుకకువంగిన. కదలుటచే బహిరంగమైనగాలిలో. (మేగ్నీ-కా, పల్సు) గట్టి ఒత్తిడిచే. |

1 విడువకుండ నుండు శూలపోట్లు, బాధలు : ఈ బాధలు, శూల, ముందుకు వంగినను పరున్నను వృద్ధియగును. బాధగలభాగమును గట్టిగా నొక్కిపట్టినను నిడివిగా నిలుచున్నను, సాచుకున్నను, వెనుకకు వంగినను తగ్గును.

2 పొత్తికడుపులో బిగబట్టుచున్నట్లు బాధలు.

3 బలముగా చేతితో ప్రేగులు (intestines) నులుబెట్టి బిగదీయుచున్నట్లు తీవ్రమైన శూల సరిగా ఒకేకాలమునకు వచ్చుచుండుట.

4 నిద్రలో స్ఖలనము : మోకాళ్లు నీరసనుగా నుండుట. మర్మావయవములు చల్లగానుండుట.

5 భోజనమయినపిమ్మట కడుపులో గాలిచేరుట (flatulence) : టీ త్రాగు అలవాటుగలవారిలో ముఖ్యముగా ఏపదార్థమయినను తినినపిమ్మట కడుపులో గాలిచేరుట : తరుచు తీవ్రమయిన శూల పోటుకు లోనగుట.

6 గోరుచుట్టు ప్రారంభదశలో భరింపశక్యముగాని తీవ్రమయిన బాధలతో నున్నప్పుడు పనిచేయును: పుప్పిగోళ్లను, వానిబాధను పోగొట్టును.

---

డిఫ్థీరినమ్ :—(Diphtherinum)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| రక్తము. | పరుండిన. చలిచే. |
| గొంతుక. | పాలు. |

1 డిఫ్థీరియా యను గదవలసంబంధమయిన వ్యాధికి తిరుగులేని సిద్ధౌషధము.

2 గదవలు వాచుట: నాలుకవాచుట: ఎర్రబడుట: నోటినుండి కంఠమునుండి, ముక్కునుండివచ్చు స్రావములు, శ్వాస మిక్కిలి దుర్వాసనగా యుండుట.

3 ముక్కునుండికలుగు విపరీతమైన రక్తస్రావము: ప్రారంభమునుండియు విపరీతమైన నీరసముతో లేవలేకపోవుట; ప్రారంభముననే మరణమాసన్నమగుట.

4 ద్రవపదార్థములు మ్రింగగలిగి మ్రింగినవెంటనే నోటినుండి ముక్కులనుండి పైకివెళ్లిపోవుట. శ్వాస విపరీతమైన దుర్వాసనగా నుండుట.

N. B:—మోతాదులు తరచుగా ఉపయోగించ నవసరములేదు. అట్లు మిక్కిలి తరచుగా వాడరాదు.

# డ్రోసరా :— (Drosera)

| స్థానములు | ఉద్రేకములు. |
| --- | --- |
| శ్వాసావయవములు. | అర్ధరాత్రి తర్వాత. |
| ఎముకలు { పెద్దవి. కీళ్లు. | క్రిందపరుండిన. |
| కంఠములోని స్వరపేటికయను నాళము. | వెచ్చదనముచే. మాట్లాడిన. |
| కోమ్ము. ఊపిరితిత్తులు | చల్దిభోజనము వలన. |
| మాంసగ్రంధులు. | నవ్విన. మహారాచికము తర్వాత. |
| | **ఉపశమనములు.** |
| | ఒత్తిడి వలన. |

1 వెంటవెంటనే విడిచివిడిచివచ్చు పొడిదగ్గు. ఆ దగ్గుచే శ్వాస ఆడక పోవుట. వాంతి చేయవలయునని యుండుట.

2 గవదలలోను అంగుడియందు పొడిమారినట్లు గరుకుగాను, గోకు చున్నట్లుయుండు భావన. కంఠము బొంగురుపోయి గుండెబిగపట్టు (oppression) శ్వాసవచ్చుట కష్టతరముగానుండుట.

3 పిల్లలలో నిరంతరమునుండు దగ్గు: రాత్రి పరున్నవెంటనే దగ్గు ప్రారంభించుట. (బెల్, హాయోాన్, రూమెన్స్).

4 దగ్గు వేడిపానీయములు త్రాగుటవల్లను, నవ్వుట, పాడుట, ఏడ్చుట, పరుండుటవలనను అర్ధరాత్రిపిమ్మటను ఉద్రేకించుట.

5 దగ్గు వచ్చినప్పుడు శ్లేష్మము వాంతియగుట ; తిరమ ముక్కునుండి నోటినుండి రక్తము స్రవించుట.

N. B :—హెనివతాన్ చే వ్రాయబడిన వస్తుగుణదీపికలో ఈ ఔషధము గూర్చి యీ క్రింద విధముగా వ్రాసెను. “ సమకాలిక

(epidemic) కోరింతదగ్గును, పూర్తిగా నివారణచేయుటకు డ్రోసరా 30 ఒక్కమోతాదు చాలును. ఈ రోగికి ఒక్కమోతాదు ప్రయోగించిన పిమ్మట, నిశ్చయముగ 7 లేక 8 దినములమధ్య పూర్తిగా నివారణయగును. మొదటి మోతాదు నిచ్చినవెంటనే రెండవమోతాదు నీయరాదు. రెండవమోతాదు నిచ్చుటమూలమున మొదటిమోతాదు కలుగజేయు సుగుణమును పోగొట్టబడుటయేగాక హానికరమగును.

---

## డల్కమారా :— Dulcamara :—

{ శోరాదోషహరణకరము
{ సైకోసిస్ దోషహరణకరము

### స్థానములు.

ఆమత్వచలములు { ఊపిరిగొట్టము. / మూత్రకోశము. / కండ్లు.

వీపు { మాంసకండరములు. / నడుము.

చర్మము.

కోషరసము స్రవించు నిర్మాణభాగము. (Lymphatics)

### ఉద్రేకములు.

చలిగాయుండుట. { వేడిగాయున్నపుడు. / వాతావరణస్థితి యొక్కమార్పు. / కప్పుకొనకుండుట. / చల్లనితేమ. / పాదములు. / భూమి, పరుపు / మొదలగునవి.

స్రావములు, చెమట, పొక్కులు మొదలగునవి అణుపెట్టుటచే.

శరదృతువులో. రాత్రి, విశ్రాంతి వలన. గాయములు. పాదరసము. తుపానుకుమందు.

1 శీతగాలి, వర్షపుగాలి, తడి మొదలగువానికి లోనగుటవలనను వేడి గాలి ఆకస్మికముగ మారుటవలనను (బ్రయో) ఉద్రేకించు మేహవాత నొప్పులను చర్మవ్యాధులను నివారణజేయును.

2 చలిగాలి, చన్నీళ్ళువలనను, శీతలమును కలుగజేసినపక్షమున నాలుకకు దవుడలకు నొప్పివచ్చును.

3 చెమ్మనేలలో నివశించుటవలనను పనిచేయుటవలనను వ్యాధిగ్రస్తమగు రోగుల కుపయోగించును (ఆర్సు, నేట్రంసల్ఫు).

4 చలి తగులుటవలన మెడకొయ్యబారుట: నడుములోను చట్టలలోనునొప్పి.

5 బహిష్టుకుముందు చర్మముపై పొక్కులు (Rash) బయలుదేరుట. (బహిష్టులో విస్తారమైన స్రావము వెడలుచున్నపుడు బెల్, గ్రాఫైటీస్): యీపొక్కులు విపరీతమయిన దురదతోనుండును: గోకిన కొలది మంట వృద్ధియగును: ఉష్ణముగానున్న వృద్ధియగును: శీతలమువలన స్వస్థతగానుండును.

6 శీతగాలివలన చెమట అణచిపెట్టబడుటచే సంభవించు ఉబ్బు:

7 ముఖముపైగల తామరవంటి చర్మవ్యాధి అదృశ్యమయినవెంటనే ముఖమునందు పోటు: విపరీతమయిన క్షయవ్యాధి సంభవించుట.

## యుపటోరియమ్ పెర్ఫ్ :—

**Eupatorium Perf:—**

| స్థానములు. | ఉద్రేకములు |
|---|---|
| ఎముకలు. కడుపు. కాలేయము. | చల్లనిగాలి. కదలిన. |
| పుచ్చిలిగుంజ. గాలిగొట్టము. | నిర్ణీతకాలములలో { ఉదయము. 7-9 గం॥ 3వరోజు లేక 7వరోజు |
| ఆంసకం శరములు { రొమ్ము. నడుము. కాళ్ళు చేతులు. | బాధవైపు పరున్న. దగ్గుచే. వాసన లేక భోజనము. |
| | **ఉపశమనములు.** |
| | పసరుడోకిన. చెమటపట్టిన. |
| | ముఖముమీాద పరున్న. |

1 శరీరమంతయు చితుకకొట్టినట్లు విపరీతమయిన పోట్లు నొప్పి (ఆర్నికా, బెలిస్, పైరోజినమ్).

2 నడుములోను, తలయందు, రొమ్ములయందు, కాళ్ళయందు, చేతులయందు, ముఖ్యముగా మణికట్టునందుగల ఎముకలు స్థానము తప్పినట్లు ఎముకలలో పోట్లు.

3 కంటిగ్రుడ్డు నొప్పిగానుండి బాధకరముగానుండుట.

4 బాధలు (Pains) త్వరితముగ యగుపించి త్వరితముగపోవుట. (బెల్, మేగ్ఫాస్).

5 జ్వరము : ఉదయమున జ్వరము 9 గంటలకు ఒకరోజునవచ్చి మధ్యాహ్నము ఆ మరునాడు వచ్చుట : చలివచ్చుముందు చలి సమయమున ఎముకలలో పోట్లు.

6 చలికి జ్వరమునకుముందు తృప్తితీరని దాహము.

యూఫ్రేషియా :— (సైకోసిస్ దోషహారణకరము)

**Euphrasia :—**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| ఆమత్వచలములు { కండ్లు. ముక్కు. రొమ్ము. | సూర్యకాంతి. గాలి. వెచ్చదనము గది. సాయంత్రము. |
| | **ఉపశమనములు.** |
| | బహిరంగగాలి, కన్ను చిట్లించుట. కండ్లు తుడుచుటచే. |

1 కండ్లనుండి విస్తారముగ నీళ్ళు కారుట : ఈ లక్షణముతో జిగురు వంటి స్రవించు విపరీతమైన రొంప.

2 ఎల్లప్పుడు కండ్లనుండి నీరు కారుచు ఉదయమున కండ్లు అంటుకొనుట. కండ్లరెప్పలవంచులు ఎర్రబడి వాచిమండుచుండుట : కండ్లు ఎర్రబడుట : పోటు ; వెలుతురు చూడలేకపోవుట ; యిట్టి లక్షణములతోనున్న కండ్ల కలకను నివారణజేయును.

3 బాధతోకూడిన బహిష్టు : ఒక్కగంటమాత్రమే బహిష్టు చిహ్నములగుపడుట : ఆలశ్యముగా బహిష్టగుట : కొలదికాలమే ఋతురక్తము స్రవించుట : మొదటిదినమునమాత్రమే ఋతురక్తము స్రవించుట :

## ఫెర్రమ్‌మెట్ :—(Ferrum Met)

| స్థానములు. | ఉద్రేకములు. |
| --- | --- |
| రక్తప్రసరణము. { రక్తప్రసారము. రక్తనాళములు | రాత్రి. మానసోద్రేకములవలన. |
| రక్తము. | ఎక్కువవ్యాయామము. |
| ప్లీహము. | భోజనముచే. త్రాగుటచే. ప్రాణపోషకమైనవిపోవుటచే. చెమటలు. |
| జీర్ణశక్తి. | క్వైనా : కోడిగుడ్లు. |
| ఎడమడెల్టాయిడ్ గ్రంధి. | వేడి లేక చలి. |
| | చేతులు పైకెత్తుటచే. |

**ఉపశమనములు.**

మెల్లగా కదలిన.
కొలదిరక్తము స్రవించిన.
తలను దేనిపైనా వాల్చుటవలన.

1 భయంకరముగ ముఖ మెర్రబడుట : తలయందలి ముఖమునందలి నరములువాచుట.

2 గుండెదడ, లేక వగర్పు, లేక ముక్కునుండి రక్తము స్రవించుట మొదలగు వ్యాధి లక్షణములుగల రోగులయందు, రొమ్మునందు (Chest) నఖముఖములకు వ్యాపించుబాధలు : రక్తము ఉమ్మివేయుట.

3 ముఖము పెదవులు నాలుక నోటియందలిభాగములు మొదలగు నెర్రగానుండు భాగములు తెల్లబడుట.

4 విరేచనములు : రాత్రిభాగమున, భోజనముచేయు సమయమున పానీయములు త్రాగుసమయమున (క్రోటన్‌టిగ్) అజీర్ణవిరేచన

ములు (Undigested Stools) వెడలుట : రోగికి మంచిఅన్నహిత వృద్ధి బాధలేని యిట్టి విరేచనములు వెడలుచుండుట :

---

జెల్సిమియమ్ :— (సైకోసిస్ దోషహారణకరము.)

**Gelsemium:—**

స్థానములు.

మెదడు తాడు { మూచ్చిలిగుంట. మెడ అడుగుభాగము.

చలన హేతు నరములు { కండరములు. మోకాళ్లు. కంటిరెప్పలు: దృష్టి

ఆమత్వ చలములు { ముక్కు. పైత్యరసనాళము.

కుడిభాగము.

ఉద్రేకములు.

మానసకలవరోద్రేకము. భయము: ఆశ్చర్యము : ఆకస్మిక కల్లోలము. ప్రమాణము చేయుట.

గాలి పాటు { వసంతము. మంచుకురిగి యు. శీతలముగానుండు.

ఉష్ణము : కాలక్రమముగ. పండ్లు వచ్చుకాలములో : పొగాకు గాస్ (Gas)

ఉపశమనములు.

విస్తారముగ మూత్రవిసర్జనము. చెమటపట్టుట: వణకుట : మద్యసారాయములు త్రాగుట. మానసిక ప్రయత్నము.

1 తల బలువు : మూత్రము విస్తారముగా వెడలినపిమ్మట తగ్గుట.

2 కంటిరెప్పలకు, నాలుకకు, కంఠమునకువచ్చు పార్శ్వపువక్షవాతము (Partial Paralasis).

3 తల బలువు : ముఖము వేడిగానుండుట ; చలి : మాట ముద్దగా వచ్చుట : మెదడు చితుకకొట్టినట్లుండుట.

4 ఆకస్మికమానసోద్రేకమువలన, దుఃఖమువలన, భయమువలన, చెడ్డ వార్తలవలన, లేక అసాధారణమైన ప్రయత్నములు గావించుట వలన గలుగు విరేచనములు.

5 ప్రసవనొప్పులు బలముగా రాకుండుట ; అసలు రాకుండ ఆగి పోవుట : ప్రసవము ఆలస్యమగుట.

6 జ్వరము : మగతతోకూడినఉష్ణము : మధ్య సఖముమేల్కాంచుచు, తరచు గొణుగుచు నిద్రించుట. దాహము తక్కువ : మిక్కిలి నీరసము : కదలక పరుండవలెనని యుండుట : లేచిన శరీరము వణకుట : మనిషి సహాయము లేనిపక్షమున కదలలేకపోవుట.

7 చలి : కాళ్ళుచేతులు చల్లగానుండుట. తల ముఖము వేడిగానుండుట.

8 ముఖము కందినట్లు ఎర్రగానుండుట. (బెల్)

9 కళ్ళు బలువుగానుండి రెప్పలు ఎత్తలేకపోవుట. (కాస్టి, గ్రైపైటిస్, సిపియా)

10 చలిలో దాహములేకపోవుట, చలి వెన్నెముకవెంబడి క్రిందకు పైకి, మెడవద్దనుండి తుంటిలువరకు కెరటములవలె చురుకుగా వ్యాపించుట.

11 సన్నిపాతజ్వరములలో యిదియొక ప్రధానౌషధము : సన్నిపాతజ్వరములో నీక్రిందిలక్షణములు యగుపించినవెంటనే యీయౌషధమును ప్రయోగించిన పక్షమున తక్షణమే నివారణజేయును.

కండరములయందు నరములయందు (Muscular and Nervous prostration) విస్తారమైన నీరసము ; పరుండవలయుననే యుండును. మిక్కిలి నీరసము : లేచుటకు ప్రయత్నించిన కాళ్లు వణకును. పట్టుకొనుటకు ప్రయత్నించిన చేతులు వణకును. నాలుక పైకిచాపిన వణకును. నాడి మిక్కిలి నీరసించి, మందముగనుండును. కదలిన నాడిగమనము హెచ్చును. కొంత చలియుండును. కాళ్లు చేతులు చల్లగానుండును. ముఖము, ఎర్రగా కందినట్లుండును. మత్తుగానుండును. తరుచు నిద్రించుచు అస్పష్టముగ గొణుగుకొను చుండును. (muttering) తలత్రిప్పు ; తలబరువు ; దృష్టిమాంద్యము ; నాలుకపై కొలదిపూత ; మాట ముద్దగానవచ్చును : దాహముండదు : మలబద్ధముండదు : విరేచనములుండవు : కండ్ల రెప్పలు వ్రాలును. ఈ లక్షణములతో జెల్సిమియమునుప్రయోగించిన వ్యాధి గమనదినములు పూర్తి యనవసరములేకుండగనే జ్వరము నిరోధింపబడును.

---

గ్లోనైన్ —(Glonoine)

**స్థానములు.**

మెదడు.

రక్తప్రసరణ నిర్మాణము { రక్తప్రసరణము. తల (ముఖము) హృదయము.

మేస్టాయిడ్ గ్రంధులు.

శ్వాస.

**ఉద్రేకములు.**

ఉష్ణము { తెల్లుపు. ఎర్రని వేడివేయుట. ఎండ, దీపపు వెలుగు రులు మొదలగునవి. వేడిగాలి.

చలనము { కదలిక : కుదుపు. తల వెనుకకు వంచుట. గాయము.

సారాయము ; బహిష్టు అణచిపెట్టుట.
జుట్టు కత్తిరించుట ; టోపీబరువు.

ఉపశమనములు.

---

బహిరంగమైన గాలి; తల ఎత్తుట.
చల్లని వస్తువులు.

1 దిగ్భ్రమగొల్పు భావములు : తాను ఎచ్చటనున్నదియు గ్రహింపలేడు. వీధులు క్రొత్తగాయగుపడును. గృహమార్గము చాలదూరమున్నట్లు తోచును.

2 తల విస్తారము పెద్దదిగాయున్నట్లు తోచును.

3 తల బాధలు : గ్లాసులైటుక్రింద పనిచేసి వేడి తలపై బడుటవలన గలుగు బాధలు ; ఎండలో నడచుటవలన కలుగుబాధలు ; తలపోటు.

4 గుండె విశేషముగ పనిచేయుటవలన శరీరమంతటను, దుడుకు.

5 ఎండదెబ్బవలన గలుగు తలపోటు ; తలపోటు సూర్యోదయము మొదలు హెచ్చి సూర్యాస్తమానముతో తగ్గుట.

6 స్త్రీ మర్మావయవమునుండి విస్తారముగ రక్తస్రావము వెడలిన పిమ్మట కలుగు తలపోటు.

7 బహిష్టునకు బదులు తలపోటు. బహిష్టు ఆలస్యమగుటవలన లేక అణచిపెట్టుటవలన తలపోటు ; తలయందు అధికరక్తకూటమి. (Congestion)

## గ్రైఫైటిస్ :— (Graphites) { (శోరాదోష హారణకరము) (సూడోసోరిక్) }

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| జీర్ణశక్తి ; రక్తప్రసరణ. | శీతలము, విసురుగాలి, వెలుతురు. |
| చర్మము :— మడతలలో ; చెవుల వెనుకభాగమున. అవయవములు కలియు చోటు (అనగా కళ్ల మధ్య చంకలలోను మొదలగు.) కీళ్లలో అవయవ ద్వారములు : గోళ్లు. | బహిష్టుసమయములో. అణచిపెట్టు. ఊరక గుటకవేయుట. క్రొవ్వుపదార్థములు :— వేడిపానీయములు. |
| ఆమత్వచలములు. | **ఉపశమనములు.** |
| గ్రంధులు, కండ్లు. | బహిరంగమైన గాలి, బహిరంగమైన గాలిలో నడచుట. భుజించుట ; స్పర్శ. |

1 తలపై మాత్రపుపొక్కులు : తలంతయు నీ పొక్కులతో రసి కారుచు వెంట్రుకలన్నియు అట్టలుకట్టి బాధకరముగనుండి మట్టు గొనుటకు వచ్చిగానుండుట.

2 పెదవులు, ముక్కురంధ్రములు వరసి పగులుట.

3 ముఖముమీద గెడ్డము క్రింద నోరుచుట్టు రసితోకూడిన మంత్రపు పొక్కులు.

4 దురదతోకూడిన బొబ్బలు. (Bloches) వీనినుండి జిగురువంటి నీళ్లవలెనుండు రసి స్రవించుచు నిట్టిబొబ్బలు శరీరమునందనేకభాగములయందుండుట.

5 స్థూలకాయులకు ముఖ్యముగా ఉపయోగించును. మరియు ముఖ్యముగా ఋతువు ఆలశ్యమగు తత్వముగల స్త్రీల కుపయోగించును.

6 విచారగ్రస్థముగా నుండుట ; సంగీతము దుఃఖము కలుగజేయును. చావునుగురించి తప్ప మరియొక ఆలోచనయుండదు.

7 అధికసంయోగమువలన సంయోగశక్తి తగ్గుట.

8 బహిష్టు ఆలశ్యమగుట, తక్కువయగుట, కాలక్రమముగా జరుగకుండుట. యీ లక్షణములతో ఋతుశూల.

9 బహిష్టులో త్రిప్పువికారము డోకులు. మిక్కిలి నీరసము, బలహీనము.

10 కుసుమ : మర్మావయవమును ఒరుపుజేయు కుసుమ ; రాత్రింబవళ్లు ముద్దలు ముద్దలుగా వచ్చుట ; బహిష్టుకు పిమ్మట కుసుమయగుపడుట (బహిష్టుకు ముందు యగుపడు కుసుమ సిపియా : బహిష్టుకు పిమ్మట యగుపించు కుసుమ క్రియసోట్.)

11 స్తనములపై బయలుదేరిన కురుపు మానినపిమ్మట నిలివియుండు గట్టి మచ్చలు ; పాలు స్రవించకుండ నిరోధము కలుగజేయుటవలన కలుగు బాధలు ; స్తనములయందు బయలుదేరు రణము ; స్తనములపై తరుచు కురుపులు బయలుదేరుట.

2 అనారోగ్యమైనచర్మము; చిన్న దెబ్బకూడ చీముపట్టుట (హెపార్) : కురుపు మచ్చలు తిరిగి చీముపట్టి పుండగుట.

3 చెవులపైనను, చెవుల వెనుకభాగమునను వ్రేళ్లమధ్యను గోళ్ల వద్దను శరీరమునందితరభాగములయందును జిగురుతోకూడిన నీళ్లవంటి స్రావము స్రవించుచు నుండుపొక్కులు గోళ్లు ముక్కలు ముక్కలుగా ఊడిపోవుట ; పుప్పిగోళ్లు ; గోళ్లూడిపోవుటచే నొప్పి

గాను పచ్చిగాను యుండుట; పరయుట; దళసరెక్కుట; విరిగి పోవుట; గోళ్లలో కురుపు సలిపినట్లు పోట్లు.

15 వేళ్ల చివరను, చన్మొనలయందు, గోళ్లమధ్య, ఆసనమునందు, మర్మావయవ సంధులయందు పగులుట.

16 విరేచనములు: భరింపశక్యముగాని దుర్వాసనతో అజీర్ణపదార్థములతో కలసి నీళ్ళవలె గోధుమవర్ణముగా వెడలు విరేచనములు; పొక్కులు అణచిపెట్టుటమూలమున కలుగు విరేచనములు.

17 దీర్ఘకాలమునుండిగల విరేచనబద్ధము (Chronic constipation) గట్టిగా పెద్ద వుండలవలె జిగురుగా ఒకటొకటి యంటుకొని కష్టముమీద వెడలువిరేచనము. మిక్కిలిపెద్దగా లావుగా వెడలు విరేచనము (సల్ఫరు): విరేచనమైనపిమ్మట ఆసనమునందు నొప్పి: చురుకు చురుకు పోటు.

18 ముఖముమీద సాలిగూడున్నట్లు భావన, అందుచే తరుచు ముఖము గట్టిగా తుడుచుచుండును. (బొరేక్సు, బ్రోమియమ్).

19 సంయోగమునందు, నిశ్చయమైన విముఖత. (స్త్రీ పురుషుల కుభయులకు వర్తించును.)

N. B:—బహిష్టు లక్షణములలో లైకోపోడియమ్ పల్సెటిల్లాను పోలును. చర్మవ్యాధులలో సల్ఫరును కుసుమలలో సిపియాను అనుసరించును.

హెమమలిస్ :— (సూడోసోరిక్)

**Hamamelis :—**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| శిరలు Viens { ఆసనమునందలి మర్మావయవమునందలి. కాళ్ళు చేతులు : కంఠము. | గాయము : కముకు దెబ్బలు : ఒత్తిడి. |
| కాలేయము. | గాలి { బహిరంగమైన ; శీతలమైన. చల్లని. |
| ఉదరముయొక్క గుండెయొక్క గోడలు. | కదుపు : చలనము. |

1 శరీరమందు ఏదే యవయవమునుండి కలుగు రక్తనాళసంబంధమయిన రక్తస్రావమునైనను అరికట్టును. శిరధమని నిర్మాణము (venous and capillary system) పై ఎక్కువైనటునలె పనిజేయును.

2 నలుగుటవలన, గుచ్చుకొనుటవలన లేక తెగుటవలన కలుగు గాయములయందు రక్తము స్రవించుటను కట్టివేయును. నొప్పి పోటు తగ్గించును.

3 వ్యాధిగ్రస్తమైన భాగములు చితుకకొట్టినట్లు నొప్పిగాయుండుట (ఆర్నికా)

4 కఠినమైనదగ్గుచే కంటిగ్రుడ్లు నొప్పిగాయుండుట. కండ్లయందలి రక్తనాళములు బ్రద్దలై కన్ను కండవలె ఎర్రగానుండుట. (ఆర్నికా, కేలెండ్యులా, లెడమ్)

5 దెబ్బవలన సంభవించు దీర్ఘవ్యాధిలక్షణములు. (కోనియమ్).

6 ముక్కులనుండి దీర్ఘకాలము రక్తముస్రవించుట. ఆసనమునుండి రక్తము స్రవించుట : స్త్రీ మర్మావయవమునుండి రక్తము స్రవిం

చుట ; బహిష్టుస్రావము చాలదినములవరకు విస్తారముగా వెళ్లుట (బాధలుండవు).

7 మూలశంఖ : మంటతోకూడి నొప్పిగానుండి విస్తారముగా రక్తము స్రవించుట. నడుము విరిగిపోవునట్లు బలువుగానుండుట ; మూలశంఖగల ప్రదేశము నీలివర్ణముగానుండుట.

8 రక్తము పోవుటవలన గలుగు దుర్గుణములు (చైనా)

---

## హెల్లీబోరస్ :—(Helleborus)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| మనస్సు : బుద్ధి : స్పర్శజ్ఞానము. | శీతగాలి : రజస్వలయగు వయస్సు. |
| నరములు :—చలనస్పర్శజ్ఞాన నరములు. | పండ్లువచ్చుకాలము. |
| రసస్రావ అమత్వచలములు. | అణచిపెట్టు ; వ్యాయామము. |
| మూత్రపిండములు. | సాయంత్రము 4 గంటలు మొదలు రాత్రి 8 గంటలవరకు. |
| కండరములు:—వ్యాధిగతస్రావము. | **ఉపశమనములు.** |
| | బలమయిన దృష్టియుంచుట. |

1 విరేచనము స్వచ్ఛమయిన శ్లేష్మకళ్లెలతో కూడియుండుట.

2 పళ్లువచ్చు కాలములోను, వేసవి బాధలవలనను మెదడునకు (తలలో నీరుపట్టుట.

3 పళ్లుకొరుకుట: దవడలు నిరంతరము నములుచుండుట. నోటిచెలిమల పగులుట.

4 నిరంతరము కళ్లు అనాలోచితముగ తేరిబారి మూచుచుండుట: కండ్లు తెరచియుంచుట: వెలుతురును సహింపకుండుట.

5 అప్యాయముగ నీరు విస్తారముగ త్రాగుట; త్రాగుచు స్మృతిలేక చెమిచాను కొరుకుట.

6 పెదవులు నిరంతరము గిల్లుకొనుచుండుట; బట్టలు చింపుట, బరుకుట; ముక్కురంధ్రములలో వ్రేళ్లుపెట్టి త్రిప్పుచుండుట.

7 చేతులతో తలబాదుకొనుట; యిటునటు దొర్లుచుండుట; తలగడలోనికి తలదూర్చుట.

8 తలయందు నీరుపట్టుటచే మూత్రము అణచిపెట్టబడుట; మూత్రము ఎరుపు, నలుపువర్ణముగాను కొలదిగాను వెడలుచు కాఫీ రంగువంటి మడ్డి క్రిందకు దిగుట.

9 గుండెకు, మెదడుకు, కడుపుకు నీరుపట్టుట, జ్వరము; నీరసము; మూత్రము అణచిపెట్టబడుట.

---

## హెపార్ సల్ఫ్ :—
## (Hepar Sulph)

{ శోరాదోషహరణకరము
{ సిఫిలిస్ దోషహరణకరము

**స్థానములు.**

నరములు.

అనుబంధ ధాతుమజ్జాదులు.

శ్వాసావయవతంతువులు.

వ్రేళ్లసందులు.

గ్రంథులు ; మూత్రపిండములు.

**ఉద్రేకములు.**

చలిగాలి ; పొడిగాలి ; శీతకాలము ; విసురుగాలి ;

వ్యాధిస్థానమునకు చల్లదనము కలుగుట. లేక పొడియారుట.

ఏమాత్రము కప్పుకొన్న

చర్మము.

ముక్కుదూలము. (కాలిబై)

బట్టతీసినను.

—స్పృశించినను,

—ధ్వనివలనను,

—వ్యాయామమువలనను.

నొప్పిగాయున్న భాగమున పరుండుటవలన.

పాదరసమువలన.

రాత్రిభాగమున.

ఉపశమనములు.

ఉష్ణము ; వెచ్చనిబట్టలు.

కప్పుకొనుట ; తలను ఉష్ణము కలుగజేయుట.—

శీతగాలి.

1 చేపఎముక, లేక పుల్లముక్క గొంతుకలో గ్రుచ్చినట్లుండుభావనను.

2 జీర్ణకోశస్థితి చెడుట : పుల్లటి వస్తువులకొరకు, ఘాటైన వస్తువులకొరకు వాంఛ.

3 పులిసిన వాసనతోకూడి చీమువంటి ఆకుపచ్చని విరేచనములు ; పాకుడువంటి విరేచనములు (కల్కేరియా, పోడో).

4 చలిగాలి తగులుటవలన వచ్చుదగ్గు, కంఠము వాచుట : చలిగాలి వలన, చన్నీళ్లవలన మిక్కిలి బాధకరముగా నుండుట. శరీరము నందేభాగమునైనను కప్పియుంచనిపక్షమున దగ్గువచ్చుట (హెపా): పశ్చిమ పొడిగాలి తగులుటవలన వచ్చుదగ్గు.

5 క్షయ : గురగురలాడుట : ఆయాసము : వగర్పు : శ్వాస బంధించుట : యీ బాధలచే తల వెనుకకు వ్రేలాడవైచి కూర్చుండ

వలసి వచ్చుట. చలిగాలివలన, చన్నీళ్లు త్రాగుటవలన, అర్ధరాత్రమునకు పూర్వము ఉదయమున ఉద్రేకించును.

6 విపరీతమైనచలి : కప్పుకొనకుండ యుండలేకపోవుట.

7 అనారోగ్యమయినచర్మము : స్వల్పమయిన దెబ్బకూడ చీముపట్టును.

8 రణములు మిక్కిలి నొప్పిగానుండుట : పోటు : మంట : మురిగిన వెన్నవంటి వాసనతో కూడిన రసి స్రవించుచుండుట : రణములు చుట్టు చిన్న చిన్న మొటిమలుండుట.

9 రసదోషములను బోగొట్టును : పాదరసమునకు విరుగుడు.

10 తక్కువ పొటెన్ సీలలో నిచ్చిన కురుపులు చీముపట్టి ఎదిగి చితికిపోవును.

11 కంటిగ్రుడ్డు నొప్పిగానుండుట : తలలోకి గ్రుడ్డులాగ బడుచున్నట్టు భావన.

12 రాత్రింబవళ్లు విస్తారమయిన చమటలు : చమటపట్టుటవలన ఎట్టి స్థిమితము కలుగకుండుట : చమట దుర్వాసనగాను పులిసినవాసనతోను యుండుట : మానసికపరిశ్రమ లేక శరీరవ్యాయామము గావించినపుడెల్లను సులభముగా చమటపట్టుట. (సిపియా, సోరినమ్)

13 మూత్రము చురుకుగా స్రవించక బొట్లుబొట్లుగా పడుట : మూత్రము విసర్జించుటకు కొంతసేపు కూర్చున్నపిమ్మటగాని మూత్రము రాకుండుట : మూత్రకోశము బలహీనమగుట : మూత్ర విసర్జనము సమాప్తి చేయజాలకపోవుట : మూత్రమంతయు వెడలక యింకను కొంతమూత్రము వెనుక దిగబడియున్నట్లు భావన. (అల్యూమినా, సిలికా).

14 చిడుము : (ఎండుచిడుముకు సల్ఫరుపయోగించును.) సల్ఫరు చిడుము, పొడిగాను, దురదగాను యుండును. గోకిన ఉపశమనము

గాయుండును. ముట్టుకొన్న అంత నొప్పియుండును : హెపార్ చిరుము చీముపట్టిన పొక్కులతో రసికారుచుండును. ముట్టుకున్న కుక్కిలి నొప్పిగాయుండును.

N. B :—పాదరసము, లోహములు, ఐడిన్, పొటాషియమ్ అయిడోడ్, కాడ్‌లివర్ ఆయిలు మొదలగు వానికీ ఔషధము విరుగుడు. చలిగాలికి వాతావరణమార్పులకు సులభముగా వ్యాధిగ్రస్తమగు రోగుల కీమందుపయోగించిన తత్వము మార్పుజెంది అట్టివానికి వశ్యముగాకుండజేయును.

---

## హైడ్రాస్టిస్ :—(Hydrastis)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| ఆమత్వచల గ్రంధులు. { ముక్కువెనక. జీర్ణకోశము. పైత్యరసనాళము. మలకోశములు. | శీతగాలి పీల్చుట. పొడిగాలిలో. బహిరంగమైనగాలిలో. కొలదిపాటి రక్తస్రావము. |
| కండరములు : గర్భకోశము. | కదుగుట : వృద్ధాప్యము. |

1 కడుపులో నీరసము.

2 సెగ ద్వితీయావస్త : చిక్కటి పసుపుపచ్చని స్రావము.

3 తీగిసాగు జిగురువంటి చిక్కని పసుపుపచ్చని కుసుము.

4 ముక్కునుండి వచ్చుస్రావము తీగిసాగుచు జిగురువలె చిక్కగా పసుపురంగు గలిగియుండును. కంఠమునుండి వచ్చుశ్లేష్మకళ్ళెలు

కూడ నిల్లేయుండును. శరీరముయొక్క ఏఅవయవమునుండి వచ్చు స్రావమైనను చిక్కగా పసుపురంగుగా తీగి సాగుచుండును.

5 రణము : గట్టిగానుండుట : చర్మము ముడతలుపడి తూట్లుపడుట. కత్తితో పొడుచుచున్నట్లు రణమునందు బాధ : చురుకుచురుకు పోటు.

6 రజస్వల సమయమునకు గర్భిణీకాలములోను వచ్చుగండమాల వ్యాధి.

7 చిక్కిపోవుట. క్షయ తత్వరోగులకు ట్యూబర్క్యులినంతో చికిత్స జేసినపిమ్మట శరీరపుష్టి కలిగించుట కీఔషధ ముపయోగించును.

8 మసూచికముయొక్క తీవ్రతను తగ్గించును. బాధకరమగు లక్షణములు కలుగకుండ కాపుదలజేయును. గమనకాలమును తగ్గించును. ప్రమాదమును తప్పించును. అనంతర బాధలను, దుష్టఫలితములను శాంతింపజేయును. ప్రమాదమును తగ్గించును. (జె. జె. గర్తువిల్ కిన్సన్).

---

## హైయోసినమస్ :— (శోరాదోష హారణకరము.)
**Hyoscyamus :—**

**స్థానములు.**

మనస్సు : బుద్ధి : నరములు.

కండరములు { ముఖమునందలి. కండ్లయందలి.

రక్తము.

**ఉద్రేకములు.**

ఉద్రేకము { భయము. అసూయత.

స్పర్శ : పరుండుట : శీతలము : నిద్ర.

**ఉపశమనములు.**

కూర్చుండుట.

1 సంధి లక్షణములలో నీ ఔషధము బెల్లడోనాకు, స్ట్రమోనియ ముకు మధ్యస్తముగా నుండును. బెల్లడోనాకుగల మెదడునందు రక్తకూటమి (Cerebral Congestion) ఉండదు. స్ట్రమోనియముకుగల కోపముతోకూడిన తీవ్రమైన పిచ్చిచేష్టలతోకూడిన సంధిలక్షణము లుండవు.

2 సంధిలో ముఖము గోకుకొనుట పక్కబట్టలు పోగుచేయుట బరుకుట : గొణుకుకొనుట : తెలివితప్పి మాట్లాడుట : వ్యాపారము గూర్చి అసందర్భముగా మాట్లాడుట : భయము : ఎదుటి మనుష్యులను తెలిసికొనలేకపోవుట : కండ్లుమూయుట : పిలచినప్పుడు మాత్రమే పలుకుట : తిరిగి వెంటనే స్మృతిలో లేకపోవుట.

3 ప్రసవించినపిమ్మట మూత్రము బంధించుట : మూత్రకోశమునకు పక్షవాతమువచ్చుట : బాలింతరాలునకు మూత్రము విడచుటకు కోరిక లేకపోవుట.

4 మతిభ్రమ : సిగ్గులేకపోవుట : కట్టుకొన్నదుస్తులు తీసివైచుట ; మర్మావయవమును బహిర్గతముచేయుట : దిగంబరిగా నుండుట : అసహ్యకరమగు పాటలుపాడుట : దిగంబరిగాపరుండి తనలోతాను మాట్లాడుకొనుచుండుట.

5 వ్యాపారనష్టములచే మానసికోద్రేకముకలిగిన వ్యక్తులయందు కలుగు విపరీతమైన నిద్రలేమి.

6 పిచ్చి : కోపము : గదిచుట్టు పరుగిడుట : బట్టలుచింపివేయుట : తిట్టుట : ఒట్టుపెట్టుకొనుట : కొట్టుట మొదలగు లక్షణములు.

7 భయముతోకూడిన ఆతురత : భయమువలనకలుగు బాధలు.

8 సంఘమునందు, వెలుతురునకు విముఖత.

9 ప్రేమభంగమగుటవలన గలుగువ్యాధులు.

10 జ్వరము, న్యుమోనియా, త్వరితముగా [illegible] మారుట ; స్పర్శజ్ఞానము తగ్గుట ; జ్ఞప్తితగ్గుట ; [illegible] చుట : పక్కబట్టలు బరుకుట : పోగుచేయుట ; [illegible] నుండుట ; మలమూత్రములు అప్రయత్నముగా [illegible]

11 భయమువలన లేక నులిపురుగువలన (సినా) [illegible] ములు : ప్రసవనొప్పులువచ్చు సమయములోను, [illegible] పిమ్మటను వచ్చుకంపములు.

N. B :—వికృతమయిన పిచ్చిచేష్టలను హైయోస్ [illegible] నప్పుడు ఫాస్ఫరస్ నివారణజేయును.

---

## హైపెరికమ్ :—(Hypericum)

**స్థానములు.**

వెన్నెముకనరములు.

నడినెత్తి.

**ఉద్రేకములు.**

గాయములు:
- కమిలిన దెబ్బలు. [illegible]
- కున్న గాయములు.
- అమరులు : [illegible]
- వలనగలుగు దెబ్బలు.

వ్యాయామము.

గాలిమారుట.

పొగమంచు.

శీతగాలి : తడిగాలి, చలనము.

**ఉపశమనములు.**

ముఖముపై పరుండుట.

వెనుకకు వంగుట.

1 వెన్నెముకకు దెబ్బతగులుట మూలమునకలుగు దుర్గుణములను నివారణజేయును.

2 గుచ్చుకొనుటవలన లేక తెగుటవలన కలుగు గాయములు మిక్కిలి బాధకరముగా నున్నప్పుడు వెంటనే బాధను తగ్గించును.

3 మేకులు, సూదులు, గసికెలు, మోళ్లుగ్రుచ్చుకొనుటవలన కలుగు గాయములయందలి బాధను నొప్పిని వెంటనేమాన్పును.

4 సున్నితమయిన ప్రదేశములయందు తగులుదెబ్బలు. అరిచేతుల యందు, అరికాళ్ళయందు, వేళ్ళచివర గోళ్ళవద్ద తగులు గాయములు. యీదెబ్బలవనగలుగు విపరీతమయినబాధలను వెంటనే తగ్గించును. వేళ్లు నలిగిపోవుటవలన కలుగుబాధను వెంటనేతగ్గించును.

---

## ఇగ్నేషియా :—(Ignatia) (శోరాదోషహారణకరము)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| మనస్సు. | మానసోద్రేకము { దుఃఖము. భయము. ఆశాభంగము. పీడ. |
| నరమండల నిర్మాణము. | శీతగాలి : బహిరంగమైనగాలి. |
| మెదడుకు వెన్నెముక కలసిన భాగము. | వాసనలు : స్పర్శ. |
| | కాఫి : పుగాకు. |

### ఉపశమనములు.

ఒకప్రక్కనుండి వేరొకప్రక్కకు మారుచుండుట : వ్యాధిగలభాగమున పరుండుట.

మూత్రనిర్జనము.

ఒంటరిగానుండుట.

అదిమిపట్టుట.

1 దుఃఖము దిగమ్రింగియుండుట : ఏదియో విపత్తు సంభవించునని విచారించుచు దిగాలుగా నుండుట.

2 మానసిక బాధలు అణచిపెట్టుటవలన కలుగు వ్యాధులు : దుఃఖము వలన సంభవించు వ్యాధులు.

3 దూషణవాక్యములవలనను అవునన్నది కాదని వ్యతిరేకము చెప్పుట వలనను, కోపముజెంది ఉద్రేకముజెందుట : సులభముగ కోపము జెంది ఉద్రేకముజెందు స్వభావముగల రోగులకును, అభిమాన మెక్కువగ గల (Sensitive) స్త్రీలలో కలుగు హిష్టీరియా లేక అపస్మారకముమీదను బాగుగా పనిజేయును.

4 చెవిలో హోరు సంగీతమువలన తగ్గును ; నడచుటవలన మూలశంఖ బాధ తగ్గును. గుటకవేయుటవలన కంఠమునందలినొప్పి ఉపశమన ముగ నుండును ; కడుపు కాళీగాయున్నట్లు భావన ; భుజించినను తగ్గదు : తగ్గినకొలదీ దగ్గు హెచ్చును.

5 దుఃఖముతో విడిచి విడిచి వచ్చునవ్వు ; మానసికలక్షణములు తరుచు మారుచుండును. నవ్వుచు వెంటనే ఏడ్చుట. సంతోషము నుండి దుఃఖములోనికి మారుట.

6 వంటరిగ నుండగోరుట.

7 సంయోగవాంఛతో కూడిన నపుంసకత్వము : సంయోగశక్తితగ్గుట. పురుషాంగము మిక్కిలి చిన్నదియగుట.

8 దీర్ఘకాలము దుఃఖములో నిమగ్నుడగుటచే మానసికముగను భౌతికముగను నీరసించిన వ్యక్తులవ్యాధుల కుపయోగించును.

9 తలలోనికి మేకులుకొట్టినట్లు తలపోటు ; పరుండుటవలన తలపోటు తగ్గుట : (కాఫీ, నశ్యం, తూజా).

16

10 పొగాకువాసన కిట్టకపోవుట; చుట్టకాల్చినను చుట్టపొగ తగిలినను తలపోటువచ్చుట; తలపోటు వృద్ధియగుట.

11 తరుచు నిట్టూర్పువిడుచుచుండుట; తరుచు పెద్ద శ్వాసవిడచుచుండుట.

12 నడచుచు ఆగినప్పుడెల్ల దగ్గువచ్చుట; దగ్గిదగ్గి నిద్రపోవుట;

13 మాట్లాడుచు లేక నమలుచు దవడలుకొరుకుట.

14 మలకోశము ఆసనమునుండి క్రిందకు జారుట; విరేచనము వెళ్లునప్పుడు సామాన్యముగా తినికినను, బలువులెత్తినను, వంగినను, ఆసనము జారుట. పిల్లలలో విరేచనములు వెడలినపిమ్మట కలుగు యీ లక్షణమును (మలకోశము జారుట) వెంటనే నివారణజేయును. విరేచనము వెళ్లునప్పుడు తినుకుట.

15 మూలశంఖ: విరేచనమైనప్పుడు ప్రతిపర్యాయము మూలశంఖ కండరములు బయటకు వచ్చుట (prolapse) తిరిగి దీనిని వెనుకకు గెంటివేసిన లోపలకు పోవుట; ఆసనమునుండి పైకి పోటు (నైట్రిక్ యాసిడ్); విరేచనమైన కొన్నిగంటలకు బాధహెచ్చుట (రటన్, సల్ఫరు).

16 మలబద్ధము; పక్షవాతమాధారభూతమైన మలబద్ధము; బండి ప్రయాణము చేయుటవలన కలుగు మలబద్ధము; కాఫీత్రాగు అలవాటుగల స్త్రీలలో గలుగు మలబద్ధము.

17 జ్వరము; చలి; శరీరమునందు విపరీతమైన వేడి; చలిసమయమున దాహము; ఉష్ణముసమయమున దాహములేకుండుట.

అయోడిన్ :—(Iodine) { (స్క్రోఫ్యూలా దోషహరణకరము) (సైకోసిస్ దోషహరణకరము) (సిఫిలిస్ దోషహరణకరము.) }

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| గ్రంథులు (Glands) { థైరాయిడ్. వృషణములయొక్క. చిన్న ప్రేగులయొక్క. స్తనములయొక్క. } | ఉష్ణము { గదియొక్క. గాలియొక్క. కప్పుకొన్న. } |
| ఆమత్వ చలములు Mucous membran { కంఠమునందలి. ఊపిరితిత్తులయందలి (కుడి ఊపిరితిత్తిలో అడుగుభాగము). } | వ్యాయామము { పైకెక్క. మాట్లాడు. } |
| హృదయము : రక్తనాళములు. | ఉపవాసము చేయుటవలన. |
| చర్మము : నరములు. | రాత్రి : విశ్రాంతి. |
| అనుబంధధాతు మజ్జాదులు. (Connective tissues) | ఉపశమనములు. |
| | శీతగాలి : శీతలోదకస్నానము. |
| | చలనము : భుజించుట. |

1 తలత్రిప్పు : తలయందు, శరీరమునందు దడగాయుండుట.

2 గుండె (Heart) వణకుట (tremor) సొమ్మసిల్లుట ; కూర్చుని లేచినను, పక్కనుండి లేచినను హెచ్చగుట ; లేక కొలది వ్యాయామముచేసి కూర్చున్నను పరున్నను సొమ్మసిల్లుట.

3 పండ్లు పసుపుపచ్చగానుండుట : పుల్లటివస్తువులువలన సులభముగా మొద్దెక్కుట. (పులియుట).

4 దగ్గు ; శ్వాస గురగురలాడుట ; పొడిదగ్గు ; కఃయ్యుమనిమొరుగుచున్నట్లు దగ్గు ; కంఠము పట్టుకొని దగ్గుట.

5 స్తనములు బిగువుతప్పి ముడుతలుపడి వ్రేలాడుట.

6 గుండెసమీపమున నిరంతరము గ్రుచ్చుచున్నట్లు పొడుచుచున్నట్లు పోట్లు విస్తరించుట. గుండె బరువుగాను బిగబట్టినట్లు యుండుట; గుండెలలో అస్థిమితము.

7 చిక్కిపోవుట: చర్మము మురికిగాను పసుపురంగుగాను యుండుట: నీరసము: కదలలేకపోవుట.

8 విపరీతమైన ఆకలి: మంచి అన్నహితవుండి పూర్తిగా భుజించు చున్నను చిక్కిపోవుట. (నేట్రమూరు).

9 ఉదయముననుండి సాయంత్రమువరకు వట్టిత్రేణుపులు.

10 ఆకలిబాధ: ఎల్లప్పుడు తినుచుండును: ఏదియో ఒకటి తిననిపక్షము న ఆతురత అస్థిమితము. (సల్ఫరు. సీనా): తిననిపిమ్మట, తినుచున్నప్పుడు, లేక కడుపునిండుగాయున్నపుడు ఉపశమనముగా యుండుట.

11 కొలది పరిశ్రమవలన గుండెదడ (కొలది మానసికపరిశ్రమవలన గుండె దడ (కల్కేరియా ఆర్సు).

12 నల్లటి తలవెంట్రుకలుగల వ్యక్తులలో గట్టిరాయివంటి కంఠమునందలి కంతి. (Goitre) (లేతరంగువంటి తలవెంట్రుకలుగల వ్యక్తులలో—బ్రోమియమ్).

13 కుసుమ: బట్టలు మరకయగుట: బహిష్టుసమయములో విస్తారముగనుండుట.

14 మలబద్ధము: తినుకుట:

N. B.:—ప్రసవమైనపిమ్మట పెద్దపురుడు దినములలో చిన్నపొటెన్సీలు వాడరాదు.

ఇపెకాక్ :— { (సోరాదోషహరణాకము (సూడోసోరిక్)

**Ipecac:—**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| ఆమత్వచలములు Mucous Membrane { జీర్ణావయములయొక్క జీర్ణకోశము. శ్వాసావయములయొక్క ఊపిరితిత్తులు. | ఉష్ణము : గదిలో. |
| నరములు { చలనస్పర్శజ్ఞానసంబంధమైన వెన్నెముకసంబంధమైన చర్మసంబంధమైన బొడ్డుగలభాగము. | అమిత భోజనము { మాంచుగడ్డ : బలమైన ఆహారము : పందిమాంసము : దూడమాంసము : |
| | కాలక్రమముగా : క్వైనావల్ల : |
| | శీతలము : ఉష్ణము. |
| | **ఉపశమనములు.** |
| | బహిరంగమైన గాలి : |

1 నిరంతరము, విడువక, వికారముకలిగియుండు సమస్తవ్యాధులకు పనిజేయును.

2 వికారము : విస్తారముగా చొంగకారుట : ఉమ్మివచ్చుట : జిగురువంటి తీగిసాగు తెల్లని అంబము విస్తారముగ వాంతిజేయుట : యిందువలన స్వస్థతయుండదు : పిమ్మట నిద్రమత్తు : బాధలు వంగుటచే హెచ్చగును.

3 కడుపులో విపరీతమైన వికారము : వాంతి చేయవలెననియుండుట : వంగిన వాంతియగుట : కడుపులో బాధ.

4 వికారముతో విపరీతమైన తలనొప్పి : తలఎముకలు చితుకకొట్టినట్లుండుట.

5 కదలినపుడెల్ల కడుపులో కోయుచున్నట్లు బాధ.

6 విరేచనములు : నురగవలెను ఆకుపచ్చగాను వెడలుట : విరితో కడుపులో శూల వికారము : జిగురువిరేచనములు : శ్లేష్మకళ్లలతో కూడిన విరేచనములు. రక్తవిరేచనములు.

7 ఆయాసముతో కూడి గర్భకోశమునుండి ఎర్రటి రక్తస్రావము (Hemorrhage) : ముద్దకట్టి వెడలు రక్తస్రావము. బొడ్డునుండి గర్భకోశమునకు పోటు వచ్చుట.

8 గుండెలు కంఠము బిగబట్టి శ్వాసబంధించుట : కదలిన హెచ్చగుట.

9 క్షయ : దగ్గుచే శ్వాసఆడక పాలిపోయి కర్రవలెయగుట : కోరింత దగ్గు : శ్లేష్మ మెగదన్ని ఊపిరాడకపోవుట : గొంతుకలో గురగుర లాడుట. ముక్కునుండి నోటినుండి రక్తము స్రవించుట : శ్లేష్మము వాంతి చేయుట : శ్లేష్మము కంఠమునకు చుట్టుకొనుట.

10 ఒకచెయ్యి వేడిగాను వేరొకచెయ్యి చల్లగాను యుండుట.

11 నడుమునొప్పి : జ్వరము : వేడి : దాహము : చలి : తలనొప్పి : వికారము : దగ్గు : కడపట చమటలు.

12 రక్తస్రావములు (Hemorrhages) ఎర్రటి రక్తము వివిధావయవములనుండి స్రవించుట : (మిల్లిఫోలియమ్) : గర్భకోశమునుండి విస్తారమైన రక్తము స్రవించుట.

13 ఎముకలు ముక్కలక్రింద చితుకకొట్టినట్లు పోట్లు.

14 వసంతఋతువులో రాత్రి చలిచేయుచు పగటియందు ఉష్ణమధికముగానుండు దినములలో కలుగు జిగటవిరేచనములు (కొల్చికమ్, మెర్క్యురి).

15 ప్రారంభమున విశేషముగ వికారముతోను వమనములతోను కూడిన కలరా (కొల్చి).

---

## కాలీబైక్రొమికమ్ :— (Kali Bichromicum)

{ (శోరాదోషహరణకరము) (సైకోసిస్ దోషహరణకరము) (సిఫిలిస్ దోషహరణకరము) }

### స్థానములు.

ఆమత్వచలములు (Mucous membrane) { గాలి గొట్టముల యొక్క. ముక్కు నందలి. కంఠము నందలి. జీర్ణకోశమునందలి. చిన్న ప్రేగుల ప్రథమభాగము }

ధాతుమజ్జాతంతువులు.

కీళ్లు : చర్మనుము,

రక్తప్రసరణ : మూత్రకోశము. ముక్కు మొదలు : నాలుక యొక్క మొదలు లేక పురుషమర్మావయవముయొక్క మొదలు :

### ఉద్రేకములు.

శీతగాలి : బహిరంగమైనగాలి ; ధరించిన వస్త్రములు విసర్జించుట. నిద్రబోయినపిమ్మట : ఉదయమున : తెల్లవారుఝామున 2 గంటలు మొదలు 3 గంటలవరకు. నాలుక చాచుటవలన. స్రావములు అణచిపెట్టుట : వేడిగాలి : సారాయము : బీరు.

### ఉపశమనములు.

ఉష్ణము : చలనము :

1 ముక్కునుండి, నోటినుండి, స్త్రీమర్మావయవమునుండి తదితర అవయవములనుండి వచ్చు స్రావములు గట్టిగా అంటిపెట్టి బంకవలె తీగసాగుట.

2 ముక్కు వాచినట్లు బిగబట్టియున్నట్లు ముక్కునుండి యొకబరువు వస్తువు వ్రేలాడుచున్నట్లు భావన.

3 దగ్గు ; దుస్తులు తీసివైచినప్పుడు దగ్గు ; పక్కపై వెచ్చగా పరున్నపుడు దగ్గువచ్చుట ; ఉదయమున లేచినవెంటనే హెచ్చుగా

నుండుట : తీవ్రమైన దగ్గు : గురగురలాడుట : శ్లేష్మముతీగెలు సాగుట : తీగెలుసాగు చిక్కనిశ్లేష్మము వాంతిజేయుట.

4 స్థూలకాయులలో సంభోగశక్తి లేకపోవుట.

5 తలపోటు : తలపోటువచ్చుముందు కండ్లు చీకట్లుకమ్ముట : దృష్టి సరిగా ఆనకపోవుట ; చీకిరిగానుండుట : ధ్వనికిట్టదు : వెలుతురును చూచుటకు చిరాకు : తలపోటు హెచ్చినకొలది దృష్టి తిరిగియగుపించును.

---

కాలీ కార్బ :— (శోరాదోషహరణకరము) (సూడోసోరిక్) (సైకోసిస్ దోషహరణకరము) (సిఫిలిస్ దోషహరణకరము)

(Kali carb)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| కండరములు అనుబంధతాంతువులు. — హృదయమునందలి, గర్భకోశమునందలి, నడుములోని. | శీతగాలి : చల్లటినీళ్లు ; |
| రసస్రావఆమత్వ చలములు. — గుండెలులోని. (కుడిపై పులడుగు భాగము) కీళ్లలోని. | వ్యాయామమునకుపిమ్మట మిక్కిలి వేడిచేసిన పిమ్మట కలుగు మార్పులు. |
| కండ్లు ; రక్తము. | శీతకాలములో; తెల్లవారుఝాము 2, 3 గంటలమధ్య ; |
| ఎడమభాగము. | బహిష్టుకు ముందు. |
| | ఎడమభాగమున పరుండుట. |

| | |
|---|---|
| | నొప్పిగాయున్న భాగమున పడుండుట. |
| | ద్రవములు పోవుట ; ప్రసవమైన పిమ్మట. |
| | ఉపశమనములు. |
| | ఉష్ణము : మోకాళ్లపై మోచేతులువేసి కూర్చుండుటవలన. |
| | బహిరంగమైన గాలిలో. |

1 కంటి పై రెప్పలయొక్కయు కనుబొమలయొక్కయు మధ్య సంచివలె ఉబ్బి వాచుట.

2 కడుపు బిగబట్టి కాలేయమునందు (Liver) పోట్లు

3 ఊపిరి పీల్చునపుడు గుండెలలో పోట్లు ; సాయంత్రము పడున్నపుడు గుండెలలో కోయుచున్నట్లు బాధ.

4 దగ్గు ; తెల్లవారుఝామున మూడు మొదలు నాల్గువరకు హెచ్చుగానుండుట.

5 రోగిని తగిలిన సహింపజాలకుండుట ; ఎంతనెమ్మదిగా ముట్టుకున్నను ఓర్చుకొనలేకపోవుట. ముఖ్యముగా కాళ్లుముట్టుకున్న ఓర్చుకొనలేకపోవుట.

6 సంయోగానంతరము మిక్కిలి నీరసము. స్ఖలనమైన పిమ్మట, గర్భస్రావము గలిగినపిమ్మట, మిక్కిలి నీరసము ; కండ్లయందు నీరసము.

7 జీర్ణకోశము : కడుపుబ్బుట ; నొప్పిగానుండుట ; పగిలిపోవునట్లుండుట ; గాలివిస్తారముగ జేరుట ; తినినది త్రాగినది యంతయుగాలి క్రింద (Gass) మారిపోయినట్లు కనబడుట : (అయిడిన్).

8 తినునపుడు పండ్లుపోటు : చల్లటిపదార్థములు లేక వేడిపదార్థములు తగిలినపుడు ద్రేకించుట.

9 నడుమునొప్పి : నీరసము ; చమటపట్టుట ; గర్భస్రావమైనపిమ్మట ప్రసవమునందు, గర్భకోశ రక్తస్రావములయందు, అధికమైన నడుమునొప్పి. భోజనముచేయునప్పుడు కడుపునొప్పి ; నడుచునప్పుడు విస్తారమైన నడుమునొప్పి వచ్చి నడుచుటమాని పరుండవలసినంత నడుమునొప్పిగా నుండుట.

10 బహిష్టుకుముందు మిక్కిలి అస్వస్థతగానుండుట ; బహిష్టునందు బహిష్టుకుముందు నడుమునొప్పి.

11 ప్రసవనొప్పులు తక్కువగావచ్చుట ; నొప్పులసమయములో తీవ్రమయిన నడుమునొప్పి ; నడుము గట్టిగా నొక్కిపట్టియుంచవలసియుండుట (కాస్టికమ్).

12 క్షయ : ముందునకు వంగినను, కూర్చున్నను ఉపశమనముగనుండుట : రాత్రి రెండు మొదలు నాల్గుగంటలవరకు హెచ్చుగా నుండుట.

13 ఊపిరితిత్తులయందు పుండుపడిన రోగులకీ సోరాశాంతికరౌషధము ప్రయోగింపనిదే సరియైన స్వస్థతచేకూరదు (హెనిమాన్).

14 మలబద్ధము : గట్టిగా కష్టముమీద వెడలు పెద్దవిరేచనము ; విరేచనము వెడలుటకొరక గంటముందు శూలపోటువంటి పోట్లువచ్చుట.

15 శులభముగా జలుబుచేయుట.

N. B:—నేత్రమూరు అనుకూలించు ఔషధమయినప్పటికి అణిచిపెట్టబడిన ఋతువు జర్గించలేనపుడు యీ ఔషధము బహిష్టుకలుగజేయును. (హెనిమాన్)

కాలీఅయోడేటమ్ :— (శోరాదోషహరణకరము) (సైకోసిస్ దోషహరణకరము) (సిఫిలిస్ దోషహరణకరము)

**(Kali Iodatum)**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| గ్రంధులు (glands) | వేడి, ఒత్తిడి, స్పర్శ. |
| ముక్కు ; కండ్లు | రాత్రి, చెమ్మ. |
| ఊపిరితిత్తుల పైభాగము. | పాదరసము. |
| వంపుగానుండు భాగము. | గాలిమార్పు. |
| ఉదరముపైనుండు పొర. | చల్లటి ఆహారము. |
| | కదుపు, ఊగుట. |
| | **ఉపశమనములు.** |
| | చలనము, బహిరంగమయిన గాలి. |

1 పాదరసము విశేషముగా తీసికొనిన వ్యక్తుల కుపయోగించును.

2 రసదోషములకు సవాయిదోషములకు ఉపయోగించును.

3 గ్రంధులయొక్కయు (Glands) ఎముకలయొక్క వ్యాధులకు ఉపయోగించును.

4 సవాయి జీర్ణించుటచే కలుగు కంటివ్యాధులను మాన్పును. కండ్లు ఎర్రగానుండి నీళ్లు విస్తారముగ కారుచుండును.

5 సవాయివ్యాధి అన్ని అవస్థలలోను పనిజేయును.

ఆ యా అవస్థలలో ముఖ్యముగా :—

1 ప్రారంభస్థితి, విడుపుజ్వరము సాయంత్రము జ్వరముతగులుచు, రాత్రిభాగమున మిక్కిల చమటపట్టి తగ్గుట.

2 రెండవ అవస్థ :—ఆమత్వచలములు, (Mucous membrane) చర్మము పుండ్లుపడుట.

3 మూడవఅవస్థ :—వ్యాధి జీర్ణించి యముకలువాచుట. యముకలలో పుండ్లు బయలుదేరుట ఎముకలుపుచ్చుట.

6 మోకాళ్ళువాచి నీరుపట్టిన మేహవాతము (Rheumatism).

7 శరీరమంతయు నఖశిఖపర్యంతము సవాయిదోషముచేగాని రసదోషముచేగాని ఎర్రటి లేక గౌరవర్ణమైన దద్దుర్లు బయలుదేరుట.

8 సవాయి సంబంధమయిన పుండ్లు, బిళ్ళలు, అడ్డకర్రలు ఎముకలలో నొప్పులు ; అంగము ఎర్రగావాచి బాధగానుండుట ; సవాయి దోషమువలన వచ్చుకీళ్ళనొప్పులను వాపులను మాంసగ్రంథుల (Glands) వాపులను నివారణజేయును. కోడిజుట్టుసవాయిని నివారణజేయును. (తూజా).

9 క్షయవ్యాధి :—చిక్కగాను, ఆకుపచ్చగాను, పచ్చగాను, ఉప్పగాను యుండుశ్లేష్మము వెడలుట. చీమువంటి శ్లేష్మము వెడలుట.

---

## క్రియసోటమ్ :—(Kreosotum)

| స్థానములు. | | ఉద్రేకములు |
|---|---|---|
| ఆమత్వచలములు | జీర్ణమార్గమునందలి. ఇగుళ్ళయందలి : జీర్ణకోశమునందలి : ఉదరమునందలి. స్త్రీమూత్రావయవమునందలి. గర్భకోశమునందలి. | పండ్లువచ్చువయస్సు. గర్భిణీసమయము. విశ్రాంతి : శీతలము : భుజించుట పరుండుట. వేసవి : బహిష్టులో : సాయంత్రము 6 గంటలు మొదలు ఉదయం 6 గంటలవరకు ; |
| రక్తము : పండ్లు : | | |

ఉపశమనములు.

ఉష్ణము: ఉష్ణాహారము: చలనము;

1 ఆమత్వచలములనుండి (Mucous membrane) వచ్చు సమస్తస్రావములు వరుపు దురదకలుగజేయును: దుర్వాసనగాయుండును.

2 పసుపుపచ్చని కుసుమ వెడలుచు బట్టను మరకజేయును. కుసుమ ఆయా భాగములయందు ఉద్రేకము కలుగజేసి ఒరయునట్లు జేయును. దుర్వాసనగా యుండును.

---

లేకసిస్ :— (శోరాదోషహారణకరము) (సిఫ్లిస్ దోషహారణకరము)

**(Lachesis)**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| నరములు { చర్మసంబంధమైన : రక్తప్రసరణ సంబంధమయిన : చలనస్పర్శజ్ఞాన సంబంధమయిన. | నిద్రించినపిమ్మట. ఉదయమున. |
| రక్తము : హృదయము. | వేడి { వసంతఋతువు : వేసవి ; సూర్యరశ్మి : గది ; పానీయములు ; |
| ఎడమవైపు పిమ్మటకుడివైపు { కంఠము. స్త్రీఅండాశములు | ఊరకే గుటకవేయుట; ద్రవపదార్థములు గుటకవేయుట ; |
| స్త్రీలు. | ఓర్చుకొనలేకపోవుట { కొలదిగస్పృశించినను ధరించిన వస్త్రము లబిగి ; కంఠము చుట్టు ధరించిన వస్త్రము (ఎపిస్ బ్రోమి, గ్రాఫై) ధ్వని; |
| నడినెత్తి. | |

నిరోధించబడిన స్రావములు ;
బహిష్టు ప్రారంభమున ; బహిష్టు
నిలచిపోయినప్పుడు. ముట్లుడుగు
కాలములో ; సారాయము.

ఉపశమనములు.

బహిరంగమయినగాలి ;
జారీగా వెడలు స్రావములు.
గట్టిగా అదిమిపెట్టుట ; వ్యాధిగల
భాగమును తడుపుటవలన. చల్లటి
పానీయములు.

1 ముట్లుడుగుకాలములో సంభవించు వ్యాధులు బాధలు ; మూల శంఖ ; రక్తస్రావము ; ఉడుకు ; వెచ్చటి చమట. ముట్లుడిగిన పిమ్మట తలవేడిగానుండి తలపోటు వచ్చుట.

2 ఎడమభాగము ముఖ్యముగా వ్యాధిగ్రస్తమగుట ; వ్యాధులు ఎడమభాగమున జనించి కుడివైపునకు వ్యాపించును.

3 నాలుక బైటకు జాపినపుడు వణకును, లేక పండ్లవెనుక చిక్కు-పడును.

4 సకాలములో బహిష్టు జరుగుచున్నను, ఋతురక్తము తక్కువగా వెడలుట ; ఋతురక్తము స్రవించినపక్షమున అండాశయముల యందలి గర్భకోశమునందలి బాధతగ్గును. బహిష్టయినప్పుడు రోగి స్వస్తతగానుండును.

5 ముట్లుడుగుకాలములో సంభవించు ఉడుకు ; గర్భకోశరక్తస్రావములు.

6 మలబద్ధము ; విరేచనానుమానము లేకుండగనే ! మలము మలకోశమున జేరియుండుట ; ఆసనమున గసికియున్నట్లుండుట.

7 తలపోటు : నిద్రనుండి మేల్కాంచినవెంటనే తలపోటు ; నిద్రపోయిలేచిన తలపోటు వచ్చునను భయముచే నిద్రపోవుటకు భయపడుట ;

8 వ్యాధిలక్షణములన్నియు అందు ముఖ్యముగా మానసికలక్షణములు నిద్రనుండి లేచినపిమ్మట ఉద్రేకించును.

9 మూర్ఛ :—నిద్రలోవచ్చు మూర్ఛ (బ్యూఫో) : జీవ ద్రవములు పోవుటవలనవచ్చు మూర్ఛ ; మనమునందలి అసూయతచేతను లేక ముష్టిమైధునమువలనను సంభవించుమూర్ఛ.

10 నల్లటివర్ణము తోనుండు కురుపులు : రాచకురుపులు.

11 ఉదయమున లేచినవెంటనే శరీరమునందు మనస్సునందు విపరీతమైన నీరసము.

12 కడుపుమీాద కంఠముచుట్టు వస్త్రముధరించి యుంచుకొనలేకపోవుట.

---

## లెడమ్ :—(Ledum) (శోథాదోషహరణకరము)

| స్థానములు. | | ఉద్రేకములు | |
|---|---|---|---|
| ధాతుమజ్జాతంతువులు. | చిన్న కీళ్ళయందలి మణమలలోని ; కండ్లలోని. స్నాయువుల యందలి. | ఉష్ణము ; | దుప్పట్లు. స్టౌవ్. గాలి |
| | | గాయము ; చలనము ; రాత్రి ; | |

రక్తప్రసరణ తంతువులు. { చర్మమునందలి. ఊపిరితిత్తుల యందలి.
రక్తము ; ఉదరము పై భాగము.
నరములు ; ఎడమభాగము ;

ఉపశమనములు.

చన్నీళ్ళలో తడుపుట. స్నానము. చల్లటిగాలి ;

1 మేహావాత ఆమవాత నొప్పులకు పనిజేయును. ముఖ్యముగా చిన్న కీళ్లకు (small joints) కలుగు ఆమవాతనొప్పులకు (Gout) పని జేయును. పడక వేడిమి భరించలేకపోవుట. శరీరముపై బట్టతీసి వైచి పరుండుట.

2 మేహావాత ఆమవాత కీళ్లనొప్పులు (Rheumatism and Gout) క్రింద అవయవములలో ప్రారంభించి పై అవయవములకు వ్యాపించును. (పై అవయవములలో ప్రారంభించి క్రింది అవయవములకు వ్యాపించునప్పుడు కల్మియా) కీళ్లువాచి మిక్కిలి బాధగాను సలుపుగాను యుండుట.

3 ఎడమభుజమునకు కుడిచట్టకు వచ్చువ్యాధి (ఎగరికస్, ఏంటింటార్టు, స్ట్రెమోనియమ్.)

4 వ్యాధిగ్రస్తమైన భాగము ఎండిపోవుట. (గ్రాఫైటీస్.)

5 మోకాలువరకు వాచుట. సీలమండివాచి నడచునప్పుడు విపరీతమైన బాధగానుండుట. కాలిబొటనవ్రేలు వాచి నొప్పిగానుండుట. మణమ చితుకకొట్టినట్లు నొప్పిగానుండుట.

6 సీలమండియందు కాళ్లయందు విపరీతమైన దురద. పడకవేడిమి వలనను గోకుటవలనను, యీదురద ఉద్రేకించును (రూస్, పల్సు).

7 పాదము, సీలమండి సులభముగా బెణుకుట (కార్బోవె).

8 సూదిమొనగల ఆయుధములవలన కలుగు గాయములు, దెబ్బలు, మేకులు మొదలగునవి గ్రుచ్చుకొనుటవలన కలుగు గాయముల యందలి బాధను మాన్పును. విషజంతువులు కుట్టుటవలన కలుగు బాధను మాన్పును. ఎలుకకాటువలన కలుగు దోషములను పోగొట్టును.

---

లిలియమ్‌టిగ్ :— { (శోకాదోషహరణకరము) (సూడోసోరిక్)

**(Lilium Tig)**

స్థానములు.

రక్తప్రసరణము { స్త్రీ మర్మావయవములు. గర్భకోశము : స్త్రీ అండాశయములు. హృదయము. ఆసనము. మూత్రకోశము.

ఎడమభాగము.

నరములు.

ఉద్రేకములు

ఉష్ణము : గదిలోనుండు వేడి ; చలనము: గర్భస్రావము. నడుచుట: నిలువబడుట ; ఓదార్పులు.

ఉపశమనములు.

చల్లని బహిరంగమైనగాలి.

విరామము లేకయున్న శ్రమ.

ఎడమభాగమున పరున్న.

సూర్యాస్తమాన మైనపిమ్మట. (మెడో, సెలీని).

అదిమిపట్టుట : కాళ్ళు ఒకదానిపై నొకటి వేసికొనుట.

1 పనులు కంగారుగాజేయుట.

2 పొత్తికడుపు నిగలాగుట ; గర్భకోశమువద్ద బలువుగానుండి క్రిందికి పడుచున్నట్లుండుట. మర్మావయవమును చేతితో గట్టిగా నొక్కిపట్టిన తగ్గినట్లుండుట (సిపియా.)

3 హృదయమువద్ద నొక్కిపట్టుచున్నట్లు పోటుగానుండుట ; హృదయము చురుకుగా కొట్టుకొనుట ; నిమిషమునకు 150 నుండి 170 వరకు కొట్టుకొనుట.

4 హృదయము బిగబట్టినట్లుండుట

5 గర్భాశయమునకు, స్త్రీ అండాశయమునకు సంబంధించిన వ్యాధులపై ఆధారపడివచ్చు గుండెజబ్బు.

6 బహిష్టు : నల్లగాను, దుర్వాసనతోను కొలదిగాయగుట ; నడుచునపుడే స్రవించుట ; నడచుటమానిన స్రావము ఆగిపోవుట.

---

## లైకోపోడియమ్ :— (Lycopodium)

(సోరాదోషహరణకరము.)
(సైకోసిస్ దోషహరణకరము).
(సిఫిలిస్ దోషహరణకరము)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| జీర్ణపోషకము: జీర్ణావయవమార్గము. | ధరించిన బట్టల బిగువు. |
| కాలేయమునకు రక్తమును దీసికొనిపోవు నాళనిర్మాణము. | ఉష్ణము, మేల్కొనుట, గాలి. |
| చర్మము. | భుజించుట, తృప్తిగాభుజించుట. |
| మూత్రావయవములు. | అజీర్ణము. సాయంత్రము 4 గం॥ మొదలు 8 గంటలవరకు. |

| | | |
|---|---|---|
| కుడివైపునుండి ఎడమవైపుకు | కంఠము. గుండెలు. స్త్రీ మర్మావయవము. | ఉపశమనములు. |
| మెదడు. | | ఉష్ణపానీయములు; వేడి ఆహారములు మొదలగునవి. |
| ఊపిరితిత్తులు. | | చల్లనిపట్లు. |
| | | చలనము, త్రేణుపులు. |
| | | మూత్రవిసర్జనము. |

1 కడుపులో గాలిజేరి విస్తారముగ ఉబ్బరించుట : నిండుగాయుండుట: త్రేణుపులువలన తగ్గుట (త్రేణుపులవలనగూడ ఉబ్బరింపు తగ్గకపోవు లక్షణము చైనాకు గలదు.)

2 విపరీతమైన ఆకలి; తినినకొలది వాంఛ ఎక్కువగుట; తినిన పక్షమున తలపోటువచ్చుట; మంచి ఆకలియున్నను కొలది కబళములు తీసికున్న వెంటనే కడుపునిండిపోయి ఉబ్బరించినట్లుండుట; కడుపు దిగువభాగమున పెద్దశబ్దముతో గుడగుడలాడుట; నిరంతరము కడుపులో గుడగుడలాడుచుండుట.

3 విపరీతమయిన నడుమునొప్పి; మూత్రవిసర్జనము గావించినపిమ్మట తగ్గుట; మూత్రము దిగువను యిటుకపొడుమురంగువంటి మడ్డి దిగుట;

4 శ్వాసావయవ సంబంధమయిన వ్యాధులలో ముక్కుద్వారములు (Alae) ముఖ్యముగా పిల్లలలోను యువకులలోను విసనకర్రవలె ఆడుచుండుట (ఫాస్ఫరస్, యాంటిటార్టు).

5 లక్షణములు సాయంత్రము 4, 8 గంటలమధ్య ఉద్రేకించును.

6 నపుంసకత్వము. యువకులకు ముష్టిమయిథునమువలనగాని అధికసంభోగమువలనగాని పుంసత్వము సంభవించుట; పురుషాంగము చిన్నదై చల్లగా, ముడతలు బడియుండుట; వృద్ధులయందు

సంభోగవాంఛ బలముగాయుండి లేపనము లేకపోవుట: ఆలింగనములో నిద్రించుట; సంభోగమునందు అతిశీఘ్రముగ స్ఖలనమగుట.

7 స్త్రీ మర్మావయవము ఆరుకుపోయి పొడిగానుండుట సంయోగ సమయమున, సంభోగానంతరము మర్మావయవము మండుట.

8 విరేచనము వెళ్ళుసమయమున మర్మావయవమునుంచి రక్తము స్రవించుట.

9 కుడివైపు గిలక.

10 రొమ్ము పడిశము (Pneumonia): చికిత్స అశ్రద్ధ చేయబడిన లేక సరిగా చికిత్సచేయబడని న్యూమోనియా; ఊపిరితిత్తులనుండి సత్వరముగ శ్లేష్మమును హరింపజేయును. ఈవ్యాధిలో శ్లేష్మము పసుపుపచ్చగను, ఒక్కొక్కప్పుడు దుర్వాసనతోను వెడలుచుండును. గౌరవర్ణముగా వెడలు శ్లేష్మమునకుగూడ పనిజేయును.

11 మలబద్ధము; స్త్రీ ఋతుమతియైనప్పటినుండియుగల మలబద్ధము; వెనుక ప్రసవమయినప్పటినుండియుగల మలబద్ధము; పిల్లలమలబద్ధము; మూలశంఖ.

12 దీర్ఘకాలమునుండి వృద్ధిజెందు దీర్ఘవ్యాధులు.

13 బాధలు కుడివైపునుండి ఎడమవైపునకు విస్తరించును. (ఎడమవైపునుండి కుడివైపునకు లేకసిస్).

14 పిల్లలు పగలంతయు ఏడ్చుచుండుట. బ్రతిమాలినను ఊరకోనక పోవుట.

15 పిల్లలు నీరసముగానుండి శుష్కించుట.

16 పాలిపోయి, మరికిఛాయతో అనారోగ్యముగా నుండుట; శరీరము ముడుతలుపడి చిక్కి తనవయస్సుకంటె నెక్కువ వయస్సు గలిగి యున్నట్లు గనపడుట.

N. B:— స్పష్టముగ వ్యాధిలక్షణములకు సారూప్యమైయుండని పక్షమున దీర్ఘవ్యాధుల చికిత్స నీ యౌషధముతో ప్రారంభింపరాదు; ప్రథమమున మరియొక శోరాశాంతికర ఔషధము ప్రయోగించుట ఉత్తమము. ఈ ఔషధము చాలదీర్ఘముగ పనిజేయు ఔషధముగాన సుగుణము యగుపించిన పిమ్మట తిర్గి మోతాదులు ప్రయోగించరాదు. ప్రతి ఎనిమిది దినముల కొకసారి కార్బోవెజ్ ఒక్క మోతాదు యిచ్చుచుండిన లైకోపోడియంగుణమును అనుకూలపరచును. (క్లార్కు)

---

మెగ్నీషియా కార్బ:— { (సోరాదోషహారణకరము.) (సైకోసిస్‌దోషహారణకరము.) }

**(Magnesia Carb)**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| ముఖము ఎముక; | రాత్రి; విశ్రాంతి; ధ్వని. |
| జీర్ణమార్గము { జీర్ణకోశము. మలకోశములు కాలేయము. } | శీతలము, గాలిమార్పు; |
| | ఆహారము; పాలు; పిండిపదార్థములు. సల్పుకారణములు; స్పర్శ మొదలగునవి. |
| | పిల్లలు; ప్రాలుత్రాగు శిశువులు. |
| | **ఉపశమనములు.** |
| | చలనము; నడచుట. |
| | బహిరంగమయినగాలి. |

1 ఆమ్లయుత అజీర్ణము ; పాలు త్రాగినపిమ్మట కలుగు అజీర్ణము ; త్రాగిన పాలు పులియుట ; కేబేజీ, బంగాళాదుంప మొదలగు పదార్థములను భుజించినపిమ్మట కలుగు అజీర్ణము.

2 ముఖ్యముగా పిల్లలలో కలుగు నురగతోకూడిన ఆకుపచ్చని విరేచనములు. పులిత్రేణుపులు, కడుపులో బిగబట్టుచున్నట్లుపోట్లు ; పిల్లలు త్రాగిన పాలు అరుగక పాలవలెనే విరేచనములగుట.

3 తిమ్మెరతోకూడిన పోట్లు ; ముఖ్యముగా ముఖమునందు తిమ్మెరతో కూడిన యిట్టిబాధ ; చురుకుచురుకుమని మెరుపువలె వచ్చు యిట్టి పోట్లు రాత్రిభాగమున అధికమగుట ; యీబాధచే అస్థిమితము : లేచి యిటునటు తిరుగవలసియుండుట.

4 నిద్రవలన సుఖము లేకపోవుట ; నిద్రించుటకు ముందుకంటె నిద్ర నుండి మేల్కాంచినపిమ్మట మిక్కిలి బడలికగానుండుట (బ్రయో, కోనియమ్, హెపార్, ఓపి, సల్ఫరు).

---

## మెగ్నిషియామూర్ :— { (సోరాదోషహారణకరము.) (సైకోసిస్‌దోషహారణకరము.)

**(Magnesia Mur)**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| నరములు. | కుడిప్రక్కను పరుండుటవలన. |
| కాలేయము. | రాత్రి; ధ్వని; సముద్రస్నానము. |
| జీర్ణశక్తి. | భుజించుట. ఉప్పుకలసిన పదార్థములు. |
| గర్భకోశము. | **ఉపశమనములు.** |
| మలాశయము. | గట్టిగా అదిమిపట్టుట ; |
| స్త్రీలు. | |

వంగి పరుండుట.
క్రిందకు వ్రేలాడుట.
నెమ్మదిగా కదల్చుట.
చల్లని బహిరంగమైనగాలి.

1 మలబద్ధము ; మలము గట్టిగా రాళ్ళవలె పిష్టముకట్టి మేకపెంటికల వలె, వెడలుట ; ముఖ్యముగా, పెద్దఊసర కడుపుగల పిల్లలలో వెడలు నిట్టి విరేచనము. మరియు పిల్లలకు పండ్లు వచ్చుకాలములో నిట్టి విధమగు విరేచనమగుట ;

2 పండ్లు వచ్చుకాలములో పిల్లలకు కలుగు అజీర్ణము ; పాలు జీర్ణ కోశమున బాధకలుగజేసి, జీర్ణము కాకుండగనే విరేచనమగుట.

3 పండ్లపోటు ; ఆహారము పండ్లకు తగిలినంతమాత్రమున సహింప జాలకపోవుట.

4 తలకు చెమటపట్టుట. (కల్కేరియా, సిలికా).

---

## మెడోరినమ్ :— (సైకోసిస్‌దోషహరణకరము.)

(Medorrhinum)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| మనస్సు ; నరములు. | చమ్మ ; శీతలము. |
| ఆమత్వచలములు. | పగలు ; తెల్లవారుఝాము 3, 4 గంటలకు. మూత్రము విసర్జించిన |
| మజ్జానులు. | పిమ్మట. స్పర్శవలన ; తలుపులు |
| ఊపిరితిత్తులు. | వేసిన గదిలో. |
| మస్తిష్కము. | |

| | |
|---|---|
| కీళ్ళు. | **ఉపశమనములు.** |
| వెన్నెముక. | కడుపుపై పరుండుటవలన; |
| మూత్రపిండములు. | వెనుకకు వంగుటవలన. |
| ఎడమ స్త్రీ అండాశయము. | బహిరంగమైన మంచిగాలి. |
| | కప్పుకొనకుండుటవలన |
| | గట్టిగా రాయుటవలన: |
| | సముద్రముదరిని; |
| | సూర్యాస్తమానమైనపిమ్మట |
| | (సెలీని). |

1 సెగను ఇంజక్షనులు మొదలగు చికిత్సవలన అణచిపెట్టుటమూలము నను లేక సరిగా యీవ్యాధిని చికిత్స చేయకపోవుటమూలముననుసంభవించు దీర్ఘవ్యాధులను నివారణజేయును. వ్యాధిలక్షణముల కనుకూలమైన ఔషధమును ప్రయోగించినపుడు సుగుణము యగుపడకపోవుట, లేక శాశ్వితముగ నివారణ యవకుండుట, మొదలగు పరిస్థితులలో చక్కగా పనిచేయును.

2 సెగ సంబంధమైన వ్యాధినుండి జనించిన దీర్ఘకాలమునుండిగల మేహవాతము (Chronic rheumatism): ఆమవాతము (Gout) తిమ్మిరి (Neuralgia): వెన్నెముకకు సంబంధించినవ్యాధులు; పక్షవాతము.

3 సెగ సంబంధమైన వ్యాధినుండి, జనించిన, స్త్రీలయొక్క అండాశయమునకు సంబంధించిన వ్యాధులు; అండాశయము వాచి ఉద్రేకించుట; ఈవ్యాధి నిలువజబ్బుయగుట; అండాశయమునుండి గర్భకోశమునకువచ్చు వాహిక (Fallopian tube) వాచి ఉద్రేకించుట; పొత్తికడుపునందలి కండరములు వాచి ఉద్రేకించుట: గర్భా

శయమున కంతులు బయలుదేరుట, కండరములు గట్టిపడుట; అండాశయమునందు, గర్భకోశమునందు, కండరములు గట్టిపడుట, కంతులు బయలుదేరుట.

4 సెగ సంబంధమైన వ్యాధినుండి జనించిన విషకంతులు రణములు.

5 పిల్లలు, ఎముకల సంబంధమైన వ్యాధితోనుండుట; సరిగా ఎదుగక మరగుజ్జుయగుట (బరేటాకార్బ); నీరసముగానుండుట.

6 శరీరమంతయు విశేషమైన ఉష్ణముతో, కండరములు వాచి చితుక కొట్టినట్లుండుట.

7 శరీరమంతయు వణకుట: విపరీతమైన నరముల సంబంధమైన నీరసము.

8 బుద్ధిమాంద్యము; మాట్లాడుచు ముందుసంగతి మరచిపోవుట; ఆప్తమిత్రుల పేర్లనుగూడ మరచిపోవుట; ఏడ్వకుండ మాట్లాడ లేకపోవుట; మిక్కిలి ఆతురత; పిసినిగొట్టుతనము; ప్రొద్దుపుచ్చుటమిక్కిలి కష్టముగానుండుట (అల్యూమినా, అర్జంటమ్‌నైట్ర్) రోగి తనకు మతిచెడునని భయపడుట; ఆత్మహత్యగావించుకొనవలయునను ఆలోచనలతో, విచారగ్రస్తముగ నుండుట.

9 తలలో విపరీతమయినమంట. బలువుగానుండుట; చుంద్రుపట్టి దురద.

10 కంఠము వాచి నొప్పిగానుండి, ఘనపదార్థములనుగాని ద్రవపదార్థములనుగాని తీసికొనుటకు అవకాశము లేకపోవుట; నిరంతరము కంఠమున చిక్కటి గౌరవర్ణమువంటిగాని, లేక రక్తవర్ణమువంటిగాని శ్లేష్మము చేరియుండుట.

11 భుజించినవెంటనే విపరీతమైన ఆకలి (లైకో, సోరినమ్).

12 నిరంతరము దాహము ; దాహము త్రాగుచున్నట్లు కల గనుచుం డుట. (ఆర్సు ; ఫాస్ఫరస్).

13 ఆసనము బిగపట్టుట ; విరేచనము బంతులవలె వెడలుట ; జిగురు వంటి, విరేచనము వెడలుట ; ఆసనమున సూదులు గుచ్చుచున్నట్లు పోటు ; ఆసనమున విపరీతమయిన దురద.

14 మూత్ర విసర్జనము చేయుచున్నపుడు మూత్ర కోశమునందు, మల కోశమునందు, విపరీతమయిన తీపు ; నడుమునందు విపరీతమయిన బాధ ; మూత్రము జారీగ వెడలినప్పిమ్మట తగ్గుట. (లైకో) ; ప్రతిరాత్రియందు, ముదరరంగుతో కూడిన మూత్రము విస్తార ముగ వెడలుట ; మూత్రము నెమ్మదిగా వెడలుట.

15 ఋతుస్రావము, దుర్వాసనగను నల్లగను, ముద్దలుగను, విస్తారము గను వెడలుట. కడిగినను యీమరకలు వదలకుండుట. ముట్లుడుగు కాలమున గర్భాశయ అధికరక్త స్రావములు. నల్లటిరక్తము దుర్వా సనతో విస్తారముగా వారములకొలది స్రవించుట ; లేచి నడచు నపుడెల్ల విస్తారముగ స్రవించుట ; గర్భకోశమునకు సంబంధించిన కఠినమయిన వ్యాధులను నివారణజేయును.

16 విపరీతమయిన బాధతో కూడిన ఋతుశూల ; విపరీతముగ క్రిం దకు దిగలాగుచు ప్రసనవేదనవంటి బాధ.

17 కుసుమ పల్చగా నీచువాసనతో వెడలుట ; కుసుమచే మర్మావ యవమంతయు వరయుట ; మర్మావయవమున గనేరియా సంబంధ మయిన సురుపుడుకాయలు.

18 వంధ్యాత్వము : స్థనములు నొప్పిగాయుండుట.

19 స్వప్నస్ఖలనములు : పిమ్మట విపరీతమయిన నీరసము : నపుంస కత్వము : పురుషమర్మావయవమునుండి సెగ స్రావము (Gleet)· అంగమంతయు నొప్పిగా నుండుట.

20 క్షయ : పగర్పు : గుండెలలో నొప్పి : శ్లేష్మము తెల్లగా నురుగతోకూడి వెడలుట : శ్లేష్మము తెగిపడకుండుట : చేదుగానుండి ఆకుపచ్చని శ్లేష్మము ఉండలవలెపడుట : శ్వాస పైకి విడువలేక పోవుట : కడుపుమీద పరున్న దగ్గు శాంతించుట.

21 రెక్కగూడులమధ్య నొప్పి : వెన్నెముకయంతయు, ముట్టుకున్న నొప్పిగాయుండుట. విపరీతమయిన మంట మెడవద్ద బయలుదేరి, వెన్నెముక పొడుగునను వ్యాపించి, బిగబట్టినట్లు బాధగానుండుట.

22 ముడ్డిపూస విస్తారమయిన బాధగానుండి చట్టలలోనుండి కాళ్ళకు బాధ పొడుచుచుండుట.

23 రాత్రియంతయు కాళ్ళులాగుచు యీబాధ నిద్ర లేకుండజేయుట. కీళ్ళయందుగల బాధచే కాళ్ళను నిరంతరము నిటునటు కదలించుట లేక తన్నుకొనుచుండుట (జింకమ్).

24 కాళ్ళయందు చేతులయందు విపరీతమయిన మంట (సల్ఫర్, లేకసిస్) : ఈమంట బాధచే నిరంతరము విసరుకొనవలసియుండుట ; కాళ్లయందు, చేతులయందు విపరీతమయిన నీరసము.

25 శరీరమునందలి ప్రతికీలు వంగక బిగపట్టి బాధగానుండుట.

26 కాళ్లయందలి కీళ్లు వికృతరూపముగమారి అంగవైకల్యము నొందుట. వ్రేళ్లయొక్క కీళ్లు లావుగాను పెద్దవిగాను యుండుట. శీలమండలు బిగబట్టి బాధకరముగావాచుట. మణమ నొప్పిగానుండుట. కీళ్లువాచుట.

27 వ్యాధి లక్షణములు సూర్యోదయముమొదలు సూర్యాస్తమానము వరకు ఉద్రేకించును (సిఫిలినమునకు వ్యతిరేకము). తన వ్యాధినిగూర్చి తలంచునపుడు బాధలుద్రేకించును. కదలికవలన ఉద్రేకించును. సముద్రతీరమున శీతగాలివలన బాధ లుపశమించును.

N. B :—సల్ఫరునకుగల కాళ్లమంటలు, జింకమ్ నకుగల కాళ్లు కదల్చుట యీరెండును ఒకేకాలమున నీయౌషధమునకుగలవు.

---

## మెర్క్యురీసాల్ :— (సిఫిలిస్ దోషహరణకరము)

**(Mercurius Sol)**

**స్థానములు.**

రక్తము.

అమత్వచలములు.

గ్రంధులు — ముఖమునందలి లాలాజల. గవదల. కంఠమునందలి. శోషరస కాలేయ. మూత్రపిండముల. ఆమసంబంధమైన.

మర్మావయవములు

రక్తకరధాతు మజ్జాదులు.

కీళ్ళు.

ఎముకలు ; చర్మము

**ఉద్రేకములు.**

రాత్రి ; రాత్రినాయువు ;

చమటపట్టుట ;

కుడిప్రక్కను పరుండుట.

పడకవేడి, నిప్పుశెగవలన ఉద్రేకము ; ఉష్ణము.

భరించలేకపోవుట. — తలకు గాలి. మబ్బుగాలి ; తేమగాలి ; శీతలగాలి ; ఉష్ణము ; శీతలము.

నిప్పు వెలుతురు ; తడికాళ్ళు.

**ఉపశమనములు.**

సౌమ్యమయిన శీతోష్ణము.

1 ఎముకలసంబంధమైన వ్యాధులలో రాత్రిభాగమున విపరీతమైన పోట్లు : చీముపట్టిగాని, పట్టకగాని కండరములు గ్రంథులు (Glands) వాచుట.

2 పంటియిగుళ్లు (Gums) వాచి, ముట్టుకున్న నొప్పిగాయుండుట. పండ్లనుండి రక్తము స్రవించుట : నోటినుండి దుర్వాసనవచ్చుట.

3 నాలుక తేమగానుండి విపరీతమైన దాహము.

4 నాలుకవాచుట : కదల్చుటకు కష్టముగా నుండుట.

5 పండ్లు కదలుచుండుట : ఊడిపోవుట ; పండ్లు నల్లబడుట ; ఇగుళ్ళు పుండుబడుట.

6 ఋతుకాలమున, అస్థిమితము, నోటియందు అరుచి, నాలుక ఎర్రబడుట. నాలుకపై నల్లనిమచ్చలుండుట. నాలుక మంటగానుండుట : యిగుళ్ళు అనారోగ్యముగా రంగుమారి యుండుట.

7 కుసుము : ఎల్లపుడు రాత్రిభాగమున హెచ్చుగానుండుట ; దురద; మంట ; చురుకుపోటుతో, కూడినకుసుమ. మర్మావయవభాగము వరసి మంటగానుండుట. మర్మావయవమునకు మూత్రముతగిలిన దురద, బాధహెచ్చగుట : వెంటనే నీటితో ఆభాగము కడుగవలసి యుండుట (సల్ఫర్).

8 మర్మావయవములయందు దురద : మూత్రమీ భాగములయందు నిలచినపుడు లేక యీ భాగములకు తగిలినపుడు యీ దురద హెచ్చగుట.

9 శరీరమున సవాయిసంబంధమైన రాగిరంగుమచ్చలు.

10 తలమీద, శరీరముమీద, అంగముమీద చీముతోకూడి బాధలేని పల్చనిపుండ్లు : సవాయిపుండ్లు ; విస్తరించుపుండ్లు ; అండాకారము

గాను, ముర్రికిగాను యుండుపుండ్లు: వీనినుండి రక్తము స్రవించుట. పుండ్లు మాంసకండలవలెనుండి వానినుండి తరుచు రక్తము స్రవించుట.

11 శూల: విరేచనమగునపుడు, విరేచనానంతరము తీపుగాను, మంటగాను యుండుట. చలిగానుండుట.

12 కుడివైపు పరున్న కాలేయమునందు బాధ హెచ్చగుట: ప్రేగులు (intestines) చితుకగొట్టినట్లు నొప్పిగాయుండుట.

13 ఎముకలువాచి రాత్రి విస్తారముగా పోటువచ్చుట. ఎముకలలో పొడుచుచున్నట్లు బాధ.

14 రాత్రి చల్లటివిస్తారమైన చెమటపట్టుటచే ప్రక్కనుండిలేచి తిరుగవలసి యుండుట.

15 ప్రతిబాధలోను విస్తారమైన చెమటపట్టుట. ఈ చెమటవలన నెట్టి స్వస్తతయు గలుగకుండుట.

16 ఏమాత్రము కదలినను వణుకు విస్తారమైన నీరసము.

17 శరీరము, శ్వాస మిక్కిలి దుర్వాసనగా నుండుట (సోరినమ్).

18 వాపులు: కురుపు ఎదుగుట చీముపట్టుట: ఈ ఔషధమును చిన్నపొటెన్సీలలో ప్రయోగించిన వెంటనే కురుపు చీముపట్టి చితుకును.

19 గ్రహణి: విరేచనము చీముర క్తముతో కలసివెడలును. ఆసనమున విపరీతమైనతీపు: విరేచనానుమానము తీరక చాలసేపు కూర్చుండును. పిమ్మటచలి.

20 గదవులవ్యాధి: గదవులు కొండనాలుకవాచి, బాధగానుండుట: కొండనాలుక వాలుట: నిరంతరము గుటకవేయుచుండుట.

21 త్రాగిన నీటికంటె విస్తారముగ మూత్రము వెడలుట. తరుచు మూత్రానుమానము.

22 స్ఖలనముచే బట్టపై రక్తవర్ణమువంటి మరకయగుట (లెడమ్, సార్సపరిల్లా).

23 బహిష్టయినపుడెల్లను స్తనములు బాధగానుండుట (కోనియమ్, లాక్ కానియమ్) : బహిష్టుకు బదులుగా స్తనములయందు పాలు వచ్చుట.

24 దగ్గు : నీరసముకలుగజేయు పొడిదగ్గు, రాత్రి హెచ్చుగా రెండు పర్యాయములువచ్చుట : పడక వేడిమికి వృద్ధియగుట. కుడివైపున పరుండలేకపోవుట.

25 కుడిఊపిరితిత్తి చెడి, వెన్నులోనికి పోటువచ్చుట. (చెలిడోనియమ్, కాలీకార్బ).

26 న్యూమోనియాలో ఊపిరితిత్తులనుండి రక్తము పడినపిమ్మట ఊపిరి తిత్తులు చీముపట్టుట.

27 విస్తారమైన లాలాజలము స్రవించుచు నాలుక, యిగుళ్లు, దవడలు, కంఠము, పుండ్లుపడుట : యీ భాగములయందు సవాయిసంబంధమైన పుండ్లు : ఈ పుండ్లుచుట్టు రాగిరంగు ఆకారముండుట.

N. B :—సిలీకాను ముందుగాని వెనుకగాని వాడరాదు. అట్లు వాడవలసివచ్చిన మధ్య హెపార్ సల్ఫు ప్రయోగించి వాడవచ్చును. చిన్నపొటెన్సీలో నిచ్చిన కురుపులకు చీముపట్టి చితుకును. హెచ్చుపొటెన్సీలో ప్రయోగించిన చీము హరింపజేయును.

## మెర్క్యురీకార్ :—(Mercurius Cor)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| మలాశయము : మూత్రకోశము. | మూత్రము విసర్జించినపిమ్మట. |
| కండ్లు. | విరేచనమైనపిమ్మట. |
| కంఠము : కొండనాలుక, అంగుడి: కంఠమునందలి లోపలి యిరు పార్శ్వములు. | గుటకవేశిన పిమ్మట. |
| మూత్రపిండములు. | రాత్రి : శీతలము : వసంతరుతువు. |
| పరుపుగానుండు ఎముకలు. | ఉష్ణాధిక్యమైన దినములు. |
| | శీతలముగనుండు దినములు. |
| | రాత్రులు. |
| | ఆమ్లపదార్థములు. |

1 ముక్కులు వరసి విస్తారముగ ద్రవించు రొంప : ముక్కురంధ్రములు నొప్పిగాయుండుట.

2 గ్రహణి : రక్తవర్ణముగ చీము తరుచుగా విస్తారమయిన మంట తీపుతోకూడి విరేచనమగుట. కొంచెము, కొంచెముగా నిట్టిరక్తవర్ణముగల చీము, మిక్కిలి బాధకరమగు తీపుతోను విరేచనానుమానముతోను తరుచుగా వెడలుచు విడువక బాధించుట ; కడుపులో విపరీతమయిన పోటు ; కోయుచున్నట్లు బాధ ; ఆసనము మంట ; మూత్రకోశమున, ఆసనమున తీపు.

3 మర్మాంగముపై నవాయిపుండు ; కొరుకుపుండు ; పుండుచే అంగము ముక్కలుముక్కలుగా తెగిపడిపోవుట ; ఈపుండునుండి దురదతోకూడిన చీము స్రవించుచుండుట.

4 మేయి మొదలు నవంబరునెలవరకు, యీనెలలలో కలుగుగ్రహణి విరేచనములు. ప్రేగుల సంబంధమయిన (Intestinal Canal) వ్యాధులు.

5 ఆసనము తీపు ; విరేచనమయినపిమ్మటకూడ శాంతింపకుండుట ; విరేచనము కొలదిగను, వేడిగను, రక్తము, చీముతోకలసి మర్వా సనగను వెడలుట.

6 మూత్రక్లేశము తీపు (Tenesmus) : మూత్రవాహికయందు విపరీతమయిన మంట, మూత్రము కొలదిగను వేడిగను వెడలుట; మూత్ర మణచిపెట్టబడుట ; విపరీతమయిన బాధతో చుక్కలు చుక్కలుగా మూత్రము వెడలుట ; మూత్రముతో శ్వేతధాతువుపోవుట (Albumin). మూత్రమున దిగువను రక్తవర్ణము లేక యిటుకపొడుము రంగువంటి మడ్డిజేరుట :

7 శగ ; రెండవయనస్థ ; అంగమునుండి ఆకుపచ్చని స్రావము వెడలుట రాత్రి హెచ్చుగుట ; విపరీతమయిన మంట తీపు.

---

## మెజీరమ్ :— (Mezerum)

(శోరాదోషహరణకరము)
(సైకోసిస్ దోషహరణకరము)

**స్థానములు.**

చర్మము.

నరము లు, ఎముకలు — తలయందలి. ముఖమునందలి. దౌడలయొక్క.

ఒకప్రక్కను.

**ఉద్రేకములు.**

రాత్రి ; అణచిపెట్టుట.

పడకవేడి : నిప్పువేడి మొదలగునవి

శీతలగాలి ; చమ్మ ;

చలనము ; స్పర్శ ;

పాదరసము ; టీకాలువేయుట.

**ఉపశమనములు.**

కప్పుకొనుట (నరములు,ఎముకలు)

భుజించుట ; బహిరంగమయిన గాలి ;

1 తలయంతయు, చీముతోకూడి పక్కులుకట్టిన పొక్కులతోకూడి జుట్టంతయు అట్టలు కట్టుట

2 ముఖము పొక్కులలోనుండి విపరీతమైన దురదచే నిరంతరము బరుకుచుండుట. ఇట్లుబరుగుటచే పక్కులూడి రక్తము స్రవించుట: యీ పొక్కులు తిరిగి పక్కులుగట్టుట.

3 టీకాలు వేసినపిమ్మట వచ్చు మంత్రపుపొక్కులు: దురదతో కూడిన పొక్కులు.

4 కట్టుకున్న బట్ట పొక్కులకంటుకొని, బట్ట ఊడదీసినపక్షమున రక్తము స్రవించుట

5 పెద్దయెముకలలో బాధ రాత్రిభాగమున ఉద్రేకించుట: ఎముకలు ముఖ్యముగా పెద్ద ఎముకలు వాచుట: సలుపుట: సుఖసంబంధమైన వ్యాధులవలనను, పాదరసమును దుర్వినియోగపరచిన పిమ్మటను కలుగు నిట్టిబాధలు.

---

## మిల్లిఫోలియమ్ :— (సూడోసోరిక్)

**(Millefolium)**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| రక్తవాహికలు { ఊపిరితిత్తులలోని. ముక్కునందలి. గర్భకోశమునందలి. | గాయములు : తీవ్రమైనవ్యాయామము ; |
| | **ఉపశమనములు.** |
| | రక్తముకారుట : స్రావము ; |

1 జ్వరములేకుండగను ఎట్టివిధమగుబాధలు లేకుండను గలుగు రక్తస్రావములు (Hæmorrhages) రక్తస్రావములో పల్చటి ఎర్రటి

రక్తము స్రవించుట. (ఎకొనైట్, ఇపెకాక్, సెబీనా) ఊపిరితిత్తుల నుండి, కంఠమునుండి, నోటినుండి, ముక్కునుండి, జీర్ణకోశమునుండి మూత్రకోశమునుండి, గర్భకోశమునుండి, ఆసనమునుండి రక్తము స్రవించుట (Hemmorrhages): దెబ్బలు తగిలినమీఁదట రక్తము స్రవించుట (ఆర్నికా). గాయములనుండి రక్తము స్రవించుట (హేమామలిస్).

2 గర్భస్రావమునకు పిమ్మట, ప్రసవమైనపిమ్మట విస్తారముగ స్రావము గలుగుట.

3 సకాలమునకుమున్నే బహిష్టయి విస్తారముగ చాలదినములవరకు ఋతురక్తము స్రవించుట.

---

## మూరియాటిక్ యాసిడ్ :- (శోరాదోషహరణకరము) (సూడోసోరిక్) (సైకోసిస్ దోషహరణకరము)

**(Muriatic Acid)**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| రక్తము. | స్పర్శ : తడిగాలి. |
| కండరములు { హృదయము, ఆసనము | నడచుట. |
| | చల్లని పానీయములు. |
| ఆమత్వచలములు { జీర్ణమార్గము. నోరు. | స్నానముచేయుట. |
| నాలుక. | కూర్చుండుట. |
| మెదడు. | మనుష్యకంఠధ్వని. |

ఉపశమనములు.

చలనము : ఉష్ణము.

ఎడమవైపు పరుండుట.

1 మూలశంఖ ద్రాక్షగుత్తివలె బైటకువచ్చుట ; నీలివర్ణముగానుండి వాచి నొప్పితోను, మంటతోను యుండుట.

2 మర్మావయవములమీద పుండు : యీ పుండ్లనుండి దుర్వాసనతో కూడిన చీమువచ్చుట : మిక్కిలి నీరసము : యీ పుండు మిక్కిలి నొప్పిగాయుండుట.

3 వ్యాధి ముఖ్యముగ నోటియందు, ఆసనమునందు జేరియుండుట.

4 సన్నిపాతజ్వరము : విస్తారమైన నీరసము : క్రిందిదవుడ వ్రేలాడబడియుండుట. ప్రక్కనుండి క్రిందకు, అనగా దిగువభాగమునకు జారుచుండుట : సన్నిపాతజ్వరములో మలకోశములు తూట్లుపడి రక్తవిరేచనములు వెడలుచుండుట.

5 సన్నిపాతజ్వరములో మిక్కిలి విస్తారమైన మగతతోకూడిన నిద్ర నుండి మేల్కొంచినను స్మృతిలేని స్థితిలోనుండుట : బిగ్గరగా మూల్గుట, గొణుగుకొనుట : నాలుక ఎండిపోయి తోలువలెనుండుట : నాలుకకు పక్షవాతమువచ్చుట : మూత్రము విసర్జించునపుడు దుర్వాసనతోకూడిన విరేచనము అప్రయత్నముగా వెడలుట : నాడి మూడుదెబ్బలకొకసూరు విడిచికొట్టుట.

6 విరేచనములు : మూత్రము విసర్జించునపుడు అప్రయత్నముగా విరేచనమగుట : అపానవాయువు వదలునపుడప్రయత్నముగా విరేచనమగుట (ఎలోయిస్) : విరేచనమవకుండా మూత్రము విసర్జింపజాలకుండుట.

7 నెమ్మదిగా మూత్రము వెడలుట: మూత్రకోశము మిక్కిలి నీరసస్థితిలోనుండుట: మూత్రము విసర్జించుటకు చాలసేపు వేచి యుండవలసి ఉండుట.

8 మర్మావయవము ముట్టుకొనుటకుగూడ మిక్కిలి నొప్పిగాయుండుట; మర్మావయవములపై బట్టకూడ యుంచుకొనలేకపోవుట.

N. B. :— నల్లమందు, పుగాకు, విస్తారముగా నుపయోగించినపిమ్మట కలుగు కండరముల నిస్సత్తువను (Muscular weakness) నివారణజేయును.

---

నేట్రమ్ కార్బ్ :— (Natrum Carb)
(శోరాదోషహరణకరము.)
(సూడోసోరిక్)
(సైకోసిస్ దోషహరణకరము)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| జీర్ణక్రియ. | వేడి { సూర్యునియొక్క. |
| నరములు. | వేడి { గాలియొక్క. |
| చర్మము. | వేడి { ఉక్కగాలి. |
| చేతులు. | వేడి { గేసులైటు. |
| మణములు. | కాలక్రమముగ; తెల్లవారుఝాము 5 గంటలకు. |
| | మానసికవ్యాయామము. |
| | ముష్టిమైథునము. |
| | సంగీతము. |
| | అపత్యదోషము: పాలు. |
| | గాలివాన ఉరుములు. |

ఉపశమనములు.

చలనము : రాచుట.

1 వేసవివేడిమివలనకలుగు విస్తారమయిన నీరసము ; శరీరమానసిక పరిశ్రమ లేమాత్రము కావించినను కలుగు నీరసము ; ఎండదెబ్బ తగిలి వడగొట్టుటవలన కలుగు దీర్ఘవ్యాధి లక్షణము (Chronic effects).

2 పూర్వము ఎండదెబ్బతగిలిన వ్యక్తులకు వేసవివచ్చినవెంటనే కలుగు తలపోటు, తలత్రిప్పు, విచారము మొదలగునవి సంభవించుట.

3 ఆమ్లయుత అజీర్ణము : ముఖ్యముగా కూరగాయలను, పిండిపదార్థములను భుజించినపిమ్మట కలుగు అజీర్ణము : ఈఅజీర్ణముతో గుండెదడ మనోవిచారము ;

4 పాలయందు విముఖత : పాలుత్రాగిన విరేచనమగుట.

---

## నేట్రమ్ మూర్ :— (Natrum Mur)

(శోథాదోషహారణకరము)
(సూడోసోరిక్)
(సైకోసిస్ దోషహారణకరము)

స్థానములు.

జీర్ణావయవమార్గము.
మెదడు.
రక్తము.
కండరములు.
మనస్సు.
హృదయము.

ఉద్రేకములు.

నిర్ణయితకాలక్రమముగ — ఉదయం 9 గంటలు మొదలు 11 గంటల వరకు. సూర్యుడు. ఉదయించినపిమ్మట. ఎండహెచ్చినకొలది. రోజువిడచిరోజు (ఆర్సు, చైనా)

| | |
|---|---|
| గ్రంధులు { అవత్వచల, ప్లీహ, కాలేయ. | ఉష్ణము { సూర్యకిరణములు. వేసవి ; తేమ : |
| చర్మము ; | విపరీతమయిన మానసోద్రేకములు. |
| | ఓదార్పు : |
| | రజస్వల అగువయస్సు : కైనా : |
| | పూర్వపు మలేరియాజ్వరము : |
| | రజితలవణములు. |

ఉపశమనములు.

బహిరంగమయినగాలి : చన్నీటిస్నానము, చెమటపట్టుట: విశ్రాంతి. ఉదయభోజనమునకుముందు. లోతుగా శ్వాసపీల్చుట.

1 శుక్లనష్టమువలనగాని, విస్తారమయిన బహిష్టు స్రావములవలనగాని లేక యితరమానసిక బాధలవలనగాని రక్తము హరించి, రక్తవిహీనమైన వ్యక్తుల కుపయోగించును.

2 విశేషముగ చిక్కిపోవుట : తిని తిరుగుచు నీరసించుట : మెడ విశేషముగ సన్నగిల్లిపోవుట. (ఇదియొక ముఖ్యలక్షణము). మెడ నిలుపలేకపోవుట.

3 అతిసులభముగ జలుబుచేయుట.

4 చిరాకు : పలుకరించిన పిల్లలుఏడ్చుట : స్వల్పకారణముచేగూడ నేడ్చుట : స్వల్పవిషయములచేగూడ కోపోద్రేకముజెందుట : ఓదార్చిన కోపము హెచ్చగుట.

5 విచారముగాను దిగాలుగనుయుండి కారణములేకయే ఏడ్చుట (పల్స్). యితరులు ఓదార్చిన ఏడ్పు యితరబాధలు అధికమగుట.

6 తలపోటు : ఎడమవైపు పార్శ్వపుపోటు : ఉదయమున యగుపించు తలపోటులేక పార్శ్వపుపోటు : సూర్యోదయముమొదలు సూర్యాస్తమానమువరకుయుండు తలపోటు.

7 జ్వరములో తలపోటు : మెదడులో సుత్తులచే బాదుచున్నట్లు పోటుగానుండుట : చెమటపట్టిన తలపోటు తగ్గుట.

8 అంధత్వముతో ప్రారంభించు తలపోటు (ఐరిస్, కాలీబై) : కండ్లు మిరిమిట్లుగొల్పి జిగిజిగిలాడుచు తలపోటు క్రిందదిగుట. కండ్లకెక్కువ పరిశ్రమ కలుగజేసినమీాదవచ్చు తలపోటు.

9 కండ్లనుండి నీరుకారుట : దగ్గినపుడెల్ల కండ్లనుండి ప్రవాహామువలె నీళ్ళుకారుట (యూఫ్రెషియా).

10 నాలుకపై తలవెండ్రుక యున్నట్లుభావన (సిలికా)

11 నాలుకపై తెల్లనిపూత, అచ్చటచ్చట ఎర్రనిమచ్చలు : నాలుక బలువుగానుండుటచే పిల్లలుసరిగా మాటాడలేకపోవుట : ముద్దమాటలు. సకాలములో నడువలేనిపిల్లలలో ఇట్టిలక్షణములు ముఖ్యముగా నున్నపుడు పనిచేయును.

12 మలబద్ధము : ఆసనము ముడుచుకొనిపోవుట : విరేచనము కష్టముమీాద వెడలి ఆసనముచిట్లి పగిలి రక్తము స్రవించుట. గట్టిగా పొడిగా ఎండిపోయినట్లు రాళ్ళవలెవెడలు విరేచనము (మెగ్నీషియా మూర్) : ఆసనమున పోట్లు (నైట్రిక్ యాసిడ్).

13 నీళ్ళవిరేచనములు : అపానవాయువు వెడలుచున్నదో విరేచనమగుచున్నదో తెలియకుండ అప్రయత్నముగ విరేచనమువెడలుట (ఎల్లోయిన్, అయోడేటమ్, మూరియాటిక్ యాసిడ్, పోడోఫిలిమ్).

14 మూత్రము విస్తారముగా వెడలుట: అప్రయత్నముగా వెడలుట: నడచునపుడు, నవ్వినపుడు, దగ్గునపుడు అప్రయత్నముగా మూత్రము వెడలుట (కాస్టికమ్, పల్సు, స్కిల్లా): యితరులున్నపుడు, మూత్రము విసర్జించుటకు చాలసేపు వేచియుండవలసి యుండుట: మూత్రము విసర్జించినపిమ్మట కోయుచున్నట్లు బాధ.

15 శుక్లనష్టము: సంయోగమైనవెంటనే వాంఛ హెచ్చి స్ఖలనమగుట: కౌగలింతలలోనే స్ఖలనమగుట. అంగము బలహీనమగుట. అధిక సంభోగమువలన వెన్నెముకలోపోటువచ్చుట. పక్షవాతమువచ్చుట.

16 గుండెదడచే శరీరమంతయు వణకుట (స్పైజీలియా).

17 జుట్టునుముట్టుకొన్న రాలిపోవుట: ప్రసవమైనపిమ్మట వెంట్రుక లూడిపోవుట (సిపియా) ముఖము జిడ్డుగానుండుట: నిగనిగలాడుచు జిగురురాసినట్లుండుట (ప్లంబం, తూజా).

18 ఆమ్లయుతపదార్థములను (acid food) భుజించుటవలనను, క్వైనా విశేషముగ వాడుటవలనను, ఉప్పు విస్తారముగా ఉపయోగించుట వలనను కలుగు దుర్గుణములు.

19 దుఃఖమువలనను, భయమువలనను, విసువుదలవలనను, దుఃఖము నణచిపెట్టుటవలనను కలుగు దుర్గుణములు (స్టాఫసీగ్రియా).

20 అరిచేతులలో సురుపుడుకాయలు.

21 పెదవులపై జ్వరపక్కులు: పెదవులు ఆరుకుపోయి, పగిలి పుండు పడి నొప్పిగానుండుట.

22 శరీరమునందంతటను, నీళ్లవంటి చీముతోకూడిన పొక్కులు.

23 విడుపుజ్వరము (Intermittent fever) జ్వరలక్షణములు ఉదయమున 10 లేక 11 గంటలకు మధ్య ప్రారంభించును. క్వయినాచే

అణచిపెట్టబడు ప్రాతజ్వరములను నివారణజేయును. చలి, ఉష్ణము యున్నపుడు, తలపోటుతో స్మృతిలేకయుండుట.

24 ఎండదెబ్బ తగులుట : గాళుపుగొట్టుట : వడగొట్టుట : యీబాధలను నివారణజేయును.

N. B :—విడుపుజ్వరములలో జ్వరమున్న సమయములో ఔషధమును ప్రయోగింపరాదు. దీర్ఘవ్యాధులలో తరుచుగ ప్రయోగింపరాదు : యీ ఔషధమిచ్చిన పిమ్మటగూడ తలపోటు త్రిప్పు విడువక బాధించుచున్నపక్షమున నక్సు వెంటనే తగ్గించును.

---

నేట్రమ్సల్ఫ్ :— { (శోరాదోషహరణకరము) (సైకోసిస్ దోషహరణకరము) }

**(Natrum Sulph)**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| ముచ్చిలిగుంట : | తేమ { గాలి. రాత్రిగాలి. గదులు. } |
| గ్రంథులు { కాలేయముయొక్క. పైత్యరము. పాంక్రియాస్ యొక్క. ప్లీగుల. చిన్నప్రేగుల. } | ఎడమవైపు పరుండుట. |
| గుండె { ఎడమ. అడుగు. } | దెబ్బలు : తలకు. |
| ఎడమభాగము. | ఎత్తుట : స్పర్శ : అదుముట. |
| | సాయంత్రము ప్రొద్దుపోయిన పిమ్మట. |
| | గాలి : వెలుతురు. |

**ఉపశమనములు.**

బహిరంగమైన గాలి.

ఒకప్రక్కను కూర్చుండక పరుండక మారుచుండుట.

1 చలిగాలి వలనను, తేమతోనున్న యిండ్లలో నివసించుటవలనను కలుగు లేక ఉద్రేకించు వ్యాధులు.

2 ప్రతిశీతగాలియు రోగిని బాధించును : సముద్రపుగాలి భరింప లేకపోవుట : నీటి సమీపమున పెరుగు కాయగూరలను భుజించిన పడకపోవుట.

3 రోగసంబంధమైన విషము మిక్కిలి హానికరముగ తత్వములో జేరియుండుట.

4 ఏ వ్యాధియైనను త్వరగా తగ్గక నెమ్మదిగా ఆలస్యముగా తగ్గుట.

5 ప్రతి వసంతఋతువునందును చర్మవ్యాధి తిరిగి యగుపించుట (సోరినమ్).

6 ఆలోచన చేయకుండుట. ఆలోచనయందు విముఖత.

7 ఉదయమున, విచారముగను, చిరాకుగను, దిగులుగను యుండుట : మాట్లాడుటకుగాని పలుకరించిన సమాధానము చెప్పుటకు గాని హితవులేకుండుట (ఐయోడియమ్, సిలికా).

8 దిగాలు, విచారము : ఆహ్లాదకరమగు సంగీతము దుఃఖముకలుగ జేయును : రోగి జీవితముపై అసహ్యము గలిగియుండును.

9 తలకు దెబ్బతగులుటవలన కలుగు మానసికవ్యాధులు.

10 కనురెప్పలలో క్రొయ్యగండలు పెరుగుట : కనురెప్పలలో చీముతో కూడిన చిన్నపొక్కులు బయలుదేరుట (తూజా) : ఆకుపచ్చని లేక పసుపుపచ్చని పుసులు. సెగసంబంధమైన కండ్లజబ్బులు.

11 పండ్లపోటు : చలిగాలివలనను, చన్నీళ్ళవలనను ఉపశమించుట (కాఫీ, పల్సు)

12 నాలుకపై ఆకుపచ్చని లేక బూడిదరంగువంటి పూత.

13 విరేచనములు : ఆకస్మికానుమానము గలిగి ఆపుటకు వీలులేక వెంటనే విరేచనమునకు వెళ్ళవలసియుండుట : విశేషమైనగాలితో వేగముగా మలముపడుట : నిద్రనుండి మేల్కాంచినవెంటనే తొందరగా విరేచనమునకు వెడలవలసియుండుట.

14 సెగ : బాధలేని, ఆకుపచ్చ పసుపువర్ణముగల చిక్కటిస్రావము వెడలుచుండుట (పల్సు) దీర్ఘకాలమునుండి గలయిట్టి స్రావము : లేక సెగస్రావమును అణచిపెట్టుట (కాలీఐడోడ్)

15 చలిగాలిలో వగర్పు ఆయాసము : శీతగాలి వీచునపుడెల్లను పిల్లలకు గలుగుక్షయ. వర్షకాలములోను శీతకాలములోను చలిగాలి తగులుటవలనను, తేమలో తిరుగుటవలనను కలుగుక్షయ : విస్తారమైన ఆకుపచ్చని శ్లేష్మకళ్లెలు పడుట.

16 సెగ తత్వసంబంధమైన న్యూమోనియా : గుండెలు మిక్కిలినొప్పిగా యుండుట : దగ్గుచే పరుండలేక కూర్చొనవలసియుండుట : దగ్గునపుడు, రెండుచేతులతోను గుండెపట్టుకొని దగ్గుట.

17 మెదడులో తీవ్రమైన పోటుబాధ : తల వెనుకకు విరగబడుట : సంధితోను, మానసిక ఉద్రేకముతోను కంపములు : తలయందు విశేషరక్తకూటమి (Congestion) సంధి : ఉండీలబద్దవలె శరీరము విరగబడుట.

---

నైట్రిక్ యాసిడ్ :— { (సోరాదోషహరణకరము) (సైకోసిస్ దోషహరణకరము) (సిఫిలిస్ దోషహరణకరము)

(Nitric Acid)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| అవయద్వార వంచలు } కంఠముయొక్క. ఆసనముయొక్క. నోటియొక్క. | కొలదిపాటి } స్పర్శ : కుదుపు. బండిచప్పుడు. ధ్వని. |
| గ్రంథులు } కాలేయముయొక్క. పాస్ట్రేటు గ్రంధి యొక్క. లాలాజల | చలనము : పాదరసము. |
| గొట్టమువలెనుండు అవయవములు | శీతలము : గాలి : తేమ. |
| రక్తము : చర్మము : ఎముకలు. | రాత్రి : గస్త్రీకాయుట. |
| | గాలిమార్పు. |
| | మానసిక వ్యాయామములేక, |
| | ఉపద్రవవ్యాకులత. |
| | **ఉపశమనములు.** |
| | మెల్లగా నడచుట లేక జరుగుట. |
| | సౌమ్యమైన వాతావరణము. |
| | విడువక నొక్కిపెట్టుట. |
| | బండిప్రయాణము. |

1 నాలుకపైన, నోటియందు, కంఠములోను, పొక్కులు, పుండ్లు : చురుకు, పోటు, మంట : ముట్టుకున్నను, ఏపదార్థమైనను తగిలి నను విశేషముగా బాధగానుండుట : పాదరసము దుర్వినియోగ పరచిన పిమ్మట కలుగు యిట్టిబాధలు ; సవాయిదోషతత్వములు.

2 అంగముమీాద అంగముయొక్క చివరభాగమున సవాయిపుండ్లు : యీా పుండ్లనుండి దుర్వాసనతో కూడిన రసివచ్చుచుండుట : పుండ్లు సుభ్రముగా యగుపడుట.

3 అంగముపైగల శిగసంబంధమైన కండలనుండి ముట్టుకొన్న రక్తము స్రవించుట.

4 సులభముగా జలబుచేయుచు (takes cold easily) దీర్ఘవ్యాధులచే బాధపడురోగులు : తరచు విరేచనములు వెడలుచుండుట : మలబద్ధముగల రోగులకంతగా అనుకూలించదు.

5 శరీరము నెచ్చటముట్టుకున్నను పోట్లు చురుకు.

6 పాదరసము దుర్వినియోగపరచుటచే సంభవించు రణము లేక ద్వితీయావస్థలో సంభవించు పుండ్లు రణములు.

7 నమలునపుడు దవుడలలోను చెవులలోను కరకరలాడుట :

8 విరేచనమగునపుడు ఆసనము ముడుచుకొనిపోవుట : ఆసనము చిట్లుట : విరేచనమగునపుడు, పీకుచున్నట్లు, పొడుచుచున్నట్లు విడిచివిడిచి వచ్చు బాధలు : విరేచనమైనపిమ్మట కూడ ఆసనమున పోట్లు (రతన్‌హియా).

9 మూత్రము కొలదిగను, బూడిదరంగుగను గుర్రపుమూత్రము వలె మిక్కిలి బలమయిన వాసనతోను వెడలుట : మూత్రము చల్లగా వెడలుట.

10 నోటి చెలివిలయందలి (corners of mouth) పుండ్లనుండి సులభముగా రక్తము స్రవించుట.

11 సన్నిపాతజ్వరములో రక్తవిరేచనములు : శరీరమునకు అధికవ్యాయామమువలన సంభవించు రక్తవిరేచనములు.

12 శరీరద్వారములు (out lets) ముఖ్యముగా వ్యాధిగ్రస్తమగును (అనగా నోరు, ముక్కు, ఆసనము, మూత్రావయవములు).

N. B :—యీ ఔషధమునకు ముందు కల్కేరియాకార్బును ఉపయోగించరాదు. లేకసిస్ యీ ఔషధమునకు విరోధము. వ్యాధిలక్షణములకు మెర్క్యూరీ అనుకూలించునా, నైట్రిక్ అనుకూలించునా యని వివక్షతచేయుట కష్టము : మెర్క్యూరీ నల్లటి వెంట్రుకలుగల వ్యక్తులకు, నైట్రిక్ యాసిడ్ లేతరంగు వెంట్రుకలుగల వ్యక్తులకు ఉపయోగించును. వ్యాధి లక్షణములు సాయంత్రమున రాత్రిభాగమున అర్ధరాత్రమునకు పిమ్మట శీతోష్ణస్థితి మారునపుడు, నడచునపుడు, మేలుకువగా నున్నపుడు, చమటపట్టినపుడు ఉద్రేకించును.

---

## నక్సుమాస్కేటా :—(Nux Moschata)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| స్మృతి : | శీతలము { స్నానము; తేమ; గాలి; మంచు ; పాదములు. |
| మనస్సు. | గర్భిణీ. |
| నరములు. | ఋతుమార్పు. |
| స్త్రీ మర్మావయవములు. | మానసోద్రేకములు. |
| జీర్ణశక్తి. | బహిష్టు. |
| పిల్లలు : వృద్ధులు. | కురుపు : దెబ్బలు : కొలదిపాటి కారణములు. |
| | మానసికవ్యాయామము లేక |
| | ఉపద్రవకలత. |

**ఉపశమనములు.**

ఉష్ణము ; ఉక్కగది. పొడిగాలి ;

1 మారుచుండు స్వభావము; ఒకలక్షణము నవ్వుట వెంటనే ఏడ్చుట.

2 అనాలోచితమయినట్టియు, పట్టుదలలేనట్టియు మారుచుండునట్టియు మందమయిన ఆలోచన గల్గినట్టియు బుద్ధి.

3 చదువునపుడు వ్రాయునపుడు మాట్లాడునపుడు ఆలోచనపోయి విషయము మరచుట.

4 గుండెదడతో సొమ్మసిల్లుట; అటుపిమ్మట నిద్రలోబడుట.

5 సమస్తమయిన బాధలలోను, వ్యాధిలక్షణములతోను మగతనిద్ర మత్తు యుండును. రోగి మగతగా పరుండును; బాధలు నిద్ర మత్తును గలుగజేయును.

6 అధికముగా భోజనముజేసిన తలనొప్పి వచ్చుట.

7 నాలుక విపరీతముగా ఆరుకుపోవుట (ఎపిస్, లేకసిస్) నాలుక ఆరుకుపోయి అంగుడికి అంటుకొనిపోవుట.

8 బహిష్టుకు బదులు కుసుమ: రోగి ఆరుకొనిపోయిన నాలుకతో నిద్రనుండి మేల్కాంచుట.

9 నీరసము: కొంచము వ్యాయామముజేసినను నీరసముచే పరుండ వలసియుండుట.

10 సన్నిపాత లక్షణములు: విస్తారమయిన మగత; స్మృతి లేకపోవుట: సమాధానము చెప్పకపోవుట. విస్తారమయిన చెముడు: దుర్వాసనతోకూడిన విరేచనము: ప్రేగులలో గుడగుడలాడుట: కండ్లు మూతలుపడి మూసుకొనియుండుట (ఆయాసముతోకూడ నున్నప్పుడు ఓపియమ్) నాలుక, నోరు, కంఠము ఆరుకుపోయియుండుట: కడుపు నిండుగాయుండుట: సాయంత్రమగుసరికి నాలుక ఆరుకుపోవుట హెచ్చి అంగుడుకి అంటుకుపోవునుగాని దాహముండదు.

నక్సువామికా :—

(శోరాదోషహరణకరము)

**(Nux Vomica)**

స్థానములు.

మెదడు వెన్నెముక కలసినభాగము
నరములు.

జీర్ణావయవములు { జీర్ణకోశము. కాలేయము. మలకోశములు.

శ్వాసావయవములు.
నల్లని శరీరచ్ఛాయగల పురుషులు:

ఉద్రేకములు.

ఉదయమున :
బహిరంగమయిన శీతగాలి.
చల్లటి ఆసనములు.
కప్పుకొనకుండుట :
కాఫీ : సారాయములు : ఘాటైన
ఔషధములు : వ్యభిచారము.
విరేచనములకొరకు ఔషధములు
తీసికొనుచుండుట :
వ్యాయామరహితమయిన జీవి
తము : అమితభోజనము.
మానసిక వ్యాయామము : నీర
సము : విసువుదల.
కలతజెందిననిద్ర.

కొలదిపాటి { కోపము : ధ్వని : వాసనలు: వెలుతురు స్పర్శ: బట్టలబిగువు:

ఉపశమనములు.

జారీగ వెడలుస్రావములవలన.
ఉష్ణపానీయములు : పాలు : తేమ
గాలి :

1 జాగరూకతగల అసూయాపరులగు వ్యక్తులకును ఉద్రేకమునొంది కోపస్వభావముగల వ్యక్తులకును మనస్సులో క్రోధముగలిగి హాని చేయ సంకల్పించు మనస్సుగల వ్యక్తులకును అనుకూలించును.

2 సన్నని శరీరముతో చురుకుదనము పట్టుదలగల వ్యక్తులకును అధికమయిన విరామములేని చదువునందు నిమగ్నుడగుట, విస్తారముగ ఆఫీసులలో పనిచేయుట, వ్యాపారమును స్వయముగ అధికపరిశ్రమ జేసి పనిని స్వయముగ చూచుకొనుట, యీవ్యాపారవిషయములలో నధికమయిన వ్యాకులతజెందుట, మొదలగు భారములయందు నిమగ్నులగు వ్యక్తులకును అనుకూలించును. బహిరంగమయిన వ్యాయామములేక గృహజీవితము గడుపువ్యక్తులు తమ శరీరమున చురుకుదనము గలుగుటకు, టీ, కాఫీ, మొదలగు పానీయములకు, చుట్ట, సిగరెట్టు, బీడీ మొదలగు దురభ్యాసములకులోనై తత్వమును చెరుపుకొను వ్యక్తులకు అనుకూలించును. మరియు, నిట్టి దురభ్యాసములతో, ఉద్రేకము గలుగజేయు, సారాయి మొదలగు మత్తుపదార్థములను సేవించుట, వేళాతీతభోజనము చేయుట, వ్యభిచారవృత్తి నవలంబించుట మొదలగు కృత్యములకు కడంగువ్యక్తులకనుకూలించును.

3 దిగాలు: మనోవిచారము: ముఖ్యముగా దురభ్యాసములకులోనైన వ్యక్తులలో నిట్టి లక్షణముల కనుకూలించును. భోజనమైన పిమ్మట నిట్టి మానసికస్థితి హెచ్చును. అజీర్ణము, మలబద్ధము, మూలశంఖగల వ్యక్తులలో నిట్టి మానసికస్థితికి అనుకూలించును.

4 రొంప: పగటిపూట విస్తారముగ రొంపయొక్క స్రావము స్రవించుట: రాత్రిభాగమున ముక్కులు బిగవేయుట.

5 ధ్వని, వాసనలు, వెలుతురు, సంగీతము, నివి రోగికి కిట్టవు. స్వల్ప విషయములుకూడ భరింపలేకపోవుట. కష్టము గలుగజేయని మాటలవలన గూడ అభిమానపడుట (ఇగ్నే).

6 కాఫీ, పొగాకు, మత్తుపదార్థములు, బలకరమైన ఉద్రేకకర ఆహార పదార్థములు మొదలగువానివలనను, అమితభోజనమువలనను దురలవాట్లు, నిద్రలేమి, మొదలగువానివలనను, కలుగు దుర్గుణములను ; బాధలను ; తీవ్రమైన అల్లోపతీ ఆయుర్వేద తదితర మందులు విస్తారము వాడుటవలన కలుగు దుర్గుణములను, నివారణజేయుకు.

7 మలబద్ధము : తరచు అసంతృప్తికరముగ కొంచెము కొంచెము విరేచనమగుట ; విరేచనానమానము తీరకుండుట ; ఇంకను కొంత మలముండి బైటకురాక కోశమున నుండిపోయెనని భావన. ఉదయమున లేచినవెంటనే విరేచనానమానము ; మానసికపరిశ్రమ జేసినపిమ్మట ఉద్రేకించును. (అసలు విరేచనానమానమే లేకపోవుట బ్రయో., ఓపి, సల్ఫర్). విరేచనమైనపిమ్మట నీయనుమానము, కొంతసేపటికి తగ్గును.

8 జీవితకాలమంతయు బేధిమందు లుపయోగించు వ్యక్తులలో కలుగు ఒకమారు మలబద్ధము, ఒకమారు విరేచనములు వెడలుట. (సల్ఫర్).

9 యిట్లు మారుచుండుస్థితి బహిష్టుకాలమునకు కొన్నిదినములకు ముందుగనే యగుపడుట. విస్తారమైనస్రావము చాలకాలము వెడలుట ; రెండువారముల కొకసారి బహిష్టగుట. సరియగుకాలములో నెప్పుడును బహిష్టుగాకుండుట ; ఋతుస్రావము ఆగిపోయి తిరిగి యగుపడుట (సల్ఫర్).

10 పొడిదగ్గు ; సాయంత్రము పరున్నపిమ్మటగాని లేక ఉదయమున గాని యిట్టిదగ్గు వచ్చి మిక్కిలి నీరసము కలుగజేయుట ; ఈదగ్గు వలన గుండెలలో నొప్పిగాను పచ్చిగాను యుండుట.

11 రాత్రి పరుండుసమయమునకు ముందు కూర్చున్నప్పుడుగాని, చదువుచున్నపుడుగాని ఆపుకొనలేకుండ నిద్రవచ్చుట ; తెల్లవారు జామున 3 లేక 4 గంటలమధ్య లేచి, మనస్సునందు అనేక ఆలోచనలు ప్రవేశించి నిద్రపట్టకయుండి తిర్గి తెల్లవారుసమయమున, కలలతోగూడిన నిద్రలోబడి, లేపినను మేల్కొంచకుండుట ; మేల్కొంచినపిమ్మట మిక్కిలి నీరసముగాను, బడలికగాను యుండుట.

12 ప్రొద్దుగుంకగనే నిద్రవచ్చుట ; రాత్రిభాగమున నిద్రలేకపోవుట.

13 పొత్తికడుపులో బంధింపబడు గిలక.

14 తరుచు విరేచనానుమానముతోగాని, మూత్రానుమానముతో గాని విడిచి విడిచివచ్చు ప్రసవనొప్పులు.

15 నడుమునొప్పి ; పరున్న పడకయందు ఒకప్రక్కనుండి వేరొక ప్రక్కకు తిరుగుటకు నడుమునొప్పిచే లేచికూర్చొనవలసియుండును. అధికసంభోగమువలనగాని, ముష్టిమైథనమువలనగాని కలుగు నడుమునొప్పి.

16 చలిగాలియెడల విముఖత ; కదలిన చలి ; కప్పుకొనకుండ నుండ లేకపోవుట.

17 జ్వరములో ప్రతి అవస్థయందు కప్పుకొని యుండవలయును.

18 జ్వరము ; విస్తారమైన వేడి ; శరీరమంతయు కాలుచుండుట (ఎకోనైటు) ముఖము ఎర్రగాను, వేడిగాను యుండుట (బెల్) ఇట్లు

స్నప్పటికి, రోగి కదలినను, కప్పుకొనకుండ నుండినను విస్తారముగు చలి.

19 భోజనమైన ఒకటిరెండు గంటలకు జీర్ణకోశములో రాయివలె బరువుగానుండుట ; భోజనమైనపిమ్మట నిద్రమత్తు ; భోజనమైన ఒకటిరెండు గంటలవరకు మనస్సు నుపయోగించలేకపోవుట ; ఆలోచన పోకుండుట.

20 వికారము ; విడువకుండనుండు వికారము ; ఉదయమున, భోజనమైనపిమ్మట, చుట్టకాల్చుటవలన వికారము ; "వమనము వెళ్లిన స్వస్తత కలుగు" నని రోగిభావించును.

21 పుల్లగాను, చేదుగానుయుండు త్రేణుపులు : ఉల్లాసముతగ్గి ప్రతి ఉదయమున వికారము వాంతులు వెడలుచుండుట ; భోజనమయిన పిమ్మట వికారముగానుండుట : వాంతులు వెళ్లుట.

22 స్మృతితోగూడిన కంపములు.

23 ఉదయమునను, నిద్రనుండి మేల్కాంచిన వెంటనేయున్నూ మానసికపరిశ్రమానంతరమున భుజించినపిమ్మట అస్వస్థతగానుండుట ; బాధలుద్రేకించుట.

N. B :—సల్ఫరును ఉదయమునను, నక్సువామికాను రాత్రిభాగమున పరుండుటకు కొన్నిగంటలకు ముందుగను ప్రయోగించవలయును. ఇట్లు ప్రయోగించిన మంచిగుణము కలుగగలదు. జింకమ్ మెటాలికమ్‌ను నక్సువామికాకు ముందుగాని వెనుకగాని వాడరాదు.

## ఓపియమ్ :—(Opium)

### స్థానములు.

మనస్సు : స్పర్శజ్ఞానము.

నరములు { మెదడుయొక్క. / మెదడుకు వెన్నెము / కకుసంబంధమయిన

ఊపిరితిత్తులు : శ్వాస :

జీర్ణాశయవమార్గము :

### ఉద్రేకములు.

మానసోద్రేకము : భయము.
భీతాహాము : సంతోషము :
సారాయము ; నిద్ర ;
అణచిపెట్టబడిన స్రావములు.
అంతరించు పొక్కులు.
ఉష్ణము కలుగజేయబడిన

### ఉపశమనములు.

శీతలము ;

1 సంధితోకూడిన మాటలు ; కండ్లు తెరచియుండుట ; ఎర్రటి ముఖము ; ఉబ్బియుండుట ; స్మృతి తప్పియుండుట ; విస్తారమయిన మగత ; నిద్రలో బట్టలుపీకుట ; కండ్లు సఖము మూసికొనియుండుట ; గాజుకండ్లవలె యుండుట ;

2 మగతతోకూడిన సుఖము గలుగని నిద్ర ; కండ్లు సఖము తెరచి నిద్రించుట ; శ్వాస గుఱ్ఱుపెట్టుచున్నట్లు వచ్చుట.

3 నిద్రగానున్నను నిద్రించలేకపోవుట ; పరుండుప్రక్క పరుండుటకు వీలులేనంత వేడిగాయున్నట్లు భావించుట.

4 లక్షణసారూప్యమునుబట్టి ప్రయోగించినమందు పనిజేయకుండుట; ఔషధగుణమునకు రోగి వశ్యముకాకుండుట ; జీవశక్తియందు ప్రతీకారగుణము నశించుట ; (కార్బోవెజ్.) ఇట్టి పరిస్థితియందు ప్రతీకారగుణము కలుగజేసి సుగుణము కలుగజేయును.

5 విస్తారమయిన మగతతోకూడిన సమస్తలక్షణములలోను రోగి తనకేవిధమయిన బాధలులేవని తెల్పును. రోగి వేనిని కోరడు; మత్తుగా పరుండియుండును.

6 క్రొత్తమనుష్యులను చూచుసరికి పిల్లలలోవచ్చు కంపములు; ఏడ్పుటవలనవచ్చు కంపములు: కండ్లు సఖము తెరచి వెనుకకు తిరగబడియుండుట.

7 మలబద్ధము; విరేచనానుమానమే లేకపోవుట. పిల్లలలో గలుగు విరేచనబద్ధము; గట్టిగాను నల్లగాను రాళ్ళవలెవెడలువిరేచనములు. విరేచనము ఆసనమునుండి ముందుకువచ్చి తిరిగి వెనుకకుపోవుట (సిలికా, తూజా).

8 భయమువలన అప్రయత్నముగా వెడలు విరేచనములు (జెన్సి): విరేచనములు నల్లగాను మిక్కిలిదుర్వాసనతోను వెడలుట;

9 మూత్రకోశము నిండుగానుండి మూత్రము బంధింపబడుట: పొగాకు విస్తారముగా ఉపయోగించుటవలన మూత్రము బంధింపబడుట; జ్వరములోను తరుణవ్యాధులలోను మూత్రము బంధింపబడుట; మూత్రకోశమునకు పక్షవాతము వచ్చుట;

10 ఈఔషధమును పెద్దమోతాదులలో ప్రయోగించి చికిత్సజేసిన రోగులలో పట్టి విడువకుండనుండు విరేచనములను తగ్గించును.

11 పిల్లలు చిక్కిపోవుట; పిల్లలు ఎండిపోయి శరీరము ముడతలుపడి ముసలివారివలె యగుపడుట.

12 చర్మవ్యాధి ఆకస్మికముగ మెదడుయొక్క పక్షవాతములోనికిగాని కంపములలోనికిగాని మారుట; (జింకమ్)

N. B :— ఆత్మహత్యకొరకు నల్లమందు తినిన రోగులకు బలమయిన కాఫీని నక్సువామికాను ఇపెకాక్ నునిచ్చిన విషదోషము హరించును. సత్వరముగ రోగికి స్వస్థత చేకూరును.

---

పెట్రోలియమ్ :— { (శోరాదోషహారణకరము) (సూడోసోరిక్)

**(Petroleum)**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| ముచ్చిలిగుంట ; | చలనము { కారు. బండి. పడవ. |
| చర్మము { మడతలలో ; తలపై ; ముఖముపై : మర్మావయులపై . | గాలి { శీతలమయిన ; శీతకాలపు; మార్పు ; గాలివాన ; |
| ఆమత్వాచలములు ; | భోజనము చేయుట ; పిసువుదల ; కేబేజీపువ్వు ఆహారము. |
| జీర్ణకోశము ; మలకోశములు ; | **ఉపశమనములు.** |
| | వెచ్చటిగాలి |

1 కారు, బండి, రైలు, ఓడప్రయాణములవల్ల గలుగు బాధలను నివారణజేయును.

2 వ్యాధిలక్షణములు యగుపించి వెంటనే అదృశ్యమగును. (బెల్, మేగ్ ఫాస్).

3 శరీరమునందంతటను చర్మము నొప్పిగాయుండుట : కట్టుకున్న బట్ట బాధకరముగానుండుట. చిన్న దెబ్బకూడ చీముపట్టుట (హెపాల్).

4 చేతులయొక్క చర్మము గరుకుగానుండుట ; పగులుట ; ప్రతి శీతకాలములోను వ్రేళ్ళ దిగళ్ళు గరుకుగానుండిపగులుట ; పాదములు నొప్పిగానుండి దుర్వాసనతో కూడిన చెమటపట్టుట. (గ్రైఫైటీస్, సిలికా).

5 తొడల మధ్యభాగమున, మర్మావయవములకు ఆసనమునకు మధ్య భాగమున, దురద, ఎర్రబడుట, గరుకుగానుండుట ; పగులుట ; తేమగానుండుట ; లేక పొడిబారుకుపోవుట ; రక్తము స్రవించుట ; పొక్కులు.

6 అరిచేతులయందు అరికాళ్ళయందు వేడి, మంట (సల్ఫరు).

7 స్త్రీ పురుష మర్మావయవములయందు చెమట ; తేమ ;

N. B:— చర్మలక్షణములు శీతకాలములో వృద్ధిజెందును. వేసవిలో సుగుణముగానుండును ; చర్మవ్యాధులను అణచిపెట్టిన విరేచనములు కలుగును.

---

ఫాస్ఫరస్ :— (శోరాదోషహారణకరము.) (సూడోసోరిక్) (సైకోసిస్ దోషహారణకరము.)

(Phosphorus)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| లోపలి భాగము: తల. ఊపిరితిత్తులు. హృదయము. | ఎడమవైపున పరుండుట : బాధగానున్న భాగమున పరుండుట. వీపుపై పరుండుట. |

రక్తప్రసరణ:
- రక్తము.
- రక్తనాళములు.
- పెద్దరక్తనాళములు.

అమత్వచలములు:
- జీర్ణకోశముయొక్క మలకోశములయొక్క. ఊపిరితిత్తుల (అడుగు భాగము).

ఎముకలు:
- పై దౌడలు.
- పిక్కలయొక్క.
- వెన్నుయొక్క.

కాలేయము.

కొలదికారణము:
- మానసికోద్రేకము:
- మాట్లాడుట;
- స్పర్శ; వాసనలు;
- వెలుతురు.

చల్లని:
- చేతులునీళ్లలోబెట్టుట.
- బహిరంగమైన గాలి.

ఉప్పు: రజస్వలయగు వయస్సు;

వేడి ఆహారములు;

గాలి:
- ఆకస్మిక మార్పులు.
- గాలి ఉరుముల వానలు.

ఉదయమున. సాయంత్రము. మానసిక నిస్త్రాణ.

ఉపశమనములు.

---

భుజించుట; నిద్రించుట; చల్లటి గాలి;

చల్లటి పానీయములు;

కూర్చుండుట;

1 మెదడులో పోటు మంటతో కూడిన బాధ.

2 జీర్ణకోశమున త్రాగిన నీరు వేడెక్కినవెంటనే వాంతియగుట: భుజించిన కొన్నిగంటలకు వాంతియగుట (భుజించినవెంటనే ఆరును).

3 దీర్ఘకాలమునుండి బాధలేకుండ వెడలు అజీర్ణవిరేచనములు; ఈ విరేచనములతో రాత్రిభాగమున విపరీతమయిన దాహము; ప్రకృతిగ యగు విరేచన మయినపిమ్మటగూడ విస్తారమయిన నీరసము; గుండెదడ.

4 కలరా రోజులలో తరుచు కలుగు విరేచనములు.

5 మలబద్ధము : కుక్కవిరేచనమువలె పొడుగుగా గట్టిగా నల్లగా రాళ్లవలె వెడలుట; విరేచనము కష్టముమీద వెడలుట.

6 కంఠమునందలి నొప్పిచే మాట్లాడలేకపోవుట.

7 దగ్గుతో గుండెలయందు నొప్పి; పైన నొక్కిపట్టిన నొప్పితగ్గుట.

8 సాయంత్రము పొడిదగ్గుతో గుండెలు బిగబట్టుట.

9 దగ్గుతో శరీరమంతయు వణకుట.

10 క్షయ; గుండెలు బరువు; గుండెలయందు మంట, వేడి. తెల్లటి శ్లేష్మము; పసుపు పచ్చని లేక తుప్పురంగువంటి లేక రక్తజీరతో కూడిన శ్లేష్మము; చదివినను, నవ్వినను, మాట్లాడినను దగ్గు వచ్చుట; దగ్గునపుడు నోరు తియ్యగానుండుట.

11 కుడివైపునమాత్రమే పరుండగలుగుట: (ఎడమవైపున మాత్రమే పరుండ గలుగుట మెర్క్యూరీ) ఎడమవైపున పరున్న దగ్గుహెచ్చుగుట (లైకో).

12 ముక్కుచెలినెలు విసనకర్రవలె ఆడుచుండుట (లైకో).

13 దగ్గు సాయంత్రమున రాత్రిభాగమున గాలి వుష్ణమునుండి శీతలమునకు మారినప్పుడు హెచ్చగుట.

14 చల్లనిపానీయములకొరకు, చల్లని ఆహారముకొరకు వాంఛించుట.

15 కాళ్లు నిరంతరము ఆడించుచుండుట. ఒక్కక్షణముగూడ నిలుచున్నప్పుడుగాని కూర్చున్నప్పుడుగాని నిలకడగా యుంచకపోవుట.

16 కాళ్లయందు చేతులయందు మంటలు, వేడి: కాళ్లువాచి వంగకుండుట: రెక్కగూడులమధ్య మంచుముక్కయున్నట్లుండుట: నడుమువెంట విపరీతమైన వేడిపాకుట.

17 నరములసంబంధమైన వ్యాధులలో శరీరమునందలి ప్రతిఅవయవము లేక ప్రతినాళము (Tissue) మంటగానుండుట.

18 గుండెలు (Chest) మంటగానుండుట. ఊపిరితిత్తులు (Lungs) మంటగానుండుట.

19. రక్తస్రావములు : ఒక్కొక్కమారు విస్తారముగ ప్రవాహమువలె స్రావము వెడలుట : ఒక్కొక్కమారు నిలచిపోవుట : రక్తవమనములు ; ఋతుప్రసరిగా జరుగనిస్త్రీలకు, ముక్కునుండి, లేక నోటినుండి, లేక మర్మావయవమునుండి లేక ఆసనమునుండి కలుగు రక్తస్రావములు.

20 గర్భకోశమునగల రణముతో అధికరక్తస్రావము (Metrorrhagia)

21 గంధకపువాసనవంటి చెమట.

22 తుట్టలుతుట్టలుగా వెండ్రుకలు రాలిపోవుట ; ప్రత్యేకస్థలముల యందు తల బట్టతల యగుట. చుండ్రు (లైకో).

23 తలలోను, గుండెలలోను, జీర్ణకోశములోను, శరీరమంతటను, నీరసము.

24 కండ్లు గుంటలుకట్టుట : కండ్లచుట్టు నీలివర్ణ ఆకారముగనుండుట. రెప్పలువాచి నీరుపట్టుట ; (పైరెప్ప కాలీకార్బ, అడుగురెప్ప ఏపిస్).

25 విముఖత ; మాట్లాడుటకు యిష్టములేకపోవుట ; నెమ్మదిగా జవాబు చెప్పుట. మిక్కిలి బద్ధకముగను బలవంతముగను కదలుట (Moves sluggishly).

26 జీవితమునందు విసుపుదల ; మిక్కిలి అధైర్యముగా భవిష్యత్తునుగూర్చి తలంచుట.

27 విస్తారమైన నీరసము; నరముల నిస్సత్తువ; వణకు; జీవద్రవములు (శుక్లము మొదలగునవి) పోవుటవలన కలుగు నీరసము, నిస్సత్తువ; (చైనా, ఫాస్ఫారిక్ యాసిడ్) పుంసత్వలోపము.

N. B.—కాస్టికమ్ యీ ఔషధమునకు ముందుగాని వెనుకగాని వాడరాదు.

---

ఫాస్ఫారిక్ యాసిడ్ :— { (సోరాదోష హరణకరము.) (సైకోసిస్ దోష హరణకరము).

**(Phosphoric Acid)**

స్థానములు.

మనస్సు : నరములు :

మర్మావయవ నిర్మాణము :

వెన్నెముక { స్పర్శజ్ఞానతంతువులు : కండరములు

ఎముకలు :

ఉద్రేకములు.

నీరసము { జీవద్రవములుపోవుట : అధిక సంభోగము : నిస్సత్తువ : జ్వరములు :

మానసోద్రేకములు { దుఃఖము : ఆశాభంగము : కలత : అసాఖ్యమైన ప్రేమ బంధము : ఇంటిపై బెంగ :

శీతగాలి : సంగీతము : మాట్లాడుట :

ఉపశమనములు.

ఉష్ణము : కొలదిసేపు నిద్ర :

విరేచనమగుట :

1 మానసిక దుర్బలత్వము : నిర్లక్ష్యము : విముఖత : బుద్ధిమాంద్యము :

2 మంచి బలమైన తత్వముగల వ్యక్తుల జీవద్రవములు అనగా శుక్లము మొదలగునవిపోవుటవలనను, లేక అధికసంభోగమువలనను (చైనా) నీరసించి నిస్సత్తువకలుగుట : తీవ్రమైన తరుణవ్యాధుల యనంతరముగల నిస్సత్తువ : దుఃఖము, ప్రేమ విషయములయందు ఆశాభంగము మొదలగు నైతికసంబంధమైన మానసోద్రేకము చాలకాల మనుభవించుటవలన కలుగు వ్యాధిలక్షణములు :

3 ముఖము చిక్కిపాలి, రోగచిహ్నము లగుపరుచుట : కన్నుల చుట్టుకట్టి, నీలివర్ణపు ఆకారము చుట్టును గలిగియుండుట :

4 సౌమ్యమైనట్టియు, పెంకితనములేక ప్రతిపనియందునకు సమ్మతించునట్టి స్వభావము (పల్సు).

5 తల యెముకలు మిక్కిలి నొప్పిగానుండుట.

6 సకాలమునకు మున్నే తలనెరయుట : వెంట్రుక లూడిపోవుట : ముఖ్యముగా దుఃఖము, విచారము అనుభవించినపిమ్మట వెంట్రుకలూడిపోవుట.

7 కంటిలో తెల్లగ్రుడ్డుమీద పసుపుపచ్చని మచ్చలు.

8 నాలుక మధ్యభాగమున నెర్రనిచారలు.

9 విరేచనములు : తెల్లటివిరేచనములు, లేక పసుపుపచ్చగాను నీళ్లవలెను వెడలు విరేచనములు. దీర్ఘకాల మిట్టివిరేచనములు వెళ్లుచున్నను ఎట్టినీరసము కలుగకుండుట. ఆమ్లపదార్థముల (Acids) వలన కలుగు విరేచనములు : విరేచనమగుచున్నది లేక గాలిపోవుచున్నది తెలియకుండుట (ఎల్లోస్, నేట్రమూర్).

10 బహిష్టులో ప్లీహమునందు నొప్పి.

11 చురుకుగా నెమగుటవలనగలుగు వ్యాధులు: కండ్లు విస్తారముగా నుపయోగించుటవలనను, కండ్లకెక్కుడు వ్యాయామము కలుగ జేయుటవలనను బడిబాలికలలో కలుగు తలపోటు (కల్కేరియా ఫాసు, నేట్రమూరు).

12 నడుములోను కాళ్లలోను చితుకకొట్టినట్లు బాధలు.

13 రోగులకు కాళ్లు నిస్సత్తువుగానుండి వణుకుట. నడుచునప్పుడు సుల భముగా పడిపోవుట: నీరసము: జీవితమునందు నిర్లక్ష్యము.

14 అతిమూత్రము: తెల్లటిపాలవంటి విస్తారమైన మూత్రము వెడ లుట: రాత్రిభాగమున నీళ్లవంటి స్వచ్ఛమైన మూత్రము విస్తార ముగ వెడలుట: మూత్రమునందు వెంటనే తెల్లటి మేఘమువలె ఏర్పడుట.

15 శుక్లనష్టము: తరుచుగ విస్తారము మిక్కిలి సత్తువగలుగజేయు శుక్లము స్కలనమగుట: సంయోగానంతరము స్కలనము: సం యోగానంతరము అధికమైన వాంఛ: ఒక్కరాత్రియే అనేకసార్లు స్కలనమగుట:

16 సన్నిపాతజ్వరములో మగత: రోగి ఎట్టికోరిక లేక మొద్దువలె పడి యుండుట: చుట్టు ఏమున్నది ఏమిజరుగుచున్నది తెలియక రోగి మగతలోనుండుట. సంధి: గొణుగుకొనుట: లేపిన స్మృతిగలిగి సరియైన సమాధానముచెప్పి తిర్గి మగతలోపడుట (ఆర్నికా).

17 ఎముకలలో పోట్లు: వాపు: సెగసవాయి, పాదరసము సంబంధ మైన యెముకలవాపులు: మంట. పోటు: కత్తితో కోసినట్లు బాధ.

## ఫైటోలక్కా :— { (సైకోసిస్ దోషహారణకరము.) (సిఫ్లిస్ దోషహారణకరము)
**(Phytolacca)**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| గ్రంథులు { స్తనములయందలి. కంఠము నందలి. గదవల. | లేచుట. |
| | చలనము. |
| | గుటకవేయుట. |
| కండరములు { మెడ. వీపు. | వేడిపానీయములు. |
| | చల్లటి శీతలరాత్రులు |
| మజ్జాతంతువులు { మెడయొక్క. వీపుయొక్క. కీళ్లయొక్క. | గాలిమార్పు. |
| | **ఉపశమనములు.** |
| ఉదరపైభాగము : మూత్రపిండములు నాలుక. | కడుపుపై పరుండుట. |
| జీర్ణావయవము ; | చల్లనిపానీయములు. |
| కుడివైపు : | |

1 మింగునపుడు ముక్కు మొదలుభాగమునందు విపరీతమైన భాధ.

2 మ్రింగుట కష్టముగానుండుట : మ్రింగునపుడెల్లను, రెండుచెవులలోను పొడుచుచున్నట్లు బాధ, కంఠములో మంట. వేడినీళ్లు త్రాగలేకపోవుట.

3 కంఠమునొప్పి : కొండనాలుక వాలుట.

4 స్తనములు గట్టిగాను బాధగాను బలువుగాను యుండుట. శిశువు పాలు త్రాగునపుడు స్తనములయందలి బాధ శరీరమంతయు ప్రాకుట.

5 స్థనములయందలి కండరములు రాయివలె గట్టిపడి చీముపట్టి కురుపు తేలకుండుట: స్థనములయందలి రణము: దుర్వాసనతో కూడిన చీము: రణము చీముపట్టక, మానక, గౌరవర్ణముగానుండుట.

6 చన్మొనలు నొప్పిగాను, పచ్చిగాను యుండుట. పగులుట (గ్రాఫైటీస్).

7 త్వరగా చీముపట్టించి పగులునట్లుచేయును (హెఫార్, మెర్క్యురీ, సిలీకా).

---

## పిక్రిక్ యాసిడ్ :—(Picric Acid)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| ాిరములు { మెదడునందలి. ముచ్చిలిగుంటయందలి నడుములోని. } | శరీరమానసికవ్యాయామము. |
| మూత్రపిండములు. | శుక్లనష్టము ; ఉష్ణము. |
| మర్మావయవములు. | **ఉపశమనములు.** |
| | విశ్రాంతి : శీతలము : పట్టీబిగించి కట్టుట. |
| | సూర్యరశ్మిలో. |

1 బలహీనతజెందిన నాడీమండలమును (Nervous system) బలపరచును. నిస్సత్తునను బోగొట్టును (కాలీఫాస్).

2 చదువుటవలనను, వ్రాయుటవలనను, లేక మానసికపరిశ్రమగావించుటవలనను గలుగు విస్తారమైన శరీరమానసిక దుర్బలము.

3 విద్యార్థులకు, ఉపాధ్యాయులకు, వ్యాపారస్థులకు గలుగు తలనొప్పి.

## ప్లాటినా :—(Platina)

స్థానములు.

స్త్రీ మర్మావయవములు.

నరములు { స్పర్శజ్ఞాన : / చలన : / రుచికిసంబంధించిన.

ఉద్రేకములు.

ఉద్రేకములు { సంయోగ సంబంధమైన. / ఆశాభంగముకలిగించు. / మర్మావయవస్పర్శ :

నరములని స్త్రాణ.

ఉపశమనములు.

చల్లగాలిలో నడుచుట.
సూర్యరశ్మి.

ముఖ్యముగ స్త్రీల కనుకూలించు యౌషధము.

1 వర్తనయందు మిక్కిలి గర్వముగను దురుసుతనముగను, పొగరుగను నుండుట : ఇతరులను అతినీచముగ చూచు స్వభావము గలిగి యుండుట.

2 సంయోగమునందు స్త్రీమర్మావయవము మిక్కిలి నొప్పిగానుండుట. సంయోగము భరింపలేకపోవుట : సంయోగము భరింపలేక స్మృతి తప్పిపడుట.

3 మదపిచ్చి : అపస్మారతత్వముగల స్త్రీలకు గలుగు అపస్మారము (Hysteria) కంపములు.

4 మలబద్ధము : తరుచు కొంచెము కొంచెముగా నెమ్మదిగా సంప్రాప్తించు విరేచనములు : గర్భిణీలో మలబద్ధము : నర్వ్సవాహికావలన నివారణకాని కఠినమయిన మలబద్ధము :

శరీరమునందలి వ్యాధిలక్షణములు తగ్గినంతనే మానసిక లక్షణములు ద్రేకించును. ఇట్లే మానసికలక్షణములు తగ్గినంతనే శరీర లక్షణాము లుద్రేకించును.

---

## ప్లంబం :— (Plumbum)

(శోరాదోషహరణకరము)

**స్థానములు.**

రములు Cord— { కండరములు. ఉదరము : మూత్రపిండములు. బొడ్డు : }

క్తనాళములు : రక్తము.

**ఉద్రేకములు.**

శుభ్రమయిన వాతావరణము.

వ్యాయామము : చలనము :

సంఘము :

మెత్తని వస్తువులు పట్టుకొనుట :

**ఉపశమనములు.**

గట్టిగా నొక్కి అదుముట :

రాయుట.

1 పండ్ల యిగుళ్ల వంచలయందు ప్రత్యక్షముగ యగుపడు నీలివర్ణపు గీత. ఇగుళ్లువాచి నల్లగానుండుట.

2 విపరీతమయిన శూల : తీగచుట్టి లాగుచున్నట్లు కడుపు వెన్నెముకకు లాగుకొనిపోవుట.

3 పొత్తికడుపునుండి కడుపులో యితరవైపులకు విస్తరించి నులిబెట్టునట్టి బాధ : నొక్కిపెట్టుటవలన ఉపశమనముగ నుండుట.

4 మలబద్ధము : గట్టిగా రాళ్ళవలె కొంచెముగా వెడలు విరేచనము అతికష్టముమీద వెడలుట. విరేచనము గొర్రెపెంటికలవలెను, నల్లగను, ఆకుపచ్చవర్ణముగను గట్టిగా కష్టముమీద వెడలుట.

5 కాళ్లలో ముఖ్యముగా తొడలనుండి మోకాలువరకు తిమ్మిరితో కూడిన విడిచి విడిచివచ్చు పోట్లు : కదలికవలన నీపోట్లుహెచ్చుట.

6 ముఖము జిడ్డుగానుండుట (నేట్రమూర్)

7 కడుపులో పోటు బయలుదేరి నఖముఖములకు విస్తరించుట.

8 మూత్రముయొక్క సాంద్రత (Specific gravity) తగ్గుట.

---

## పోడోఫిలిమ్ :— (Podophyllum)

(శోధదోషహారణకరము)
(సూడోసోరిక్)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| కాలేయము { చిన్నప్రేగుల ప్రథమభాగము. ప్రేగులు. | ఉదయమున : భుజించుట. |
| మలాశయము. | వేడిగాలి : పిల్లలకు పండ్లువచ్చు వయస్సు. |
| కుడిభాగము { స్త్రీఅండాశయము. రెక్కగూడు. కంఠము. | పానీయములు త్రాగుట. |
| | చలనము : పాదరసము. |
| | **ఉపశమనములు.** |
| | కడుపుపై పరుండుట. |
| | కాలేయమును తట్టుట. |

1 మలకోశసంబంధమైన వ్యాధులలోను పిల్లలకు పండ్లువచ్చుకాలము లోను తలవేడిగానుండి మూల్గుచు రోగి తల నిటునటు దొర్లించు చుండుట (బెల్, హెల్లిబోరస్).

2 ముఖ్యముగా పండ్లువచ్చుకాలములో రాత్రిభాగమున పండ్లుకొరు కుట.

3 దీర్ఘకాలమునుండిగల విరేచనములు : విరేచనములు ఉదయమున ప్రారంభించి మధ్యాహ్నమువరకువెళ్లి అటుపిమ్మట సాయంత్రము సాధారణ విరేచనమగుట: కడుపులో మిక్కిలి నీరసము.

4 దాహము : దాహమైనప్పుడెల్ల విస్తారముగా నీళ్లుత్రాగుట(బ్రయో)

5 పిల్లలలో కలుగు విరేచనములు : నీళ్లుపోయునపుడు విరేచనములు వెడలుట : భోజనముచేసినపిమ్మట విరేచనములు వెడలుట.

6 విరేచనములు ; ఆకుపచ్చగాను, నీళ్లవలెను, విస్తారముగను, దుర్వాసనగాను (కల్కేరియా) పిచికారీకొట్టినట్లు (ఫాస్ఫరస్) సుద్దవలెను, జిగురువలెను, అజీర్ణముగను, పసుపుపచ్చగా పిండివలెను వెడలుట.

7 విరేచన మగుటకుముందు, విరేచనము వెళ్లునపుడు ఆసనము క్రిందకుదిగజారుట. (Prolapse of rectum).

8 బలువులెత్తుట వలనను, బలువు పనులు చేయుట వలనను, మలబద్ధము వలనను, ప్రసవానంతరమునను గర్భకోశము జారుట.

9 వ్యాధి లక్షణములు ఉదయమున ఉద్రేకించును. (ఎల్లోస్, నక్సువా, సల్ఫర్).



సోరినమ్ ;— { (సోరాదోషహరణకరము) (సైకోసిస్ దోషహరణకరము)

**(Psorinum)**

స్థానములు.

చర్మము { మడతలు, రసిస్రావగ్రంథులు.

చెవులు.

మలకోశములు.

శ్వాస.

కుడిభాగము.

ఉద్రేకములు.

శీతగాలి : చన్నీళ్ళ స్నానము.

శీతకాలము.

పడకవేడి : వ్యాయామము.

ఉన్ని దుస్తులవేడి

అణచిపెట్టు : అవయవములు.

ఒకదానికొకటి తగులుట.

ఉపశమనములు.

తల పల్లములో పెట్టి పరుండుట :

శాంతముగా పరుండు: భుజించుట

ముక్కునుండి రక్తస్రావము :

గట్టిగా అదిమిపట్టు :

1 సోరా తత్వవ్యక్తులకు ముఖ్యముగా ఉపయోగించును.

2 దీర్ఘవ్యాధులలో వ్యాధిలక్షణములకు మిక్కిలి సారూప్యమగు ఔష ధమును ప్రయోగించినపుడు సుగుణము యగుపడని పరిస్థితుల యందును లేక స్థిరమయిన సరియగు సుగుణము యగుపడని పరిస్థి తులయందును యీ ఔషధమును ప్రయోగించిన వ్యాధి నివారణ యగును. (తరుణ వ్యాధులలో యిట్టి పరిస్థితులయందు సల్ఫర్ ప్రయోగింపవలెను). వ్యాధిలక్షణములకు సల్ఫరు అనుకూలించు ఔషధమైయుండి పనిచేయనపు డీ ఔషధ ముపయోగించును.

3 తీవ్రమైన తరుణవ్యాధి నివారణమైన పిమ్మట సరియగు స్వస్తత చేకూరకుండుట : సరియైన ఆకలి పుట్టకపోవుట. నీరసముగను నిస్సత్తువుగను పాలిపోయియుండు పిల్లలు : జబ్బుగానుండు పిల్లలు నిద్రపోక, రాత్రింబవళ్లు బాధించుచు ఏడ్చుచుండుట.

4 విస్తారమైన నీరసము : నిస్సత్తువ : జీవద్రవములు పోవుటవలన కలుగు నీరసము : తరుణవ్యాధులు తగ్గినపిమ్మటయుండు నీరసము.

5 శరీరము దుర్వాసనగాయుండుట. స్నానముచేసినను శరీరము దుర్వాసనగా యుండుట.

6 శరీరమంతయు నొప్పిగాయుండుట : సులభముగా బెణికిదెబ్బలు తగులుట.

7 చలిగాలి భరింపలేకపోవుట : గాలిమార్పు సహించలేకపోవుట : మండువేసవిలోగూడ తలకు చలిటోపీ ధరించి శాలువకప్పుకొనుట.

8 చిడుము చర్మవ్యాధులు అణచిపెట్టుటవలన కలుగు బాధలు.

9 శరీరమునుండి విసర్జింపబడు విరేచనములు, కుసుమ, బహిష్టు స్రావము, చమట, మొదలగు సమస్తము మిక్కిలి దుర్వాసనగలిగి యుండుట.

10 విపరీతమైన దురదచే రోగి అధైర్యము జెందుట.

11 తలపోటు : తలపోటుకు ముందు కండ్లు మిరుమిట్లుగొల్పి, దృష్టి మాంద్యము కలుగుట : అంధత్వమువచ్చుట : తల పోటుగానున్న సమయమున ఆకలిగానుండుట : భుజించినప్పుడు తలపోటు తగ్గుట (ఎనకార్డియమ్, కాలిఫాస్).

12 జుట్టు అంటుకొనిపోయి అట్టలుకట్టుట (లైకో).

13 తలపై దుర్వాసనతోను, చీముతోను, రసికారుచుండు పొక్కులు : పక్కులుకట్టిన పొక్కులు (గ్రాఫైటిస్, మెజీరమ్).

14 కండ్లువాచుట : రెప్పలెత్తి కండ్లు చూడలేకపోవుట. తలగడలోనికి తలదూర్చి పరుండుట.

15 చెవులనుండి దుర్వాసనతోకూడిన చీము కారుచుండుట.

16 అర్ధరాత్రి సమయమున ఆకలివేయుట : ఏదో యొకటి తినుట కుండవలెను (సినా, సల్ఫర్). ముఖ్యముగా పిల్లలు రాత్రి నిద్ర నుండి లేచి తినుటకేదైన కావలయునని యేడ్చుచుందురు.

17 కుళ్లిన కోడిగుడ్డువంటి వాసనతోకూడిన త్రేణుపులు (గ్రాఫైటిస్, యాంటిటార్ట, ఆర్నికా).

18 ఆపుకొనుట కష్టతరమైన విరేచనములు (ఎల్లోస్, సల్ఫరు) : నీళ్ల వంటి, లేక గౌరవర్ణమైన, దుర్వాసనగల విరేచనములు ; విరేచనము లప్రయత్నముగ వెడలుట ; విరేచనములు రాత్రి ఒకటి నాలుగు గంటలమధ్య ఉద్రేకించును.

19 కఠినమైన మలబద్ధము : నడుమునొప్పి : సల్ఫరు మలబద్ధమును నివారణజేయజాలనప్పుడిది పనిచేయును.

20 దీర్ఘకాలము కొన్ని సంవత్సరములనుండి నివారణచేయ బడజాలకయు అణచిపెట్టబడజాలకయు యున్న సెగ : సెగనివారణ జేయుటకు లక్షణసారూప్యమున కనుకూలమైన మందు ప్రయోగించినపుడు పనిచేయనపుడీ ఔషధము ప్రయోగించిన నివారణయగును.

21 కుసుమ : మిక్కిలి దుర్వాసనగలిగి ముద్దలుముద్దలుగా వెడలుట : నడుములో తీవ్రమైన బాధ : నీరసము.

22 గర్భిణీసమయములో, విడువనివాంతులు : పిండము మిక్కిలితీవ్రముగ కదులుట.

23 తరుణవ్యాధుల యనంతరము విస్తారమైన చమట : యిందుమూలమున సమస్తమైనబాధలు శాంతించుట (నేట్రమూరు).

24 క్షయ: బహిరంగమైన గాలిలో వగర్పు హెచ్చుట: పరున్న తగ్గుట: (ఆర్పుకు వ్యతిరేకము) చనిపోవుదునని రోగి భావించుట.

25 ప్రతిశీతకాలములోను దగ్గువచ్చుట.

26 దగ్గు: చిడుము, మంత్రపుపొక్కులు అణచిపెట్టుటవలన వచ్చు దగ్గు; సంవత్సరములనుండిగలదగ్గు: ఉదయమున లేచినపిమ్మటను, సాయంత్రము పరున్నపిమ్మటను (ఫాస్ఫరస్, ట్యూబర్క్యులినమ్) ఉద్రేకించుదగ్గు: శ్లేష్మము ఆకుపచ్చగాను, పసుపురంగుగాను యుండును. లేక ఉప్పని శ్లేష్మము.

27 విపరీతమైన దురదచేతను, భయంకరమైన కలలచేతను నిద్రలేమి (నేట్రమూర్).

N. B:—సోరానిమిత్తము మాత్రమే యీ ఔషధమును ప్రయోగింపరాదు. లక్షణసారూప్యమునుబట్టి మాత్రమే ప్రయోగింపవలెను.

---

పల్సుటిల్లా:—(Pulsatilla) (సూడోసోరిక్)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| మనస్సు. | వేడిగాలి: వేడిగది. పక్క. |
| శిరలు. | ఉష్ణమైనబట్టలు. |
| ఆమత్వ చలములు: నాలుక. జీర్ణకోశము. మలకోశములు. స్త్రీ మర్మావయవములు. మూత్రావయవములు. | కాళ్ళు తడుపుట. |
| | అణచిపెట్టుట. |
| | సాయంత్రము: విశ్రాంతి. |
| | నడచుటకు ప్రారంభమున. |
| | పరుండుట. |

శ్వాస.
ఒకభాగము.
హృదయము కుడివైపు.

ఒక ప్రక్క పరుండుట: ఎడమ వైపు పరుండుట.
అజీర్ణపదార్థములు భుజించుట.
క్రొవ్వుపదార్థములు: మంచు.
కోడిగ్రుడ్లు భుజించుట.
భోజనమైన చాలసేపునకు.
రజస్వలయగు వయస్సు: గర్భిణి.
బహిష్ఠుకుముందు.
లోహము: కైనా.

ఉపశమనములు.

శీతలము: బహిరంగమైన మంచి గాలి.
కప్పుకొనకుండుట.
నిలువగా కూర్చుండుట.
నెమ్మదిగా కదలుట.
చాలసేపు ఏడ్చినపిమ్మట.

1 మానసికస్వభావము: పెంకితనములేక సౌమ్యముగను, నెమ్మదిగను పిరికితనముగను యుండును: స్త్రీల ఔషధము.

2 సులభముగ ఏడ్చుట: ఏడ్వకుండ వ్యాధిలక్షణములు చెప్పలేక పోవుట (వ్యాధిలక్షణముల నడిగినపుడే ఏడ్చుట సిపియా; నమస్కరించినపు డేడ్చుట లైకో).

3 ముఖ్యముగా పిల్లలవ్యాధులకు స్త్రీలవ్యాధులకు అనుకూలించును.

4 బహిష్టు స్రావము తక్కువగానుండుట లేక చాలదినములు బహిష్టు స్రావము యగుచుండుట (గ్రేఫైటీస్).

5 ఋతుమతి యైనప్పటినుండి సరియైన ఆరోగ్యము లేకపోవుట : రక్త హీనత. క్షయ. దగ్గు. యువ్వనులు ఋతుదోషములతో రక్త హీనతజెంది, వారిశరీరచ్ఛాయ ఆకుపచ్చని వర్ణములోనికి మారుట.

6 ఆమత్వచలములనుండి (mucus membranes) వచ్చు సమస్త స్రావములు చిక్కగాను, జిగురుగాను, ఆకుపచ్చ, పసుపువర్ణము కలసిన రంగుతో నుండుట (కాలీసల్ఫు, నేట్రమ్‌సల్ఫు).

7 రొంప : రొంపచే ముక్కులు బిగవేయుట, లేక చీమిడికారుట : రొంపచే రుచి తెలియకపోవుట : వాసన తెలియకపోవుట : ముక్కులు పచ్చిగానుండుట ; వరయుట ; ముక్కునుండి ఆకుపచ్చ, పసుపు రంగు కలిసినవర్ణములో స్రావముకారుట.

8 కడుపులోను, నడుములోను రాయిపెట్టినట్టుండుట. కాళ్లు మొద్దెక్కుట. ఒక్కొక్కప్పుడు తరుచు విరేచనానుమానము.

9 నిద్రబోవునపుడు నోరు కంఠము ఆరుకుపోరుట : ఆరుకొనిపోయిన నోరుతో మేల్కాంచుట. దాహములేకపోవుట.

10 బలకరమైన పదార్థములు భుజించుటవలన జీర్ణకోశము చెడుట. పులిత్రేనుపులు. ఉదయమున నోటియందు అరుచి.

11 లక్షణములు ఎప్పుడూ మారుచుండుట. జ్వరములోవచ్చు చలి ఒకేరీతిగా నుండకుండుట : ఏ రెండువిరేచనములు ఒకేరీతిగా నుండకుండుట. ఒకగంటలో సుఖముగా నుండుట. వేరొకగంటలో విచారగ్రస్తముగా నుండుట.

12 బాధలు : లాగుచున్నట్లు, పీకుచున్నట్లు యుండుట. ఒకభాగము నుండి వేరొకభాగమునకు మారుచుండుట ; కీళ్ళువాచుట : యీ

బాధలతో చలి : బాధలు హెచ్చినకొలది చలిహెచ్చుట : బాధలు ఆకస్మికముగవచ్చి క్రమముగా తగ్గుట.

13 దాహము లేకపోవుట : సమస్తమైనబాధలలోను దాహముండదు. గాని నోరు ఆరుకొనిపోవుచుండును. ఉదయమున విపరీతముగ నోరు ఆరుకు పోవుచుండునుగాని దాహముండదు (నోరుతడిగానుండి విపరీతమైనదాహము మెర్క్యురీ) నోటినుండి దుర్వాసన.

14 గడవలు వాచుట : స్తనములు వాచుట : వృషణములు వాచుట. పోటు సలుపు.

15 విరేచనములు : సాధారణముగా విరేచనములు రాత్రి వెడలును : ఆకుపచ్చ పసుపురంగు కలసినవర్ణముగ వెడలు శ్లేష్మవిరేచనములు. ఆహారము భుజించినవెంటనే విరేచనములు వెడలుట : చల్లనిపదార్థములుగాని చల్లటి ఆహారముగాని పండుగాని తినినపిమ్మట వెడలు విరేచనములు (ఆర్సె, బ్రయో) (ఉల్లిపాయలు తినినపిమ్మట వెడలు విరేచనములకు తూజా. పాలు త్రాగుటవలన వెడలు విరేచనములకు, కల్కేరియాకార్బ ; నేట్రమ్‌కార్బ, సల్ఫర్ ; అపరిశుద్ధమైన నీరు త్రాగినమీాద వెడలు విరేచనములకు కేంఫర్)

16 యుక్తవయస్సు వచ్చినపుడు కలుగు బాధలు : ఋతుస్రావ మనాది పట్టబడుట : ఆలస్యముగ యగుట : కొలదిగయగుట : సకాలములో జరుగకుండుట : విడిచివిడిచి స్రావముయగుట : సాయంత్రము చలి వచ్చుట : ప్రథమరజస్వల ఆలస్యమగుట :

17 ఋతుశూల : యీా బాధచే అస్థిమితముతో యిటునటు కొట్టుకొనుట. (మేగ్‌ఫాస్) : పగటిపూట మాత్రము ఋతుస్రావమగుట.

కుసుమ : మర్మావయవమున వరుపు మంట గలుగజేయు కుసుమ : నడుము నొప్పి.

18 చిన్నపిల్లలలో రాత్రిభాగమున మూత్రము అప్రయత్నముగా వెడలుట

19 గర్భస్రావము గలుగనుండుట : ప్రసవము ఆలస్యమగుట : పిండము అడ్డము తిరుగుట. (పెద్దపొటెన్సీలో నీఔషధము ప్రయోగించిన శస్త్రసాధన మవుసరములేకనే సుఖప్రసవము గావించును.)

20 కంటిరెప్పలపై కురుపులు ; ముఖ్యముగా పైరెప్పపై బయలుదేరు బాధకరమగు కురుపులు : సెగ సంబంధమయిన కంటిజబ్బులు. కండ్లు దురదగానుండుట : నీళ్ళుకారుట. చిక్కటి పసుపురంగు పుసులు కారుట : కండ్లు వాచుట : అంటుకొనుట.

21 దీర్ఘవ్యాధులచికిత్స ప్రారంభించుటకు ఉత్తమమయిన ఔషధము (కాల్ కేరియా, సల్ఫర్).

22 లోహము, క్వైనా, లేక టానిక్ లు విస్తారము చాలకాలము వాడుటచే కొన్నిసంవత్సరముల క్రిందటనైనను, రక్తహీనమయిన రోగుల కనుకూలించును. క్వైనా, పాదరసము, గంధకము దుర్వినియోగపరచుటచేతను, టీ తాగుటచేతను, సంభవించు బాధలు, వ్యాధులు.

23 ఒక కీలునుండి వేరొక కీలుకు మారుచుండు మేహవాతనొప్పులు ; కీళ్ళు వాచుట : సెగ సంబంధమయిన వ్యాధులు అణచిపెట్టుట వలన కలుగు కీళ్ళనొప్పులు :

24 అణచిపెట్టబడిన సెగస్రావమును బైటకు తీసికొనివచ్చును (మెడోరినమ్).

25 చట్టకీలులో (Hip Joint) బాధ: మోకాళ్ళు వాచి బాధకరముగ నుండుట; సాయంత్రమున మడమలోపోట్లు; చలితోను, అస్థిమితముతోను, నిద్రలేమితోను, చట్టలలోను, కాళ్లలోను లాగుచున్నట్లు పొడుచుచున్నట్లు బాధ; కాలు క్రిందకు వేలాడవైచిన బాధ హెచ్చుట; కాళ్ళు ఎర్రగా వాచి పోటుగానుండుట; కాళ్లు బరువుగానుండుట; చేతులయందలి నరములు వాచుట.

26 సాయంత్రమున రాత్రిభాగముల పొడిదగ్గు: స్వస్తతగానుండుటకు కూర్చొనవలసి యుండుట; ఉదయమున దగ్గుతో విశేషముగ శ్లేష్మముపడుట: గుండె బిగబట్టి నొప్పిగాను బరువుగానుండుట: దగ్గినపుడు మూత్రము అప్రయత్నముగా వెడలుట (కాస్టి, నేట్రం, మూర్). ఆకుపచ్చని చేదుగానుండు చిక్కని శ్లేష్మముపడుట.

27 వ్యాధిలక్షణములు బహిరంగమైన గాలిలో ఉపశమనముగనుండును. బాధగల భాగమున పరున్న ఉపశమనముగ నుండును (బ్రయో). చల్లటి పట్టువేయుటవలన ఉపశమనముగనుండును (కాలీమూర్). భుజించినను, చల్లటిపానీయములు త్రాగినను బాధలు ఉపశమనముగ నుండును.

**N. B:**—పల్సటిల్లా రోగి నక్సువామికా రోగినవలె పెంకిస్వభావము గలిగియుండక సౌమ్యమైన స్వభావము గలిగియుండును. పల్సటిల్లా రోగి ఏడ్చుచు తనవ్యాధిలక్షణములను తెల్పును. సిపియారోగి తనవ్యాధిలక్షణంబు లడిగినపు డేడ్చును.

## పైరోజిన్ :—(Pyrogen) { (శోరాదోషహరణకరము) (సైకోసిస్ దోషహరణకరము)

**స్థానములు.**

రక్తము : హృదయము.
రక్తప్రసరణ :
కండరములు.

**ఉద్రేకములు.**

ఒకప్రక్కనుండి వేరొకప్రక్కకు మారుచుండుట :
గట్టిగా ఉయ్యాల ఊపుట ;
శీతలము ; తేమ ;

**ఉపశమనములు.**

ఉష్ణము : వేడినీళ్లతో తడుపుట.
కాపటములు.
అదిమిపట్టుట.

1 మలసంబంధమయిన విషవాయువులను పీల్చుటవలన కలుగు విష వ్యాధులకును, సన్నిపాతజ్వరము, సూతికాజ్వరము, మొదలగు విషజ్వరములకును, ఉపయోగించును : పుండ్లు, రణములు, గాయములు, విషతుల్యమగుట (septic) ; సమస్తస్రావములు మిక్కిలి దుర్వాసనగానుండును.

2 పరున్నపక్క మిక్కిలి గట్టిగా యుండును (ఆర్నికా). పరున్నవైపున గల భాగములు నొప్పిగానుండును (బాప్టీషియా). పుండ్లుపడును.

3 విపరీతమయిన అస్థిమితము ; నొప్పి విశేషముగనున్న భాగములకు ఉపశమనము గలుగుటకు రోగి నిరంతరము నాభాగములను కదల్చుచుండును.

4 నాలుక : మిక్కిలి ఎర్రగానుండుట ; పొడిగానుండి పగులుట ; కదల్చుట కష్టముగానుండుట ; నాలుకపై వార్నీసు. వేసినట్లు నున్నగా నుండుట.

5 నోటియందు తియ్యనిరుచి : విపరీతమయిన దుర్వాసన ; కుళ్ళు చీమువంటి వాసన.

6 మలబద్ధముతో వాంతులు ; విడువక బాధించుట ; బూడిదవర్ణము లేక కాఫీరంగువంటి వాంతులు.

7 మిక్కిలి దుర్వాసనగల విరేచనములు (సోరినం) విరేచనములు బూడిదరంగుగాగాని, నల్లగాగాని, వెడలుట ; బాధలేక అప్రయత్నముగా వెడలుట ; గాలిపోవుచున్నదో లేక విరేచనమగుచున్నదో తెలియకపోవుట.

8 మలబద్ధము ; విరేచనానుమానమే లేకపోవుట (ఓపి). జ్వరములో మిక్కిలి కఠినమైన మలబద్ధము ; విరేచనము పెద్దదిగను నల్లగను రాళ్ళవలె వెడలుట.

9 పిండము లేక మావి బైటపడక, లోపల కృళ్ళిపోవుట. పిండము చనిపోయి నల్లబడి కొన్ని దినములు లోపలుండుట. మర్మావయవము నుండి మిక్కిలి దుర్వాసనతో కూడిన స్రావము వచ్చుచుండుట.

10 ప్రసవములేక గర్భస్రావము సంభవించినపిమ్మట కలుగు విషజ్వరములు ; సూతికాజ్వరము.

11 ప్రసవమైల ; పల్చగను, బూడిదరంగుగను, వరుపు గలుగజేయునదిగను (Acrid) మిక్కిలి దుర్వాసనతో వెడలుట (నైట్రిక్ యాసిడ్) : మయిల అణచిపెట్టబడుట ; అందుపై చలిజ్వరము, దుర్వాసనతో కూడిన విస్తారమయిన చమట.

12 నాడిగమనము అతివేగముగనుండుట; శీతోష్ణస్థితికి (Temparature) మిక్కిలి వ్యత్యాసముగనుండుట ;

3 శరీరముపై మిక్కిలి దుర్వాసనతో కూడిన రణములు; మిక్కిలి దుర్వాసనగల స్రావమును వెలువరించు గర్భకోశ రణములు.

4 చలి, వణుకులతోను రెక్కలభాగములమధ్య ప్రారంభించును; విష జ్వరములలో శీతోష్ణస్థితి (Temparature) 103 మొదలు 106 వరకుగల హెచ్చుడిగ్రీలలో ప్రారంభించును శరీరము ఆకస్మికముగ వేడెక్కి చర్మము పొడిగాను మంటగాను యుండును. నాడి అతి వేగముగను, సూక్ష్మముగను తిరుగవలెను, నుండి నిముషమునకు 140 నుండి 170 వరకు కొట్టుచుండును. విస్తారమయిన ఉష్ణముతో విస్తారమయిన వేడి చెమటపట్టును. చెమటపట్టుటవలన కొంపరేచకు తగ్గదు. రోగి అర్ధనిద్రలో నున్నట్లగుపడును.

15 సన్నిపాత సూతికాజ్వరములలోను విషజ్వరములలోను అద్భుతముగ పనిచేయును.

16 సరియైన ఔషధమును ప్రయోగించినపుడు ఆ ఔషధము పనిచేయనపుడును స్థిరమయిన సుగుణము యగుపడనపుడును యీ ఔషధము పనిచేయును.

---

## రటన్ హియా :—(Ratanhia)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| మలాశయము; ఆసనము, | రాత్రి; మనస్తాపము; ఉష్ణము; |
| చనొమొనలు. | వ్యాయామము; స్పర్శ; |
| పండ్లు. | **ఉపశమనములు.** |
| | చల్లని నీళ్ళతో తడుపుట. |
| | బహిరంగమైన గాలిలో నడచుట; |

1 మలబద్ధము ; విరేచనము గట్టిగా, మిక్కిలి ప్రయాసతో వెడలుట మూలశంఖ బైటకు వచ్చుట ; విరేచనమయినపిమ్మట ఆసనమున చాలసేపువరకునుండు పోటు ; ఆసనమునమంట (సల్ఫర్) ; మల కోశములయందు శక్తితగ్గుట (Inactivity). విరేచనమయినపిమ్మట ఆసనములో మేకు లేక గాజుముక్క గ్రుచ్చుకొనుచున్నట్లు బాధ (తూజా).

2 ఆసనము చిట్లుట ; ఆసనము మిక్కిలి నొప్పిగానుండుట ;

3 పాలిచ్చు స్త్రీలకు చన్మొనలు చిట్లుట (గ్రాఫైటీస్, సిపియా).

---

## రూమ్ :—(Rheum)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| కండరములు { పైత్యకోశముల యొక్క చిన్నప్రేగుల ప్రథమ భాగము యొక్క ప్రేగుల యొక్క. | పండ్లువచ్చువయస్సు. |
| | భుజించుట. |
| | వేసవి. |
| | పాలిచ్చుతల్లులు. |
| కాలేయము. | **ఉపశమనములు.** |
| | ఉష్ణము ; కప్పుకొనుట. |

1 పలువిధములైన వస్తువులకొరకు వాంఛగాని భుజింపలేకపోవుట ; భర్జించకపోవుట.

2 విరేచనములు ; మిక్కిలి పుల్లని వాసనతో వెడలు విరేచనములు ; శూలలతోకూడిన విరేచనములు ; బూడిదరంగుగా వెడలు విరేచనములు.

3 శరీరము పుల్లటివాసన వేయుట : అనుదినము స్నానముచేయించినను శిశువు శరీరము పుల్లనివాసనగా నుండుట (హెపార్, మెగ్నిషియా కార్బ).

---

## రోడోడెండ్రన్ :—(Rhododendron)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| ధాతుమజ్జా తంతువులు { మోచేతి ముందు చెయ్యి ; క్రిందికాలు. చిన్నకీళ్ళు. | గాలివానకుముందు. విసురుగాలి ; తేమగాలి ; శీతలగాలి ; మబ్బు ; గాలిమార్పు ; రాత్రి ; వేసంగిమధ్య ; సారాయము ; విశ్రాంతి ; |
| ఎముకలు : మర్మానయవములు ; నరములు. నాళనిర్మాణము. విడిభాగములు. | **ఉపశమనములు.** ఉష్ణము ; వేసవిలో ; చలనము ; తలకు బట్టచుట్టుట. |

1 లక్షణములన్నియు గాలివానకు ముందు, గాలివానసమయమున ఉద్రేకించును. ఉరుములతోకూడిన గాలివానయన్న భయము.

2 కీళ్లువాచుట : ఈ వాపులు ఒకకీలునుండి వేరొక కీలుకు మారుచుండును ; రాత్రి ఉద్రేకించును ; గాలివానసమయములోను, విశ్రాంతిసమయములోను ఉద్రేకించును.

3 వృషణములువాచుట : శగఅణిపెట్టుటవలన వృషణములువాచుట: గట్టిపడుట : కండరములు నులిబెట్టుచున్నట్లు బాధ : బుడ్డ.

---

## రూస్ టాక్సు :—(Rhus Tox)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| చర్మము { ముఖమునందలి. తలపై. మర్మావయవములపై. | వశ్యమగుట { తడి ; శీతలము. గాలి ; స్నానముచేయుట. చలి : ఉష్ణముగాను చమటగాను యున్నపుడు. |
| ధాతుమజ్జా తంతువులు { కణముల. అనుబంధతంతువుల కీళ్లతంతువుల. | కష్టపడకుండుట : చేతులు మొదలగునవి. |
| రక్తము. | నడువ ప్రారంభించినపుడు. |
| గ్రంథులు { ఫెరిటాయిడ్. పరోటీసు. | బెణుకులు ; అధికవ్యాయామము. విశ్రాంతి. |
| నరములు { కార్డు. తుంటిలనుండి పాదము వరకునుండు (Sciatic) | అర్ధరాత్రమునకు పిమ్మట. |
| ఎడమభాగము : కుడిభాగమునుండి ఎడమభాగమునకు. | |

ఉపశమనములు.

విరామములేని చలనము.

ఉష్ణము ; వేడికాపటము ; కష్టపడొనుట ; వేడినీటితోతడపుట.

రాయుట ;

ముక్కునుండి రక్తముకారుట.

కడుపుపట్టుకొనుట.

1 గుండెజబ్బుతో ఎడమభుజము లాగుట ; ఎడమవైపు అవయవములయందు కలుగుబాధలు.

2 మంట దురదతోకూడిన పొక్కులు.

3 రాత్రియం దస్థిమితము: ప్రక్కపై ఒక్కవైపున పరుండలేక తరుచు యిటునటు దొర్లుచుండుట.

4 నోటిచెలిగిలు పుండ్లుపడి మిక్కిలి నొప్పిగానుండుట మర్మావయవములయందును, చుట్టును, దురద: పుండ్లుపడుట: గెడ్డముమీదను నోటిచుట్టును జ్వరపొక్కులు.

5 ఋతుస్రావము మర్మావయవమున బాధ కలుగజేయును.

6 చాలసేపు కూర్చున్నను లేక ప్రయాణముచేసినను శీలమండె చుట్టును వాచుట.

7 కడుపు నొప్పిగాను పచ్చిగాను యుండుట; పరున్నభాగమునసీనొప్పి విస్తారముగాయుండుట; కదలుట ప్రారంభమున అధికముగా నుండును.

8 కదలుటకు ప్రారంభించినంతనే కీళ్లయందలి నొప్పులు. తదితర సంబంధమైన నొప్పులు విశేషమై నడచినకొలదియు క్రమముగ తగ్గును; విశ్రాంతియందు లక్షణము లుద్రేకించును; కదలిక వలన క్రమముగ తగ్గును (బ్రయోకు వ్యతిరేకము).

9 మహావాతనొప్పులు; ఈ నొప్పులు లేచి నడచుటకు ప్రారంభించునపుడు విశేషముగనుండి నడచినకొలది క్రమముగ తగ్గును (కదలకయున్న ఉపశమనముగనుండు లక్షణము (బ్రయో).

10 బెణుకులు; బరువులెత్తుటవలన బెణుకుట.

11 మిక్కిలి వేడిచేసినప్పుడు, వానలో తడియుటవలన కలుగుబాధలు.

12 తలపోటు: ఉష్ణోపచారములవలన ఉపశమనముగ నుండుట: పరున్నను, కూర్చున్నను ఉద్రేకించుట.

13 సన్నిపాతము: సౌమ్యమైనసంధి; మగత; అస్థిమితము; నాలుక పొడిగాను ఎఱ్ఱగానుయుండుట; పగులుట; కడుపు ఉబ్బరించుట; నాలుక చివరభాగమున త్రికోణాకారముగ ఎఱ్ఱగానుండుట.

14 విపరీతమైన దాహము; నోరు, నాలుక, కంఠము ఆరుకుపోవుట.

15 తరుణవ్యాధులు సన్నిపాతస్థితిలోనికి మారునపుడు పనిజేయును.

16 పక్షవాతము; వ్యాధిగలభాగము తిమ్మిరిగానుండును. తేమలో తిరుగుటవలన శీతలముజేసివచ్చు పక్షవాతము; అధికపరిశ్రమవలన వచ్చు పక్షవాతము: ప్రసవాంతరమువచ్చు పక్షవాతము; అధిక సంభోగము, చలిజ్వరము, సన్నిపాతజ్వరము మొదలగువ్యాధుల వలన వచ్చు పక్షవాతము: ముఖ్యముగ ఎడమభాగము వ్యాధిగ్రస్థమగును.

17 విరేచనములు; సన్నిపాతజ్వరము ఆరంభించునపుడు కలుగువిరేచనములు; విరేచనములు విస్తారమైన నీరసమునుకలుగజేసి అప్రయత్నముగ వెడలును. విరేచనములతో కాళ్లు క్రిందకు దిగలాగుకొని పోవుట.

18 మంత్రపుపొక్కులు; పసుపుపచ్చని పొక్కులు; తామర; పొక్కులు దురదగాను, మంటగాను, పోటుగానుయుండుట.

N. B.—ఏపిస్‌ను యీ ఔషధమునకు ముందుగాని వెనుకగాని వాడరాదు.

---

## రూమెక్సు :—(Rumex)

**స్థానములు.**

ఆమత్వ చలములు { కంఠము. గాలిగొట్టి. గొంతుక. మలకోశములు.

నరములు.

చర్మము ;

గుండె ఎడమభాగము.

కీళ్లు ; శీలమండెలు.

**ఉద్రేకములు.**

చల్లనిగాలి పీల్చుట.

బహిరంగమైన గాలిలో.

కప్పుకొనకుండుట.

రాత్రి ; నొక్కి-పట్టు ; గాలి గొట్టము ;

**ఉపశమనములు.**

కప్పుకొనుట.

1 చలిగాలి పీల్చుటవలనను, రాత్రిభాగమునను, విపరీతమయిన దగ్గు ; మిక్కిలి నీరసము కలుగజేయు పొడిదగ్గు ; శ్లేష్మము పడకుండుట ; మాట్లాడుటవలన ఉద్రేకించుట.

2 ఉదయమున వెడలు బూడిదరంగువంటి విరేచనములు.

3 గుండెలయందు మధ్యభాగమునను, కంఠమునందు నొప్పిగాను పచ్చిగాను యుండుట ;

4 ఎడమవైపు పరున్న దగ్గు ఉద్రేకించుట. (ఫాస్)

5 దగ్గునప్పుడు మూత్రము ప్రయత్నముగా వెడలుట (కాస్టి, పల్సు, సిలికా).

## రూటా :—(Ruta)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| మజ్జాతంతువులు { కండ్లు ; స్నాయువులు ; కండరములు. కీళ్లు ; మణికట్టు ; శీలమండ ; నడుము. | అధికవ్యాయామము { నేత్రములకు. దెబ్బలు. బెణుకులు. |
| ఎముక పై భాగము ; ఉపాస్థి ; | శీతగాలి ; చెమ్మ ; తడి ; |
| గర్భకోశము ; | పరుండుట ; కూర్చుండుట. |
| చర్మము ; | వంచను ఒత్తిడి. |
| | **ఉపశమనములు.** |
| | వీపుపై పరుండుట. |
| | ఉష్ణము ; |
| | చలనము. |

1 కండ్లు మంటలుగాను నొప్పిగాను యుండుట ; చాలసేపు చదువుట వలన లేక కుట్టుపని చేయుటవలన లేక యితరవిధముగా కండ్లకు ఎక్కువ పరిశ్రమ గలుగజేయుటవలన కలుగు మంట నొప్పి ; సాయంత్రము కండ్లకు ఎక్కువ పరిశ్రమ కలుగజేయుటవలన యీబాధలు కలుగుట ; కండ్లు వేడిగాను ఎర్రగాను బాధగాను యుండుట ; ప్రయాణము చేయుటవలన కలుగు కండ్ల మంటలు ;

2 ఎరువులు కముకుదెబ్బలు తగిలినట్లు శరీరమంతయు చితుకకొట్టినట్లు యుండుట ; అవయవములలోను కీళ్ళలోనుఈ బాధలు అధికముగా నుండుట.

3 కముకుదెబ్బలు ; ఎముకలకు తగిలిన దెబ్బలు (ఆర్నికా ఉపయోగించిన పిమ్మట (యీ బాధలు తగ్గనిపక్షమున ఈ నొప్పులను బాధలను యీ ఔషధము వెంటనే నివారణజేయును.)

4 దెబ్బలు తగిలినపిమ్మట కలుగు మలబద్ధము ; (ఆర్నికా).

5 నడుమునొప్పి ; నడుముపై పరుండుటవలన తగ్గుట.

6 విరేచనము గావించుటకు ప్రయత్నించినవెంటనే ఆసనము జారుట ; వంగున్న ఆసనము జారుట ; ప్రసవమయిన పిమ్మట ఆసనము జారుట.

7 దెబ్బలు తగులుటవలన వచ్చిన క్షయ.

---

సెబీనా :—(Sabina) (సైకోసిస్ దోషహారణకరము)

| స్థానములు. | ఉద్రేకములు. |
| --- | --- |
| స్త్రీ మస్తిష్కావయవములు { గర్భకోశము. మలాశయము నరములు. | రాత్రి : |
| రసస్రావధాతుమజ్జాది తంతువులు. { చిన్నకీళ్లు మణవాలు | ఉష్ణము { పడక : గది : వ్యాయామము. |
| | గర్భిణి : ముట్లుడుగుకాలము. |
| | మంచు కురియుచున్న వాతావరణము. |
| | **ఉపశమనములు.** |
| | శీతలము : చల్లదనము : |
| | బహిరంగమైన గాలి. |

1 నడుములో పొడుచుచున్నట్లు లాగుచున్నట్లు నొప్పి : ఈ బాధ పొత్తికడుపులోనుండి మర్మావయవమునకు విస్తరించుట ; శక్తి బాధ సమస్తవ్యాధులలోను యుండును.

2 గర్భస్రావమువలనను, మాసములు పూర్తికాకమున్నే ప్రసవించుటవలనను, గర్భకోశమునుండి రక్తస్రావము కలుగుటమూలమునను కలుగువ్యాధులు.

3 గర్భకోశ రక్తస్రావములు : రక్తము ఎర్రగను కండకండలుగను వెడలును : అణుమాత్రము కదలినను హెచ్చును (సికేల్) : నడచుటవలన తరచుతగ్గును : నడుములోనుండి పొత్తికడుపు దిగువభాగమునకు పోటు.

4 సంభోగవాంఛతో ఋతునెల మధ్యకాలములో మర్మావయవమునుండి రక్తము స్రవించుట.

5 గర్భకోశముయొక్క నిస్సత్తువచే మావిపడకలోపల నిలిచిపోవుట : విపరీతమైన ప్రసవాంతరనొప్పులు (కాలోఫిలిమ్, సికేల్).

6 మూడవమాసమున గర్భస్రావము కలుగుచుండుట.

7 ముట్లుడుగుకాలములో అంతకుపూర్వము గర్భస్రావము లనుభవించిన స్త్రీలకు రక్తస్రావములు కలుగుట.

8 గర్భకోశమునుండి అన్యపదార్థములను (foreign bodies) ఎదుగక కృశించి క్షీణించిన పిండముసంబంధమైన కండలను (moles) బైటకుత్రోసివైచును (కేంతారిస్).

9 దురద మంటతోకూడిన సురుపుడుకాయలు (తూజా, నైట్రిక్ యాసిడ్).

10 సంగీతము సహించలేకపోవుట, సంగీతము విచారము కలుగజేయును (తూజా).

---

## సెబడిల్లా :—(Sabadilla)

**స్థానములు.**

అమత్వచలములు { ముక్కు. ఆననము. జీర్ణావయవమార్గము.

నరములు.

కన్నీటిగ్రంధులు.

కంఠము.

**ఉద్రేకములు.**

శీతలము : గాలి :

పానీయములు.

నియమితకాలక్రమముగ { ఒకేగంటకు. మధ్యాహ్నము అమావాస్య : పౌర్ణమి.

వాసనలు ;

**ఉపశమనములు.**

బహిరంగమైనగాలి.

ఉష్ణము.

భుజించుట : గుటకవేయుట.

1 నులిపురుగులు తుట్టలుతుట్టలుగా వెడలుట (సినా, సిలికా, స్పైజీలియా).

2 నులిపురుగుల వలన కంపముసంబంధమైన వణుకు : కండరములు నులిబెట్టుట : (సినా, సోరినమ్).

3 కంఠము, పొడిగానుండుట.

## శాంబుకస్ :—(Sambucus)

స్థానములు.

శ్వాసావయవములు
శ్వాస :
మూత్రపిండములు
చర్మము.

ఉద్రేకములు.

పొడిగాలి : శీతగాలి.
చల్లనిపానీయములు : వేడి గలుగ జేయుచున్నప్పుడు.

ఉపశమనములు.

తల పల్లముగానున్నప్పుడు.
సన్నని మొనగల వస్తువుపై అదిమి పట్టుట ;
చలనము : కప్పుకొనుట.

1 అర్ధరాత్రమునకు పిమ్మట ఉక్కిరిబిక్కిరిజేయు దగ్గు : పిల్లలు ఆకస్మిక నిద్రనుండిలేచి దగ్గుచే ఊపిరాడక, ముఖము నల్లబడి, శ్వాస కొరకు పెనుగులాడుట : కోరింతదగ్గు : చెమటపట్టుట.

2 శరీరమునం దనేక భాగములు నీరుపట్టుట : ముఖ్యముగా పాదములు, అరికాళ్లు నీరుపట్టుట.

---

## శాంగ్వినేరియా :—(Sanguinaria)

స్థానములు.

కుడిభాగము { తల ; కాలేయము. గుండె. డెల్‌టాయిడ్ గ్రంధి.

ఉద్రేకములు.

కాలక్రముముగ { సూర్యగమనముతో ప్రతివారము, ప్రతిరాత్రి.

రక్తప్రసరణ నిర్మాణము.
రక్తనాళములు.
అనుత్స్వచలములు.
జ్ఞానకోశము ;

వాసనలు ; కుదుపు ; వెలుతురు.
చేయి పైకెత్తుట ; పైకిచూచుట.

ఉపశమనములు.

నిద్ర ; వీపుపై పరుండుట.
వాంతి : చల్లనిగాలి.
అపానవాయువులు వెడలుట.

1 కాలక్రమముగ (periodically) వచ్చు తలపోటు ; చలితోను, ఉష్ణముతోను వచ్చును.

2 తల వెనుకభాగమున తలపోటు ప్రారంభించి, పైకి విస్తరించి కుడి కన్ను పైభాగమున నిలచియుండును. (సిలికా)—(ఎడమకంటిపై నిలచియుండునపుడు స్పైజీలియా).

3 దవుడ ఒకటిగాని రెండుదవుడలుగాని, గుండ్రనిఆకారములో ఎర్రబడియుండుట.

4 కంఠములో గురగురలాడుటవలన కలుగు పొడిదగ్గు. గుండెలయొక్క రొమ్ముభాగమున ప్రాకుచున్నట్లుండుట.

సికేల్ :— (శోరాదోషహరణకరము) త్రివిధదోషములలోను పనిచేయుట

(Secale cor)

**స్థానములు.**

కండరములు { రక్తనాళములు, గర్భకోశము }

రక్తము.

నరములు.

కార్డి ; కాళ్లుచేతులు.

**ఉద్రేకములు.**

ఉష్ణము ; బహిర్భాగములో.

గర్భిణీ : ద్రవములుపోవుట.

**ఉపశమనములు.**

శీతలము ; స్నానముచేయుట.

కప్పుకొనకుండుట.

ఉయ్యాల ఊగుట ; బలవంతముగ సాచుట.

1 బలహీనతవలన కలుగు గర్భాశయ రక్తస్రావములు ; ముఖ్యముగా, గర్భస్రావము కలిగినపిమ్మటను, ప్రసవమైనపిమ్మటను, కలుగు రక్తస్రావములు ; స్రావము నల్లగను, మిక్కిలి దుర్వాసనగనుయుండును. కదలికవలన స్రావముహెచ్చును. రక్తస్రావముచే మరణాసన్నమగుట ;

2 శరీరము మిక్కిలి చల్లగానున్నను రోగి కప్పుకొనలేకపోవును. శరీరమునందలి ఉడుకుచే రోగి క్రిందనేలపై దొర్లును. కాళ్ళుచేతులు మంచువలె చల్లగానుండును.

3 కలరాలో అంత్యావస్థ : శరీరము చల్లగానుండును, గాని కప్పుకొనలేకపోవును (కేంఫరు) చల్లదనముకొరకు నేలపై పరుండును.

4 నాడి మిక్కిలి చురుకుగను, అల్పముగను, విడిచివిడిచి కొట్టుకొనచుండును.

## సెలీనియమ్ :—(Selenium)

**స్థానములు.**

నరములు { మర్మావయవమూ, మూత్రావయవములు.

గాలిగొట్టము.

కాలేయము.

**ఉద్రేకములు.**

నీరసకారణములు { ఉష్ణదినములు. అధికసంభోగము. నిద్రలేమి.

పాడుట ; నిద్రబోయినపిమ్మట.

టీ త్రాగుట ;

**ఉపశమనములు.**

సూర్యాస్తమానమయినపిమ్మట.

చల్లగాలి పీల్చుటవలన.

1 ముఖము, కాళ్ళుచేతులు, లేక ప్రత్యేక అవయవములు నీరసించుట.

2 వ్యాపారమునందు మరుపు ; మరచిన విషయములను నిద్రలో కలగనుట.

3 టీ, సారాయములు, సోడా మొదలగునవి త్రాగినమీద వచ్చు తలనొప్పి ; వ్యభిచారమువలనకలుగు తలనొప్పి.

4 తలపైన, కనుబొమ్మలయందు, మర్మావయవములయందుగల వెంట్రుకలు రాలిపోవుట ; మీసములు రాలిపోవుట.

5 నపుంసకత్వము ; సంభోగవాంఛతోకూడిన నపుంసకత్వము, సంభోగశక్తి లేకపోవుట ; సంభోగాంతమున నీరసము ; నిరుత్సాహము.

6 లేపనముతగ్గుట : స్రవించుట : అతిశీఘ్రముగ స్ఖలమగుట. సంభోగానంతరము నిరుత్సాహము : నీరసము : నిద్రలోను కూర్చున్న

ప్పుడు తెలియకుండగనే శుక్లముకారిపోవుట : విరేచనమగునప్పుడు శుక్లము స్ఖలనమగుట : అప్రయత్నముగపోవుట :

7 మానసిక శరీరపరిశ్రమలవలన సులభముగ బలహీనముకలుగుట : నీరసము :

8 చలిగాలిగాని, వేడిగాలిగాని కిట్టకుండుట.

9 పరుండి నిద్రపోవలెనని అపుకొనలేనికోరిక :

---

సిపియా :—(Sepia) { సోరాదోషహారణకరము / సైకోసిస్ దోషహారణకరము / సైకోసోరిక్

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| నల్లరక్త ప్రసరణ { జీర్ణావయవమార్గము. / స్త్రీ. / మస్తిష్కావయవములు | చల్లగాలి ; మంచు ; |
| | అధికసంభోగము. |
| నరములు. | బహిష్టుకుముందు. |
| చర్మము. | గర్భిణీ ; గర్భస్రావము. |
| | ఉదయము ; సాయంత్రము. |
| | ప్రథమనిద్రకుపిమ్మట. |
| | **ఉపశమనములు.** |
| | తీవ్రమయిన చలనము. |
| | ఉష్ణము ; చల్లనిపానీయములు. |

1 ముక్కుపై పసుపుపచ్చనిచార: ముఖముపై పసుపుపచ్చనిమచ్చలు:

2 శరీరముపై అందుముఖ్యముగా గుండెలపైనను కడుపుమీదను బూడిదరంగువంటి ప్లీహాసంబంధమైనమచ్చలు :

3 స్త్రీ మర్మావయవములనుండి సమస్తము బైటపడిపోవునట్లు తోచుట: అట్లుపడకుండ ఆపుజేసికొనవలయునని కాళ్ళు దగ్గరగపెట్టుకొని కూర్చుండుట:

4 కుసుమ పసుపుపచ్చగగాని, పాలవలెగాని, చీమువలెగాని యుండుట లేక మిక్కిలిదుర్వాసనతోకూడిన ద్రవముతోవెడలుచుండుట: కుసుమచే మర్మావయవము వరయుట.

5 నడుములోనీరసము, నొప్పి, కూర్చున్న అధికమగును.

6 మిక్కిలివిచారము: ఏడ్చుచుండుట: గర్భాశయరోగములతో ఒంటరిగాకూర్చుండుటకు భయము పురుషులన్న భయము: స్నేహితులనుకలుసుకొనుటకు భయము.

7 తనవ్యాపారమునందును కుటుంబమునందును విముఖత.

8 అధికకాంక్ష: లోభిత్వము (లైకో).

9 పనిచేయుటకుగాని, ఆడుకొనుటకుగాని విముఖత. ఏపనిచేయుటకు లేక ఆలోచించుటకు కిట్టదు.

10 దీర్ఘకాలమునుండిగల తలపోటుతో వెంట్రుకలు విస్తారమురాలిపోవుట.

11 సంతానముగలస్త్రీలకు వచ్చుడొసరకడుపు (పిల్లలడొసరకడుపు సల్పారు.)

12 కడుపులోనీరసము నిస్సత్తువ; భుజించుటవలన తగ్గదు.

13 మలబద్ధము; గర్భిణీలోమలబద్ధము (అల్యూమినా;) విరేచనము రాళ్ళవలె మిక్కిలికష్టతరముగావెడలుట; విరేచనానంతరము, విరే

చనము వెడలునపుడు బాధ (నైట్రిక్ యాసిడ్, సల్ఫరు.) ఆసనములో బంతి లేక ఉండ యున్నట్లుభావన.

14 మూత్రము ; అడుగుభాగమున మట్టిరంగువంటిమడ్డి జిగురుగా పాత్రకుపట్టియుండుట ; మూత్రముమిక్కిలి దుర్వాసనగాయుండుట ; గదిలోమూత్రమువిడిచిన భరింపలేనంత దుర్వాసనగాయుండి వెంటనేకడిగివేయవలసియుండును.

15 పిల్లలుపక్కలో మూత్రమువిసర్జించుట ; మొదటినిద్రలోనే మూత్రమువిసర్జించుట.

16 సెగస్రావము ; బట్టకు పసుపురంగుమరకయగుట ; ఉదయమున మూత్రద్వారము అంటుకొనిపోయియుండుట ; దీర్ఘకాలమునుండి గల సెగస్రావము : మర్మావయవములు నీరశించి బలహీనమగుట.

17 స్త్రీ మర్మావయవమున తీవ్రమైనపోటు ; మర్మావయవమునుండి పొత్తికడుపులోనికి చురుకు చురుకుమనిపోట్లు.

18 గర్భస్రావము ; మర్మావయవముజారుట ; పొత్తికడుపు క్రిందకు దిగలాగు చున్నట్లుండుట ; అందుచేకాళ్ళు దగ్గరకు బిగబట్టి కూర్చుండుట ;

19 ఋతుదోషము ; సకాలములో బహిష్టుకాకుండుట ; సకాలమునకు మున్నే బహిష్టగుట ; ఆలశ్యముగ బహిష్టగుట ; బహిష్టుస్రావము కొలదిగయుండుట ; విస్తారముగయగుట. ఒకపర్యాయమే యగుపించి తగ్గిపోయి యిక యగుపించకుండుట.

20 వేవిళ్ళు ; అన్నముచూచుసరికి లేక తలంపుకలుగుసరికి వికారను వచ్చుట ; (నక్కు ) వంటవాసనవలన వికారమువచ్చుట (ఆరుస కొల్చికమ్.)

21 దురద ; వివిధభాగములయందుదురద ; మర్మాశయములయందు దురద ; గోకిన వుపశమనములేకుండుట ; గోకినపిమ్మట మంట బయలుదేరుట (సల్ఫర్.)

22 తామర ; (ఆర్సు, రూస్టాక్సు.)

N. B.—యీ ఔషధమునకు ముందుగాని వెనుకగాని లేక సిక్ వాడరాదు ; పల్సెటిల్లాతో మార్చి యీ ఔషధమీయరాదు. ఒక్కమోతాదు చాలదినములు పనిజేయును ; తరుచుసిలికా, పల్సె, వాడినమీాదట పనిజేయును. వ్యాధిలక్షణముల నడిగినపుడారోగి ఏడ్చును.

---

సిలికా :—(Silicea) { (శోరాదోషహారణకరము) (సైకోసిస్ దోషహారణకరము.) (సూడోసోరిక్) }

స్థానములు.

జీర్ణక్రియ : ఆహారపుష్టి : పిల్లలు
ధాతుమజ్జాతంతువులు { సాగెడి. కణముల.
నరములు : గ్రంధులు.
ఫిస్టులా : చెవిగొట్టము ; కన్నీటి నాళము :
ఎముకలు :
ఆమత్వచలము ;
చర్మము :

ఉద్రేకములు.

చల్లగాలి : చెమ్మ : చన్నీటి స్నానము ; కప్పుకొనకుండుట :
కాళ్ళచెమటలు నిలుపుచేయుట :
భరింపలేకపోవుట { నరములఉద్రేకము. వెలుగు : ధ్వని వెన్నెముక కుదుపు
చంద్రగమనమార్పు : రాత్రి ;
మానసికవ్యాయామము. : సారాయము :

ఉపశమనములు.

వెచ్చటిదుప్పట్లు కప్పుకొనుట :
తలకు దుప్పట్లుచుట్టుట :
జారీగ మూత్రమువెడలుట.

1 తలపోటు ; తలను గట్టిగ దేనితోనైనను కట్టిపెట్టుటవలనను, లేక వెచ్చదనము గలుగునట్లు నేదియైన చుట్టుటవలనను ఉపశమనముగ నుండును.

2 ముఖ్యముగా రాత్రియందు చెమటచే తల తడిగానుండును.

3 త్రాగునీరు అరుచిగానుండుట ; త్రాగినవెంటనే కక్కివేయుట.

4 శరీరమంతయు మంచువలె చల్లబడి ఋతుస్రావము అధికమగుట.

5 పాదములకు దుర్వాసనతోకూడిన చెమటపట్టుట ; యీచెమటవలన పాదములు వరయుట ; పాదముల చెమట అణచిపెట్టుటవలన కలుగు వ్యాధులు.

6 పరిశ్రమచేసినను శరీరమునకు ఉష్ణము కలుగకుండుట.

7 టీకాలు వేయుటవలన కలుగు వ్యాధులు, బాధలు, కురుపులు, కంపములు మొదలగువానిని నివారణజేయును.

8 కురుపు నెమ్మదిగా ఎదుగుట ; చీముపట్టకుంటుట ; యీమందు వెంటనే చీముపట్టించి చితుకజేయును. విస్తారముగా చీము కారుచున్న చీమును హరింపజేసిమాన్పును.

9 నీరసము ; నిస్సత్తువ ; ఎల్లప్పుడు పరుండవలెననియుండును.

10 నరముల నిస్సత్తువ ; బహిరంగమయినగాలిలో పరిశ్రమలేక గదులలో నిరంతరము విశేషముగ పనిచేయుటవలన కలుగు నరముల నిస్సత్తువ.

11 దీర్ఘకాలమునుండిగల తలపోటు; మెడనుంచి పైకి విస్తరించు తలపోటు; చిన్నతనమున, దీర్ఘవ్యాధినుండి బయలుదేరు తలపోటు (సోరినమ్). కుడికంటిపై నిలచియుండు తలపోటు (ఎడమకన్ను స్పైజీలియా).

12 మలబద్ధము; ఆసనమున బలములేక కష్టతరముగ విరేచనమగుట; విరేచనము కష్టతరముమీాద కొంతబైటకువచ్చి తిరిగి వెనుకకు మరలుట (తూజా).

13 శిశువు పాలు త్రాగినపుడెల్ల స్త్రీ మర్మావయవమునుండి రక్తము స్రవించుట.

14 గుండె లక్షణముతో ఆసనగండమాల (fistula) (కాలీఫాస్).

15 అనారోగ్యమయిన చర్మము; చిన్నదెబ్బగూడ చీముపట్టుట (హెపార్, గ్రైఫైటీస్, మెర్క్యురీ, పెట్రో).

16 కాళ్ళకు శీతలము తగులుటమూలమున రొంపపట్టుట.

17 కాళ్లకు, చేతులకు, చంకలలోను, దుర్వాసనతోకూడిన చెమట పట్టుట.

18 సాయంత్రమున చెమటలేకుండగనే కాళ్లనుండి దుర్వాసనవచ్చుట.

19 కురుపులు, రణములు, రాచకురుపులు, కొయ్యగండలు, ఆసనగండమాల, దుష్టరణములు, పుప్పిగోళ్లు, వీనిని నివారణజేయును.

20 ఆసనము చిట్లుట: విరేచనమైనపిమ్మట విపరీతమైన బాధ.

21 శరీరములోనికి గుచ్చుకున్నమోళ్లు, గసిగెలు, ఎముకముక్కలు, మేకులు, గాజుముక్కలు, మొదలగువానిని చీముపట్టించి వెలువరించును.

22 నిద్రలోలేచి నడచుట: నిద్రలోలేచి కొంతదూరము నడచి పరుండుట.

23 జీర్ణశక్తిలేక మలబద్ధముతో బాధపడుట (కల్కేరియా).

24 పెద్దతలగల పిల్లలు. తలపై విస్తారముగా చెమటపట్టుట: ఉూసర కడుపు: బలహీనమైన శీలమండెలు: సకాలములోనడువలేకపోవుట.

25 కండరములు (Glands) వాచుట: చీముపట్టుట.

N. B.—మెర్క్యురీకి ముందుగాని వెనుకగాని వాడరాదు. అట్లు వాడవలసివచ్చిన మధ్య హెపార్ ప్రయోగించి వాడవలెను. సిలికా ప్రయోగించిన పిమ్మట గుణము స్థిరముగా నడువక యున్న పరిస్థితులలో సల్ఫరు ఒక్కమోతాదు యిచ్చిన సిలికా గుణమును వృద్ధిచేయును (క్లార్క్).

---

## స్పైజీలియా :—(Spigelia)

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| నరములు { స్పర్శజ్ఞాన. హృదయము. మెడ: | స్పర్శ: |
| ధాతుమజ్జాతంతువులు. | చలనము: కుదుపు; |
| కండ్లు; పళ్లు: | కాలక్రమముగ: సూర్యగమనముతో: |
| ఎడమభాగము. | పొగాకు. సంభోగము |
| | చేతులు పైకెత్తుట. |
| | **ఉపశమనములు.** |
| | తల ఎత్తుగానుంచి కుడివైపున పరుండుట. |

1 తలపోటు: కాలక్రమముగ ఉదయమున మెదడువద్ద ప్రారంభించి తలయంతయు విస్తరించి, ఎడమవైపున కంటిపైననిలచును (కుడి కంటిపైన సాంగ్వినేరియా, సిలికా), తలపోటు సూర్యోదయముతో ప్రారంభించి మధ్యాహ్నమగుసరికి పూర్తిగాహెచ్చి సూర్యాస్తమానమునకు తగ్గును (నేట్రమూర్).

2 కంటిగుడ్డునందు భరింప శక్యముగాని బాధ. కంటిగుడ్డు కదల్ప లేకపోవుట:

3 విపరీతమైన పండ్లపోటు: చన్నీళ్లచే ఉద్రేకించును: పరున్న అగుపడదు.

4 ఆయాసము: కుడివైపునమాత్రమే తల ఎత్తుగానుంచి పరుండగల్గుట: కదలిన గుండెదడ ఆయాసము, ఆతురత హెచ్చును.

5 గుండెదడ: పైకి స్పష్టముగా కనబడునట్లు గుండె తీవ్రముగా కొట్టుకొనుట: ముందుకువంగిన గుండెదడ హెచ్చుట.

---

## స్పాంజియా:—(Spongia)

| స్థానములు. | ఉద్రేకములు. |
| --- | --- |
| హృదయము: గదులమూతలు. | చల్లగాలి; పొడిగాలి. |
| గాలిగొట్టము: ఆహారగొట్టము | నిద్రనుండిలేపుట. |
| గ్రంథులు. | వ్యాయామము. |
| | చేతులపైకెత్తుట. |
| | రాత్రి 12 గంటలకు ముందు. |

ఉపశమనములు.

తల క్రిందకుపెట్టి పరుండుట.
క్రొలదిగా భుజించుట.

1 థైరాయిడ్ గ్రంథి (Thyroid gland) వాచి గట్టిపడి, రాత్రిభాగ మున శ్వాసబంధించుట.

2 అండములు వాచుట : చితుకకొట్టినట్లు దిగలాగుచున్నట్లు బాధగా నుండుట : శుక్లవాహికలోనికి అండములనుండి చురుకుచురుకుమని పోట్లు : శుక్లవాహిక వాచి పోటుగానుండుట.

3 దగ్గు : గురుగురలాడుట : శ్వాసపీల్చుటవలన ఉద్రేకించుట : అర్థరాత్రమునకు ముందు ఉద్రేకించును (ఉదయమునకుముందు హెపార్).

---

స్టానం :—(Stannum) { (శోరాదోషహరణకరము) (సూడోసోరిక్)

స్థానములు

నరములు.
ఆమత్వచలములు
గుండె.
స్త్రీ మర్మావయవములు.

ఉద్రేకములు.

మాట్లాడుట : శీతలము.
ఉదయం 10 గంటలకు.
నెమ్మదిగా నడచుటవలన.
కుడిప్రక్కకు పరున్నపిమ్మట.

ఉపశమనములు.

త్వరితగమనము.
గట్టిగానొక్కుట : కోనుపై నొక్కుట :
శ్లేష్మము : ఉమ్మివేయుట.

1 కంఠమునందు నొప్పి: కంఠము బొంగురుపోవుట; గుండెలలో విపరీతమైన నీరసము. మాట్లాడలేనంత నీరసముగానుండుట: మాట్లాడినను నవ్వినను దగ్గుహెచ్చుట.

2 కంఠమునందు శ్లేష్మముజేరి కొద్దిదగ్గువలనగూడ పైకిపడిపోవుట.

3 విపరీతమైననీరసము: ఉదయమున బట్టకట్టుకొనునప్పుడు నీరసముచే విశ్రాంతికొరకు పలుమార్లు కూర్చుండవలసివచ్చుట

4 శ్లేష్మము తియ్యగానుండుట (సిపియా) పుల్లగాను దుర్వాసనగాను యుండుట.

5 తలపోటు: స్వల్పముగా ప్రారంభించి క్రమముగా హెచ్చి పిమ్మట క్రమముగాతగ్గుట.

6 గట్టిగాచదువుటవలనగాని మాట్లాడుటవలనగాని విస్తారమైన నీరసముకలుగుట.

---

స్టాఫిశాగ్రియా:— (మిశ్రమత్వతము) (సోరాదోషహారణకరము) (సైకోసిస్‌దోషహారణకరము) (సిఫిలిస్‌దోషహారణకరము)

**(Staphy sagria)**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| నరములు: పండ్లు. | ఉద్రేకములు. ఆశాభంగమువలన |
| మూత్రావయవ మర్మావయవ మార్గము: | విసువుదలవలన |
| | కోపమువలన |
| | దెబ్బలాట్లవలన |

ధాతుమజ్జాది తంతువులు గ్రంధులు. { కనురెప్పలు చర్మము.

అధికసంభోగము. ముష్టిమైథనము: సూదిమొనవంటి ఆయుధములు గుచ్చుకొనుటవలన కలుగు గాయములు.
పాదరసము: రాత్రి
ఉపశమనములు.

ఉష్ణము: విశ్రాంతి;
ఉదయభోజనము:

1 ముష్టిమైథనముమొదలగు దురభ్యాసములకు లోనగుటవలనను, అధిక సంభోగమువలనను కలుగు మానసికవ్యాధులు: యితర వ్యాధులు.

2 ముష్టిమైథునము: ఈ కృత్యముజేయకుండ మనస్సు నాపుకొనలేక పోవుట. నిరంతరము సంభోగవిషయములపై మనస్సుండుట. సంభోగవిలాసలగూర్చి నిరంతరము ఆలోచించుచుండుట.

3 శుక్లనష్టము: వర్చస్సు కళావిహీనమగుట: స్ఖలనమైనపిమ్మట నడుమునొప్పి; నీరసము: మర్మావయవము; బలహీనమగుట ఎండి పోవుట.

4 నడుమునొప్పి: రాత్రిపరున్నపుడు ద్రేకించుట; ఉదయమునలేచు టకుముందు హెచ్చుగానుండుట.

5 పొగాకుకొరకు అధికమైనవాంఛ.

6 పండ్లుచల్లబడుట: పండ్లచిగుళ్ళు ముక్కలుగాడూడిపోవుట:

7 కడుపునిండభుజించినను ఆకలిగానుండుట.

8 నరముల నిస్సత్తువ.

9 మూత్రానుమానము : మూత్రము విసర్జించుటకు కొన్నిగంటలు కూర్చొనవలసియుండుట ; యుక్తవయస్సుగల స్త్రీలలో సంభోగానంతరము, ప్రసవమైనపిమ్మట కలుగు యిట్టిమూత్రానుమానము. మూత్రవిసర్జన కాలమందుగాక యితర సమయములయందు మూత్రావయవమున మంట.

10 మర్మావయవములు మిక్కిలినొప్పిగానుండుట.

11 పదునైనఆయుధములవలన కలుగుగాయములు బాధకరముగానుండుట ; గాయములయందలి సలుపును పోటును నివారణజేయును.

12 ముష్టిమైథునమువలన లేక అధికసంభోగమువలనకలుగు అపస్మారము ; మనోవ్యాధి.

13 కంటిరెప్పలపై బయలుదేరుకురుపులు.

---

## స్ట్రామోనియమ్ :— (Stramonium)

**స్థానములు.**

మెదడు ;

రక్తప్రసరణ. { కంఠము, చర్మము

వెన్నెముక నరములు { చేతులు ; ఎడమ తుంటి. మర్మావయవములు.

**ఉద్రేకములు.**

ప్రకాశించువస్తువులు.
భయము ;
నిద్రబోయినపిమ్మట ;
చీకటి ; మబ్బురోజులు.
అణచిపెట్టుట ;
త్రాగబోతుతనము ;

**ఉపశమనములు.**

వెలుతురు ;
సహవాసము ; ఉష్ణము ;

1 సంధి; పరుగెత్తుట (బెల్, బ్రయో, రూస్.) విడువకుండ మాట్లాడుట; పాటలుపాడుట; కోపోద్రేకముజెందుట; కరచుట; కొట్టుట.

2 పిచ్చి; పాటలుపాడుట; నిరంతరము విడువకుండ మాట్లాడుచుండుట; కోపము; కొట్టుట; కరచుట; మలము నోటిలోబెట్టుకొనుట. ఋతువు అణచిపెట్టిబడి అపస్మారము (Hysteria): మత సంబంధమయిన పాటలుపాడుట; ప్రార్ధనలు సలుపుట; భజన చేయుట; భక్తితోకూడిన చేష్టలు; అతిఘోరణిగ మాట్లాడుట;

3 కండ్లు తెరిబారిచూచుట. దెయ్యములు భూతములు యగుపడుట; భూతములతో మాట్లాడుట; ఆకాశవాణి వినబడుట.

4 సహవాసముకొరకు, వెలుతురుకొరకు వాంఛించుట; ఒంటరిగా యుండలేకపోవుట; చీకటిలో నుండలేకపోవుట. సంతోషమునుండి వేగముగ దుఃఖములోనికిమారుట.

5 కంఠము బిగబట్టుటచే మింగుట కష్టమగుట.

6 పిల్లలు భయోత్పాతముతో నిద్రనుండిలేచి, చూచిన ప్రతివస్తువు భయముగొల్పునదిగ యగుపడి వానిబారినుండి పారిపోవజూచుట.

7 వ్యాధిలో ఏ విధమయిన బాధలేకపోవుట. బాధలేకపోవుట సహజ లక్షణము (ఓపి).

8 నిద్రమత్తుగానుండి నిద్రించలేకపోవుట (బెల్,—ఓపి). నిద్రలో విపరీతమయినగుర్రు;

9 స్మృతితోకూడిన కంపములు (నక్సు).

10 చలిలో తలవేడిగానుండుట; కప్పుకొనకుండుట.

11 ముఖము ఎర్రగాను వేడిగానునుండి పాదములు చల్లగానుండుట.

12 నీళ్లు, అద్దము, కాంతిగానుండు ప్రతివస్తువు కంపములను తిరిగి కలుగజేయుట.

13 నత్తి; నత్తిచే మాటవచ్చుట మిక్కిలి కష్టతరమగుట; మిక్కిలి ప్రయత్నముమీద మాట్లాడవలసివచ్చుట. తలగడనుండి తలను తరుచు ఎత్తుచుండుట.

14 తలగడనుండి తలయెత్తినవెంటనే వాంతియగుట.

15 మూత్రమణచిపెట్టబడుట; మూత్రకోశమున మూత్రములేకుండుట.

16 బహిష్టు స్రావము విస్తారముగ వెడలుచు చాలకాలముండుట (Metrorrhagia). ఆ వ్యాధిలో పాటలుపాడుట; భగవంతుని ప్రార్థించుచుండుట; అతిఘోరణి; సూతికాసంబంధమయిన మతిభ్రమ (ఈఔషధమునకుగల మానసికసహజలక్షణములతో).

N. B:— ఈఔషధమునకు బెల్లడోనాకంటెతక్కువజ్వరము హయోస్ కంటె ఎక్కువజ్వరముకలదు. అధికమయిన మానసోద్రేకము కలుగజేయగలదు గాని బెల్లడోనావలె వాపుతో కూడిన ఉద్రేకము కలుగజేయజాలదు.

సల్ఫర్ :—(Sulpher) (శోరాదోషహరణకరము)

స్థానములు.

రక్తప్రసరణ { నల్లరక్తము. ఉదరము.

జీర్ణావయవములు.

రసస్రావఅమత్వచలములు.

మలాశయము ; గుండె ;

చర్మము ; మడతలు.

నడినెత్తి ; అరికాళ్లు ;

కీళ్ళు ; గ్రంధులు.

ఉద్రేకములు.

అణచిపెట్టుట.

స్నానము : పాలు.

ఉష్ణము { వ్యాయామమువలన కలుగు. పరుపుయొక్క. ఉన్నిబట్టలు మొదలగు వానివలన.

వాతావరణమార్పు.

కాలక్రమముగ { ఉదయం 10 గంటలకు. ముట్లుడుగుకాలము పౌర్ణమి (సినా, సిలికా).

ఉపశమనములు.

బహిరంగమైనగాలి ; చలనము.

ఉష్ణకాపటములు ; పట్లు ;

చెమట : పొడివేడి ;

1 ఆకలి మాందము : విపరీతమైనదాహము.

2 ఉదయము పదకొండుగంటలకు కడుపులో మిక్కిలి నీరసము : భోజనము చేయకుండ ఆగలేకపోవుట.

3 అర్థరాత్రమైన పిమ్మట కొన్నిగంటలకు విరేచనములు వెడలుట : లేక. ఉదయముననే పడకనుండిలేచి విరేచనమునకు పరుగిడవలసియుండుట.

4 విరేచనమగునప్పుడు, మూత్రమగునప్పుడు ఆ భాగములు బాధకర ముగ నుండుట. తెల్లటిమూత్రము విస్తారముగా వెడలుట. ఆసనము వరయుట

5 స్త్రీమర్మావయవము మంటగానుండుట, అందుచే స్థిమితముగ కూర్చుని యుండలేకపోవుట.

6 రాత్రిభాగమున ఉక్కిరిబిక్కిరిగానుండుట. అందుచే తలుపులు కిటికీలు తెరచియుంచగోరుట, ఉడుకు.

7 సాయింత్రము పరున్నపుడు, గుండెలలో నీరసముగానుండుట.

8 స్థిరముగా నడువలేకపోవుట, చేతులు వణకుట.

9 నిలుచుట మిక్కిలి కష్టతరముగానుండును: నిలచిన సమస్తబాధలు ఉద్రేకించును.

10 తిన్నగా నిలువబడి నడువలేకపోవుట. వంగి నడుచుట: కూర్చున్నపుడుగూడ వంగికూర్చుండుట.

11 స్నానముచేయుటకు విముఖత: అపరిశుభ్రముగానుండుట: మురికి దుస్తులు ధరించుట. రోగి అపరిశుభ్రదుస్తులు ధరించి అపరిశుభ్రముగా నుండును.

12 అరికాళ్లలోవేడి, ఉడుకు; పాదములు చల్లగానుండి అరికాళ్లయందు మంటలు: చల్లటిప్రదేశములో కాళ్లుంచుటకు కోరుచుండుట. అరికాళ్లయందు మంటలచే ప్రక్కనుండి కాళ్లు బైటకుబెట్టుట.

13 పిక్కలు, అరికాళ్లు, పాదములు ముఖ్యముగా రాత్రిభాగమున నులిబెట్టుచున్నట్లు లాగుట.

14 ఉడుకు : నిస్త్రాణ : నీరసము :

15 శరీరమున దురద ; గోకినమంట, పుండుపడుట : చర్మముయొక్క మడతలలో వరయుట : (లైకో) పడకవేడిమివలన దురదహెచ్చుట.

16 పగటియందు ఆపుకొనలేని బద్ధకము ; మత్తు : రాత్రియంతయు మెలకువగానుండుట.

17 ప్రత్యేకభాగములయందు అనగా, కండ్లు, ముక్కు, గుండెలు, కడుపు, స్త్రీ అండాశయము, కాళ్లుచేతులు లేక యితర అవయవములయందు రక్తకూటమి (congestion).

18 పెదవులనుండి రక్తము స్రవించుచున్నట్లు మిక్కిలి ఎర్రగానుండుట.

19 మంట : తలపై మంట : కండ్లుమంటలు : ముఖముమంట : నోటిలో పొక్కులు మంట : కంఠములో పొడిగానుండి మంట : జీర్ణకోశములో మంట : ఆసనములో మంట : మలాశయము మంట : దురదతోకూడిన మూలశంఖ : మంటతోకూడిన మూత్రము : శరీరమంతయు మంట : రెక్కగూడులమధ్య మంట.

20 శరీరద్వారములు (ఆసనము, ముక్కు, నోరు మొదలగు నవద్వారములు) ఎర్రగానుండి వరయుట : శరీరమునుండి వెడలు సమస్త స్రావములు, ఆయాభాగములయందు వరుపు కలుగజేయుట : దురదమంట పుట్టించుట

21 బహిష్టు సకాలమునకుముందే విస్తారమైన ఋతుస్రావముతో దీర్ఘకాలము వెడలుట.

22 సబ్బులు మొదలగువానితో చికిత్సచేయబడిన చర్మవ్యాధులు : తైలములతో చికిత్సచేయబడిన మూలశంఖ.

23 వివిధావయవములయందు ఒక్కమారుగా బయలుదేరు కురుపులు లేక ఒకకురుపు మానినపిమ్మట వేరొక కురుపు బయలుదేరి యిట్లే విడువకుండ కురుపులు బయలుదేరుట.

24 మలబద్ధము : దీర్ఘకాలమునుండిగల కఠినమైన మలబద్ధము : విరేచనము గట్టిగా రాళ్లవలె కాలినరంగులో వెడలుట (బ్రయో). బాధకలుగజేయు పెద్దవిరేచనము : బాధచే విరేచనము గావించుటకు భయపడుట : ఒకసారి విరేచనములు ; ఒకసారి మలబద్ధము యిట్లు మారుచుండుట.

25 మెదడులోను, ఊపిరితిత్తులయందు, కీళ్ళలోను, వాపుమొదలగు లక్షణములను బ్రయోనియా, కాలీమూరు హరింపజేయజాలనపుడిది నివారణజేయును.

26 వ్యాధిలక్షణముల కనుకూలమైనమందు ప్రయోగించినపుడు సుగుణముయగుపడని సందర్భములయందీ ఔషధమును ప్రయోగించిన ప్రతీకారగుణము (reaction) కలుగజేసి నివారణజేయును.

27 కడుపులోశిశువు తిరుగుచున్నట్లు తిరుగుట (క్రోకస్, తూజా.)

28 ఆహ్లాదకరమైనకలలు ; పాడుచు మేల్కాంచుట.

N. B.— సల్ఫరుకుముందు కాల్కేరియావాడరాదు.

---

## సల్ ఫ్యూరిక్ యాసిడ్:— (సోరాదోషహరణకరము.)

**(Sulphuric Acid)**

| స్థానములు. | ఉద్రేకములు. |
|---|---|
| జీర్ణానయవమార్గము. | బహిరంగమైనగాలి, |
| రక్తము ; | శీతలము ; సారాయములు. |
| రక్తనాళములు. | గాయములు. |
| ఎడమభాగము. | కాఫీవాసన ; |
| | సాయంత్రము ; |
| | అధికమైనఉష్ణము లేక శీతలము. |
| | **ఉపశమనములు.** |
| | వేడిపానీయములు ; |
| | తలదగ్గిర చేతులుంచుట. |
| | సౌమ్యమైనవాతావరణ ; |

1 స్నానముచేయించుచున్నను శిశువుయొక్క శరీరము పుల్లనివాసన వేయుట (హెపార్, రూమ్.)

2 త్రాగినప్రతిపానీయము, జీర్ణకోశమున చలికలుగజేయుట.

3 లోతుగవేళ్లుబారిన రక్తదోషముచే మిక్కిలినీరసము. నిస్రాణ ; యితరలక్షణములెవ్వియు లేకుండుట (సోరినమ్, సల్ఫర్.)

## సిఫిలినమ్:— (Syphiliinum) (సిఫిలిన్ శాంతికరము.)

**స్థానములు.**

ఆమత్వచలములు.
నరములు.
ఎముకలు.

**ఉద్రేకములు.**

రాత్రి; సూర్యాస్తమానము మొదలు సూర్యోదయము వరకు.
నాలుకచాచుట.
అధికమైనఉష్ణము; లేక శీతలము.
ఉరుములతోకూడిన గాలివాన.

**ఉపశమనములు.**

ఇటునటుమారుచుండుట;
నెమ్మదిగావిడువక నడచుట.

1 రాత్రిభాగమున విపరీతమైనబాధలు; బాధలు నీరెండవేళప్రారంభించి సూర్యోదయముతోశాంతించుట (మెర్క్యురీ, ఫైటోలక్కా)

2 బాధలు క్రమముగ వృద్ధిజెంది క్రమముగ తగ్గుట; మారుచుండుట. తరుచు యిటునటు పరుండుట; లేక కూర్చుండుట: రాత్రి పడునన్న భయము: బాధలు సహింపలేక చావుగోరుట.

3 సమస్తవ్యాధిలక్షణములు రాత్రి అధికమగుట (మెర్క్యురీ). సూర్యోదయము మొదలు సూర్యాస్తమానమువరకు హెచ్చుగానుండు బాధలు మెడోరినమ్‌కు కలవు.

---

4 ఎరుపురంగు లేక రాగిరంగు మచ్చలు. శీతలము జేసినప్పుడు నీలివర్ణముగా మారుట.

5 దేహము విశేషముగ కృశించుట (ఐడిన్, ఎబ్రోటనమ్).

